# భారతి

మాసపత్రిక



సంపాదకుడు

శివలెంక శంభుప్రసాద్

నవంబరు 1964

సంపుటము 41 :

విడిప్రతిక వెల ఒక రూపాయి

# విషయానుక్రమణిక

## నవంబరు 1964





# ప్రేమ ప్రదీపము

## శ్రీ ఇంద్రగంటి హనుమచ్ఛాస్త్రి

వేగునుషః ప్రభన్ గగన వీథిని బారు మరాళపంక్తులై
సాగు శరత్పయోద పరిసర్పణ ఖేలన శుభ్రమూర్తులై
మూగిన స్వప్నమాధురుల మోహన సంస్మృతి లోని పిల్పులై
'ఆగర, ఆగరా' యనెడు నక్షరముల్ మెరసెన్ పురః స్థలిన్.

ఏ మధురానుభూతి పెందయించిన తీయని గడ్డ మానొకో
యీ మహి; గాలి నింత కదలించిన నూదును ప్రేమవేణువుల్
నా మదిలోని సుప్త మృదుల ప్రియగాథల భావచిత్రముల్
తామయి మేలుకాంచి కనులన్ నడయాడు సజీవమూర్తులై.

ఈ యలలన్ దళత్తరళ నీనెడి నల్లనితళ్కు- లేమగున్?
పాయని గోపికా హృదయనాథు కథాతి మనోజ్ఞముద్రలో-
తోయము నంటి వీడని మధుస్ఫురణమ్ములు- వేణుగాన బం
ధాయత మూర్తులో! యమునవా? వహవా! కనుగొంటి నేటికిన్.

యమునకును లంకెయా ప్రణయమున కెపుడు?
ఈ సరిత్తీరమునయందు ఇవురు లెత్తు
ప్రతిలతికగుండెలో నొక రాసకేళి!
ప్రతితరువుగుండెలో నొక భావమురళి!

ఔనా- కాద? యెరుంగజెప్పు యమునా, వ్యాఖ్యాత ప్రేమామృతా*
ఆ నీ తీరములోని అద్భుతకళాహంకార కోటీర శో
భా నాట్యమ్మన హర్మ్య మొండు గన దిగ్భ్రాంతిన్ పచారించు స్వ
ప్రాణమ్ముల్ నెఱచూర విచ్చి ఎవడబ్బా- దీని వెల్గించెడిన్!

* (1960 జనవరిలో ఆగ్రాలో తాజమహల్ చూచి)

నిజ ప్రభుశక్తి వెన్నెల బట్టి చెక్కించి
ఫలకమ్ములను కుడ్యముల నమర్చి
కైలాసశిఖరి ప్రక్కల వెండిముద్దల
మెదిచిపన్నీట నందదుకు లతికి
తనదైన యెడద లోతున నుండి పరతెంచి
పొంగు బాష్పముల మెరుంగు లిచ్చి
కోటిమల్లియపూల గుండెలు వంచిన
పచ్చితేనెలను జీవమ్ము వోసి
షాజహాంచక్రవర్తి మమ్తాజు పేర
బ్రతుకుటడవిని ప్రేమతపస్వి యగుచు
కట్టు కన్నీటిమేడ అక్కజము గొలిపె!

ఎత్తిన షాజహాంప్రభుని హృచ్చషకమ్మున స్నేహాసారముల్
పొత్తిన కాలపాత్రమున ఆరని ప్రేమమయ ప్రదీపమున్,
మిత్తిమెఱుంగు కోఱల గణింపని శాశ్వత దంపతిత్వ లో
కోత్తర కీర్తికేతన మహో! యెగురున్ గగనాంచలమ్మునన్.

భారత విశాల విఖ్యాతి పరు లెరుంగ
అవి జయస్తంభములుగాగ నమరు రెండు—
జ్ఞాననిలయమ్ము ప్రాలేయనగ మొకండు!
ప్రణయ నిలయమ్ము 'మమతాజ' భవన మొకడు!



# రచయిత

# అతని సమస్యలు - 2

శ్రీ యుజ్నే ఐనెస్కో

నేను ఎందుకు వుంటున్నాను అన్నది తెలుసుకొనడానికి నాకు వేదాంతం గాని, భగవంతుని గురించిన శాస్త్రాలు గాని తోడ్పడలేదు. మనం బ్రతికి వుండడానికి అర్థం తెలుసుకొనడం మన ధర్మం అనే నమ్మకమూ కలిగించలేకపోయినవి. అర్థం చెప్పగలమని, చెప్పవలెనని నమ్మకమూ కలిగించలేదు. నేనీ ప్రపంచానికి చెందినవాడినని అనుకోను. ఈ ప్రపంచం ఎవ్వరిదో నాకు తెలియదు. అయినా నాకు గాని, ఇంకొకరికి గాని కట్టబెట్టటంకూడదు. ఇక్కడ ఉండటం నాకు కాస్త బాగా వుందంటే, అది ఇక్కడవున్న అలవాటు చొప్పునే అనాలి. నేను ఇక్కడి వాడిని కాక, ఎక్కడి వాడినోనని నా అభిప్రాయం. కాని అదెక్కడో తెలిస్తే అంతా ఇంతకంటే బాగా వుంటుంది. కాని అది చెప్పడం కష్టం. నాలో అనిర్వచనీయమైన ఒక వేదన వుండడమే వేరే ప్రపంచం వున్నదనడానికి గుర్తు. ఆ వేరే ప్రపంచం ఇక్కడే వుండి వుండవచ్చు. దానిని నేను కనుక్కోలేకుండా వుండి వుండవచ్చు. లేకపోతే నేను అన్వేషించేది బహుశః ఇక్కడ లేకపోవచ్చు. కొంతమంది సమాధాన మిచ్చారు. ఇవ్వగలమని అనుకున్నారు. పరిష్కారం చూపెట్టారు. వారి కోసం నేను సంతోషించి వారికి నా అభినందనలు తెలుపుతున్నాను. నాకు సంబంధించినంతవరకు మాత్రం—నేను—ఈ నేను అనేది నిర్వచించడం అతి కష్టం. నేను ఇక్కడే వున్నాను. నా ఆవేదనను, నా ఆశ్చర్యాన్ని వెలిబుచ్చడానికి, నివేదించడానికి నేను రచన చేస్తాను. ఇంతవరకు స్పష్టం. నేను పారిస్ పట్టణ వీధులలో నడిచినప్పుడు, ప్రపంచయాత్ర సాగించినప్పుడు నా ఆశ్చర్యాన్ని, నా ఆవేదనను నాతోపాటు తీసుకొనిపోతాను. ఒకచోట ఆగి తెలుసుకొనవలసినవి నాకేమీ కనిపించలేదు. ఒకప్పుడు వున్నాయని ఊహిస్తాను, కాని అవి స్థిరంగా వుండవు. వుండి వుండి కనపడుతూ అదృశ్యమైపోతాయి.

నేను అప్పుడే ఒక విరుద్ధ భావనలో ఇరుక్కున్నట్లు మీరు గమనించివుంటారు. దానికి కారణం ఈ ఒక్క విరుద్ధభావాన్ని క్రమమార్గంలో పెట్టే శక్తి లేకపోవడమా, లేక మొత్తం అన్నీ విరుద్ధభావాల విషయంలోను అంతేనా? మన చేతనా అవస్థలు అనేకం. ఒక అవస్థాభావం మరొక అవస్థా భావాన్ని త్రోసివేస్తుందా? రెండూ నిజమేనని నా ఉద్దేశ్యం. ఒకప్పుడు ఒక దానిని నమ్ముతున్నానని అనుకుంటాను. నేను ఆలోచిస్తున్నానని అనుకుంటాను. ఒకరి పక్షం చేరతాను. వారికోసం పోట్లాడతాను. పోట్లాడినప్పుడు గట్టి పట్టుదలతో పోట్లాడతాను. అయితే ఒకవైపున గట్టిగా పోట్లాడుతున్నా నేను చేసేది సవ్యమా? నేను వరించినదానికి గట్టి ఆధారం వున్నదా అనే సందేహం లోపల పీకుతూనే వుంటుంది. వాటిని వదిలివేయాలని వుంటుంది. నాలో లోతుగా పాతుకొనివున్న అనిశ్చిత తత్వానికి నా చేతలకు సమన్వయం కుదర్చలేకపోతున్నాను. ఇదంతా నేనెందుకు చెబుతున్నట్లు? ఏకాంతంగా వున్నప్పుడు అందరూ ఇలాంటి ప్రశ్నలు వేసుకుంటారు. ఇలాంటి అయోమయస్థితిలో వున్నప్పుడే రచయిత రచిస్తాడు. ఇది నిరూపితమైన రెండవ విషయం. పాఠకుడు దానిని గ్రహించివుంటాడు.

నేను మరొక విషయాన్ని కూడా విశదం చేయవలసివున్నది. నేను నాస్తిక—ఆస్తికత్వాలను గురించి వాదించడంలేదు. ఏదో ఒకదాంట్లో విశ్వాసం ఏర్పరచుకొనేదాని అవసరం, విలువను గురించి నేను వాదించడం లేదు. నా అనిర్ణయావస్థను చారిత్రకంగా వివరించవచ్చని కొందరు అనవచ్చు: అంటే ఫలానా తరగతికి చెందినవాడనని, విరుద్ధమైన వివిధ సంప్రదాయాలవల్ల, లక్షణాలవల్ల చారిత్రకంగాను, గతి తార్కికంగాను వీటికి కారణాలు చెప్పవచ్చు. చెప్పలేక పోవచ్చు. నా నిశ్చయ దృక్పథము, అనిశ్చయదృక్పథము ఏర్పడినవని అనవచ్చు; భ్రమ అనుకుంటేతప్ప, నా అంతట నేను అనుకొని, ఒక పక్షంవైపు చేరనిశ్చయించిన సమయాలు వున్నవి. నాలో బాగా లోతుగా పేరుకొనివున్న దానిని తెలియజెప్పటానికి నేను ప్రయత్నిస్తున్నాను. నాలోది బయటపెట్టుకోవడంలో నేను బయటపడుతున్నాను: నా ప్రేరణకు లోబడుతున్నాను. కాకపోతే ఇతరుల ప్రేరణలను ఎదిరిస్తున్నానన్నమాట. ఒకరు అవునన్నది కాదనడం చాలామంది లక్షణం. ఆ లక్షణం నాకూ వున్నది. ఇతరులు అతి ధీమాగా చెప్పే వాటిలో విరుద్ధభావాలు గోచరిస్తాయి. లేదా భ్రమతోకూడినవిగా కనబడతాయి. ఒకటి తప్పు అని, కాదని అనుకోటానికి నాకేమి హక్కువుంది. నేను అన్నట్లు జీవితానికి సంబంధించిన చిన్నవాటినుండి, నాకు కావాలనిపించినవి కావాలంటాను, తీసుకుంటాను. మిగతావాటిని వద్దంటాను. నలుపు నాకు గిట్టనిరంగు. నీలం నచ్చినరంగు. ఈ ఇష్టాయిష్టాలకు కారణాలు తెలుసుకోవచ్చు. కాని దానికి కాలం చాలా కావలసివుంటుంది. నాకు యూజినీ స్యూ కన్నా బాల్జాక్ ఇష్టం. షైడ్‌యూ కన్నా షేక్స్‌పియర్ ఇష్టం. కాబట్టి నాకు కొన్ని ప్రమాణాలు వున్నాయి. ఆ ప్రమాణాలు సాహితీయుతమైనవి.

# రచయిత - అతని సమస్యలు

నాకు షైడ్‌యూ కంటె షేక్స్‌పియర్ ఎందుకుఇష్టం అంటే షేక్స్‌పియర్ ప్రపంచం ఎక్కువ విషయసంపన్నమైనది. బహుముఖమైనది. లోతుఅయినది. యదార్థమైనది. ఎక్కడెక్కడి జనులకు కూడా ప్రీతిని ఇచ్చేట్లుగా మానవ ప్రకృతిని చిత్రించునది: షైడ్‌యూలో కనపడనిది, షేక్స్‌పియర్‌లో కనపడేది ఏమిటి? నాదశక్తి, ఆవేశం. జీవిత వైచిత్ర్యాన్నిగురించిన జిజ్ఞాస. ఈ లక్షణాలు ఫ్రెంచి రచయిత ప్రహసనాలలో కనిపించవు. షేక్స్‌పియర్‌ను పఠించినప్పుడు కలిగే, కల్లోలం అబ్బురం, షైడ్‌యూరచనలలో కనిపించవు. షేక్స్‌పియర్‌లో నాకు కనపడేది వట్టి ఉపదేశాలు కాదు. జిజ్ఞాసను ప్రోత్సహించే సందేహాలు. సంగతులు. మనకు కనపడే ప్రత్యక్షసత్యాలు దోవను చూపించే దీపాలుగా వెలిగిస్తాడు. ఈ విధంగా సందేహాలను నివృత్తి చేసుకోమంటాడు. అంతేకాని తానేమీ చెప్పడు; అసలు ఎవ్వరైనా తమకు తాము ప్రశ్నించుకోకుండా వుండడం కన్న, ప్రశ్నించుకొని సమాధానాలు సమకూర్చుకొనకపోవడం ఉత్తమస్థితి; నేను చదివిన పుస్తకాలు ఏవీ కూడా అవి లేవదీసిన ప్రశ్నలకే పూర్తి అయిన సమాధానాలు ఇవ్వలేకపోయినవి. ఇచ్చిన సమాధానాలు ఆధారం లేని సమాధానాలు. మూఢనమ్మకాలు ఎప్పుడూ నిలవ కలిగినవి కాదు. అందుకని అవన్నీ ఆ రోజుకి వుంటాయి. అవన్నీ కొన్ని ఊహలకు, కొన్ని పద్ధతులకు, కొన్ని సూత్రాలకు లోబడి ఏర్పడినవి తప్ప వేరేమీ కాదు. ఇతర భావాలు, ఇతర ఆశయాలు, నమ్మకాలు, వచ్చి వాటిని త్రోసివేసి, వాటి స్థానం ఆక్రమించవచ్చు. హానశక్తి అనుసరించి మనం అర్థం చేసుకుంటాము. సిద్ధాంతాలనేవి మనం అనుకోడాన్ని బట్టి యథార్థాలన్నట్లు కనపడతాయి. కాని ఈ సిద్ధాంతాలకు ప్రతివాదం వుంటుంది. వాటిని పూర్వపక్షం చేస్తుంది. తమ సందేహానివృత్తికి తామే మార్గాన్ని సృష్టించుకోవాలి. ఇది చాలా శ్రమతోకూడినపని. "నేను వున్నాను." అయితే ఈ "నేను" ఎవ్వరు? ఇంతకుముందు చెప్పినట్లు దీనికి సమాధానం కష్టం. ఈ విధమైన జిజ్ఞాస (ఈ ప్రశ్న) అనాదిగా వున్నదే. అయితే "మనము-వారు" అనే పంథాకంటె "నేను" అనే పంథాయే ఎక్కువ విశదంగాను, సుబోధకంగాను వుంటుంది.

ఏమైనప్పటికి అదేదోవున్నది. వస్తువులు వున్నాయి. అవి ఉపయోగపడతాయి. వ్రాసేందుకు, పనిచేసేందుకు. నేను వ్రాయగలను. చేయగలను. భవనాలను నిర్మిస్తాము. యంత్రాలు ఒకచోటినుంచి ఒకచోటుకు చేరవేస్తాయి. ఈ వస్తువులను గురించి ఏమన్నా గట్టిగా తెలిస్తే అది ఇంతవరకే. అది చేస్తామని, ఇది చేయగలమని అనుకుంటూ వుంటాము. కాని ఒక మాటలో చెప్పాలంటే మనం చేయగలిగిందల్లా కదలటం, మెదలటం, కూర్చోవడం, నుంచోవడం. కాకపోతే ఏదో పనిచేయటం. ఇంతమాత్రమే చేయగలిగింది. చేసేపని, చేయబడుతున్నపని, చేసినపని, చేయబడుతున్నట్లు, చేయబడినట్లు కనిపిస్తున్నదేదీ కూడా ఎప్పుడూ అలా వున్నదనడానికి లేదు. ఇప్పుడున్నది, తరువాత వుండకుండా పోతున్నది. ఇది ప్లంచెట్టు. (పండ్ల చెట్టు) చెర్రీ చెట్టుకాదు. అంటు

తొక్కడం మూలాన ఈ ప్లంచెట్టు చెర్రీ చెట్టు కాదని ఎవ్వరు చెప్పగలరు. అలా మారినప్పుడు పూర్వపు ప్లంచెట్టు కాదు. ఏమీ కాదు. బహుశః అనేకంగా మారవచ్చు. రూప పరివర్తన అనే దానిని త్రోసివేయడానికి వీలులేదు. ప్లంచెట్టు అనేది ఇప్పుడు లేదు కాబట్టి ఒకప్పుడు వున్నదని అనలేము. నాకు వాంఛలు, అభిరుచులు వున్నాయి. వాటికి మూలం ఏమిటో తెలియదు. తెలుసుకోగలిగితే అవి ఎందుకు పుడుతున్నదీ, ఏమి చేస్తున్నదీ తెలియవచ్చు. అప్పుడు వాంఛ, ప్రేరణ, అభిరుచి, భయం, ప్రేమ, ద్వేషం ఇవన్నీ అదృశ్యమై పోతాయి.

దేనికీ హేతువనేది వున్నదని నేను అనుకోను. అంతుపట్టనిశక్తి ఏదో మనను నెట్టుతున్నది. ఏదీ కారణం వుండి జరగడం లేదు. మనలో ప్రతిదీ వాదగ్రస్తం. మన ఎరుకకు మించినట్లు భావించబడుతున్న వస్తువులు వున్నాయి. యదార్థాలు వున్నాయి. వాటిని కాదనలేము. కాని వాటి స్థితికి కాని, అస్థితికి కాని కారణం నాకు కనిపించదు. నా వ్యాసంగాన్ని గురించి, నే చేసే సమర్థన అసమగ్రం, అబద్ధం, పట్టు లేనిది అని అనిపిస్తుంది. జీవితానికి ప్రయోజనం ఏమిటో నాకు గోచరం కాలేదు. ఎందుకు వ్రాస్తున్నానో నాకు తెలియడం లేదు. అయినా ఎప్పుడూ వ్రాస్తూనే వున్నాను. "నా" అనే ధ్యాస వచ్చినప్పటి నుంచి ఎలా వున్నానో, అలాగే వ్రాయాలి అనేది లోపలినుంచి తోసుకొని వస్తుంది. వ్రాస్తున్నాన వ్రాయడం అంటే నన్ను నేను ప్రశ్నించుకుంటున్నానన్నమాట. నా చుట్టూ వున్నవి చూస్తున్నాను. చూచిన వాటిని వర్ణిస్తున్నాను. చెడు అని భావించిన దానిని గుర్తించడం, ఇతరులను, వారి నడవడికను విమర్శించడం, హేళనచేయడం, నీతులు చెప్పడం,- నేను వ్రాస్తున్న దానిలో చేస్తాను. ఇవన్నీ సంకుచితమైన అర్థంతో సరిపోతాయి. నేను ఒక పక్షం వహించినప్పుడు అలా ఎందుకు చేస్తున్నానా అని పిస్తుంది. అంతేకాదు. అలా చేయకూడదని కూడా అనుకుంటాను. నా ఇష్టాఅయిష్టాలు, నమ్మకాలు--అపనమ్మకాలు ఆ క్షణంలో కలిగిన భావోద్వేగంచేత నియమితం అవుతూవుంటాయి. అలా ఏర్పడడం సమంజసమా, అసమంజసమా అనేది నిర్ధారణకు అందదు. వాటికి విస్పష్టమైన రూపం ఇవ్వగలిగినాకూడా సాక్షీభూతం చేయలేము. నిజానికి అసలు భావంకన్న ఆ భావాన్ని గురించిన భావనలు ఎందుకు కలుగుతున్నాయో అన్న విషయం ఎక్కువ ఆకర్షణీయంగా వుంటుంది. ఆశ్చర్య, అద్భుతరసాలను ఏ గ్రంథాలలో అయితే ఎక్కువగా ప్రదర్శించానో, ఆ గ్రంథాలలో నా నిజస్వరూపం ఎక్కువగా గోచరిస్తుంది. జీవితం అనే వృక్షం యొక్క వ్రేళ్లు ఆశ్చర్య అద్భుతరసాలలో దిగిపోతున్నాయి. నాలో నేను చూచుకుంటే నా అట్టఅడుగున కారుచీకటో, లేక, కన్నులు పొడిచే కాంతో కనపడతాయి.

[ఎన్‌కౌంటర్ సౌజన్యంతో]

## నవ్యాంధ్ర సాహిత్యంలో దృక్పథాలు 4 :

# శ్రీ గోపీచంద్

శ్రీ ఆర్. ఎస్. సుదర్శనం

హేతువాదంలో పుట్టి పెరిగిన గోపీచంద్ ఆ దృక్పథం యొక్క లోటుపాట్లను గ్రహించి, దాని పరిధుల్ని దాటి పురోగమిస్తూ, తన అనుభవాల్ని పొందుపరచిన నవల 'అసమర్థుని జీవయాత్ర'. తెలుగుదేశంలో హేతువాదాన్ని ప్రచారంలోకి తెచ్చిన తన తండ్రి రామస్వామి చౌదరిగారు మరణించిన తర్వాత గోపీచంద్ అనుభవించిన మనోవైకల్యానికి ప్రతిబింబమీ నవల. ఆ మనోవైకల్యము సామాన్యమైనది కాదు; మృత్యువుతో హూటాహూటి పోరాటము ! నవలలో నాయకుడైన సీతారామరావు మృత్యువు చేతిలో ఓడిపోతాడు. కాని నవల వ్రాయటం ద్వారా, తనలోని సీతారామరావు మృతి చెందటం ద్వారా, గోపీచంద్ వ్యక్తిగతంగా పునర్జన్మ వంటి అనుభూతి పొంది క్రొత్త దృక్పథంతో క్రొత్త జీవితాన్ని ప్రారంభించాడు.

'అసమర్థుని జీవయాత్ర' నిజంగా ఒక హేతువాది జీవయాత్ర. హేతువాద దృక్పథం ఒక వ్యక్తి జీవితంలో కేవలం బౌద్ధిక దృక్పథంగానే (Intellectual attitude) ఉంటే అది కత్తెరబోనులా పరిణమించే పరిస్థితి రావటానికి వీల్లేదు. అనుభవంలో దాని లోటుపాట్లు గుర్తు వచ్చిన మరుక్షణంలో వ్యక్తి దాన్ని మార్చుకోవచ్చు; ఆలోచనాపరుడు, జిజ్ఞాసువు సాధారణ పరిస్థితుల్లో అలానే చేస్తాడు. కాని ఆ దృక్పథం వ్యక్తి చేతన (Psyche) లోనే ఒక విషబీజంగా పరిణమించినట్లయితే ఎలా ప్రాణాంతక మౌతుందో నిరూపిస్తుంది యీ నవల. హేతువాద దృక్పథానికీ చనిపోయిన తండ్రిమీద తనకు గల అభిమానానికీ అవినాభావమైన సంబంధం ఏర్పడి ఉండటం, ఆ రెండింటి కలయిక తన వ్యక్తిత్వం మీద మోపిన భారాన్ని వదలించుకోలేకపోవటం, సీతారామరావు అసమర్థతకు మూలం. అదే అతని విషాదాంత గాథ వెనుక దాగిఉన్న మనస్తత్వ రహస్యం. గోపీచంద్ ఎదుర్కొన్న సమస్య కీలకం కూడా అదే.

'పరివర్తన' గోపీచంద్ మొదటి నవల. దానిలో కథానాయకుడైన రాజారావు భార్యా వియోగ దుఃఖంతో జీవితం పట్ల నిరీహుడౌతాడు. గోపీచంద్ దాన్ని హృదయదౌర్బల్యంగా (Sentimentalism) ఈసడిస్తూ హేతువాద దృక్పథంతో నిరాసం చెయ్యటానికి ప్రయత్నించాడు. నవలలో రాజారావు దుఃఖానికి మూలవస్తువు గోపీచంద్ స్వయంగా అనుభవించిన పితృవియోగ దుఃఖమే అనటానికి సందేహంలేదు. కాని అది అంత సులువుగా అతణ్ణి వదలలేదు. నవలలో చూపిన పరివర్తన కేవలం రచయిత ఆకాంక్ష తప్ప, అది రచయిత తన సమస్యపై సాధించిన విజయంగా మనల్ని ఆకట్టుకోలేదు. అందుకే 'పరివర్తన' నవలగా కూడా విఫలప్రయత్నమే అయింది. తన మనస్సుని రాహువులాగా గ్రసించిన దుఃఖాన్ని నిరీహనూ వదలించుకోవటానికి గోపీచంద్ చేసిన రెండవ ప్రయత్నమే 'అసమర్థుని జీవయాత్ర'. ఈ పర్యాయము తండ్రి స్మృతినీ దాని తాలూకు దుఃఖాన్నీ నిరాసం చెయ్యటానికి బదులు తనకు వారసత్వమైన హేతువాద దృక్పథాన్నే పరీక్షకు నిలువబెట్టి దాని తాలూకు విషఫలితాల్నీ, అవి రూపుగట్టిన ఒక మృత్యుచ్ఛాయనీ తనలో నుంచి ఛేదించి వేశాడు. అందుకే 'అసమర్థుని జీవయాత్ర' శక్తివంతమైన రచనగా తెలుగు సాహిత్యంలో విశిష్ట స్థానాన్ని గడించుకొన్నది.

తండ్రి మరణం సీతారామరావు జీవితంలో ఒక పెద్ద మలుపు. "సీతారామరావు జీవితం ఉన్నత శిఖరాగ్రం నుంచి స్వచ్ఛమైన జలంతో భూమి మీద పడి, మలినాన్ని కలుపుకొని, మురికి కూపంలోకి ప్రవహించే సెలయేటిని జ్ఞప్తికి తెస్తుంది." అంటూ ప్రారంభమౌతుంది నవల. తండ్రి మరణించేంతదాకా తను నిర్మించుకొన్న ఊహా ప్రపంచపు శిఖరాగ్రం నుంచి దిగివచ్చి యథార్థ జీవితంతో, దాని సమస్యలతో, ఘర్షణపడే అవసరం సీతారామరావుకు రాలేదు. తండ్రి పోవటంతో ఎదురైన

జీవితపు పరీక్షలో అతను నెగ్గలేకపోయాడు. అదీ అతని కథ. ఎందుకు నెగ్గలేకపోయాడు ? అని ప్రశ్నిస్తే—సాధారణంగా కథల్లో, నవలల్లో, నాటకాల్లో కానవచ్చే సమాధానాలు బాహ్య పరిస్థితులకు సంబంధించినవిగా ఉంటాయి: డబ్బు లేకపోవటం; చదువు లేకపోవటం; కొందరు వ్యక్తులు పగపట్టటం లేక ద్రోహం చెయ్యటం; సంఘం కట్టుబాట్లు తాలూకు దురన్యాయం బాధించటం, ప్రేమించిన యువతి లభించకపోవటం వంటివి.* సీతారామరావు జీవితంలో ఈ విశేష పరిస్థితులేవీ ఎదురవలేదు. డబ్బూ, చదువూ ఉన్నాయి. చుట్టుపట్ల ఉండే మనుష్యుల సానుభూతీ ఉంది. తనని దైవంగా ఆరాధించే యోగ్యురాలు, సహనశీలి, ప్రేమించి పెళ్లిచేసుకున్న భార్యా ఉంది—ఇన్ని ఉన్నా సీతారామరావు సుఖపడలేదు. జీవితంలో నెగ్గలేదు. కారణం ఏమిటి ? కారణం సీతారామరావు మనస్తత్వమే; అతని మనోదృక్పథమే ! ఇలా మనస్తత్వాన్ని ఒక్కదాన్నీ ప్రధానంచేసి, జీవితంలో ఎన్ని ఉన్నా సుఖానికీ, విజయానికీ వ్యక్తి మనస్తత్వమే అన్నింటికంటె ముఖ్యమని నిరూపించిన మొదటి నవల 'అసమర్థుని జీవయాత్ర.'

సీతారామరావు పాత్రసృష్టి గోపీచంద్ తన్ను తాను అవలోకించుకునేందుకు చేసిన ప్రయత్నం. అది అతని ప్రతిబింబమే; అతని కిష్టంలేని ప్రతిబింబము. అందువల్ల ఒకసారి దాన్ని తనకు భిన్నంగా చూచి విమర్శించటమూ, మరోసారి దానితో తాదాత్మ్యాన్ని అనుభవించి ఆవేశాన్నీ ఆవేదననీ యథాతథంగా పంచుకోవటమూ—అనే రెండు మార్గాలలో పాత్రచిత్రణము జరిగింది. మొదటి విధానంలో సీతారామరావుకూ, బాహ్యప్రపంచానికీ గల సంబంధాన్ని వర్ణిస్తూ అతనిమీద హేళన, వెటకారం ప్రసరింపజెయ్యటం; ఇది ఒకరకం హాస్యదృష్టి. రెండవ విధానంలో రచయిత సీతారామరావు ఆలోచనల్నీ, అనుభవాల్నీ, సానుభూతితో వ్యక్తం చెయ్యటం; ఇది కరుణాదృష్టి. ఈ రెండు విధానాలవల్ల సాధింపబడిన ప్రయోజనము—సీతారామరావు మనస్తత్వమూ, అతని ప్రవర్తనా, అతని సమస్యలూ దూరంనుంచీ చూచేవాళ్లకి ఎంత హాస్యాస్పదంగా, తెలివితక్కువగా ఉన్నాయో, సానుభూతితో చూచేవాళ్లకి అంత కరుణాజనకంగానూ, తాత్త్వికంగానూ, గంభీరంగానూ ఉంటాయని చూపించటమే. సీతారామరావు జీవయాత్ర హాస్యస్ఫోరకంగా ప్రారంభమై, కరుణాజనకంగా పరిణమించి, బీభత్సంలో అంతం అవుతుంది ! అతని ఘర్షణ లోకంతో అన్నట్లుగా మొదట తోచి, వాస్తవంలో అది అతని ఆంతర్యంలోని సంఘర్షణగానే వ్యక్తమై, చివరకు ఆత్మహత్యగా పర్యవసిస్తుంది. ఆ పర్యవసానంలో, ఆ చివరి ఘట్టంలో సీతారామరావు పాత్రకూ, మనస్తత్వానికీ కీలకమైన రహస్యం వ్యక్తం చెయ్యబడుతుంది. నవలలో కథా సంవిధానం సంఘటనలనుబట్టి కాక, కేవలం అసమర్థుని గూర్చిన విశ్లేషణకు అనుకూలంగా నడిచింది—అసమర్థుడు, అతని భార్య, అతని ఆదర్శం, అతని మేనమామ, అతని ప్రతాపం అనే ఆరు ప్రకరణాల శీర్షికలూ ఒక వ్యాసం శీర్షికల్లా ఉన్నాయి. కాని 'అసమర్థుని జీవయాత్ర' వ్యాసం అనటానికి వీల్లేదు. నాటకీయత, ఉత్కంఠ చక్కగా పోషింపబడ్డాయి. మేనమామ, భార్య పాత్రలూ, సంఘటనలను చిత్రించిన విధానమూ నవలకు ఉండవలసిన గుణాల్ని సమకూర్చాయి. 'అసమర్థుని జీవయాత్ర' గోపీచంద్ తెలుగులో ప్రవేశపెట్టిన కొత్త నవల—మనో ఆశ్లేషణము ప్రధానమైన నవల.

సీతారామరావు మనస్తత్వంలో ప్రథమంగా పేర్కొనదగిన గుణం స్వాభిమానం. అది తండ్రి వ్యక్తిత్వపు ప్రభావంవల్ల దురభిమానంగ సంక్రమించింది. తండ్రి అతనికిచ్చిన చివరి సందేశం 'బాబూ మన వంశం పేరు నిలబెట్టు' అని. సీతారామరావు దురభిమానం ఒకవైపు తండ్రి గొప్పదనాన్ని, వంశప్రతిష్ఠనూ ఆశ్రయించింది; మరొకవైపు దైనందిన జీవితంలో అది అన్నింటినీ తిరస్కారభావముతో ప్రశ్నించే 'హేతువాదం' గా వ్యక్తమౌతూ ఉంటుంది. ఈ రెండింటి కలయికవల్ల సీతారామరావుకు జీవితంలో ప్రతి వ్యక్తీ హీనుడుగా, ప్రతి విషయమూ తుచ్ఛంగా, ప్రయోజనశూన్యంగా కనిపిస్తుంది. డబ్బు, పెళ్లి, ప్రసూతి, ఉద్యోగం, సంఘ సంస్కరణ, సౌందర్యం, సుఖం—అన్నింటినీ 'ఎందుకు ?' 'ఏమిటి ?' అని ప్రశ్నించి మనసా తిరస్కరించటంతో అతనికి మిగిలిందేమీ కనిపించదు; జీవితమే ఒక మురికి కూపంగా కనిపిస్తుంది. స్వోత్కర్ష హేతువాదాన్ని గండ్రగొడ్డలిగా ప్రయోగిస్తూ చేసే విధ్వంసానికి ఏవీ మిగలవు ! అయితే జీవితం మాత్రం ఎందుకు ? అనే ప్రశ్న హేతువాదపు చివరి సరిహద్దుదాకా తీసుకువెళ్తుంది. అసలు ఆలోచించటమే, హేతువుల్ని వెదకటమే తప్పేమో అనే సందేహం కలుగుతుంది. ఇది హేతువాదం తన మీద తనే తిరుగుబాటు చెయ్యటం. జీవితం ఎందుకు ? అనే ప్రశ్నకు హేతువాది సమాధానం ఏమిటి ? చైతన్యం, ప్రాణం, పదార్థాన్ని (Matter) మించి వేరుగాలేవు. పదార్థం పరిణామం చెందటంలో ఒక దశలో ప్రాణం ఏర్పడింది ఒకానొక కలయికవల్ల. ప్రాణం ఎందుకు ఏర్పడింది ? నిర్నిమిత్తంగా నిర్నిమిత్తంగా ఏర్పడి పరిణామం చెందే ప్రాణానికి నిర్దిష్టమైన ప్రయోజనం లేనప్పుడు జీవితానికి ఆదర్శం అనీ ప్రయోజనం అనీ ఎక్కడనుంచి వస్తుంది ? ఏదో చెయ్యాలనీ లేక చెయ్యనక్కర్లేదనీ అనుకోవటం రెండూ దురభిప్రాయాలే!

తేలిందేమిటి ? నిర్నిమిత్తంగా పుట్టాం, నిర్నిమిత్తంగా బ్రతకటానికి వీలుంటే బ్రతకాలి లేకపోతే చావాలి అని. కాని నిర్నిమిత్తంగా బ్రతకటానికి వీలు కనిపించటంలేదే! బహుశా ఇలా ఆలోచించటమే, ఈ హేతువాదమే తప్పేమో ! .... ఆలోచించకుండా మనస్సు చిక్కబట్టితే ? కాని, ఆలోచించేదే తనైతే ఇక చిక్కబడే దెవ్వరు ? ''చూసేదాన్ని చూడు అంటారు వేదాంతులు, చూచేదే తనైనప్పుడు, చూసేదాన్ని తనెట్లా చూస్తాడు ?'' సీతారామరావు ఆలోచనాశక్తికి యిది సరిహద్దు. కాని, గోపీచంద్ సీతారామరావు చూడలేనిదాన్ని చూడగలిగాడు—అందుకే సీతారామరావు అనే ఛాయని తననుండి వేరుచేసి చూచి వర్ణించగలిగాడు; ఫలితంగా సీతారామరావుకు పట్టిన దుర్గతి తనకు పట్టకుండా తప్పించుకున్నాడు !

గోపీచంద్ మనస్తత్వం, ఆలోచన ఇంతమేర సీతారామరావు మనస్తత్వం, ఆలోచనతో ఏకీభవించాయి అనటానికి ఒక రకమయిన ఋజావు గోపీచంద్ 'అసమర్థుని జీవయాత్ర' కు పూర్వం వ్రాసిన కథలు. సంప్రదాయాల్నీ, సాంఘిక-వ్యవస్థల్నీ, భావనాత్మక ప్రేమనీ, రాజకీయాల్నీ, సెక్స్ ప్రాధాన్యాన్నీ, సర్వ విషయాల్నీ ప్రశ్నిస్తూ, విమర్శిస్తూ వ్రాసిన ఆ కథల్లో చాల వరకు యాథార్థ్యంమీద పాఠకులకు సరియైన దృష్టిని ఏర్పరిచే ప్రయోజనం ఉన్నా, కొన్ని కథల్లో ఆ ధోరణి కేవలం అవహేళనగా ఏవగింపుగా కనిపిస్తుంది—ముఖ్యంగా 'సెక్స్' ను ప్రవేశపెట్టిన కథల్లో. 'పతివ్రత ఆంతరంగికం', 'అమలిన శృంగారం', ఇందుకు ఉదాహరణలు. ఏమైనా ఆ కథల్లోని హేతువాద ధోరణి— ఒక విషయాన్ని తీసుకుని ఇందులో ఈ లోపం, ఈ నీచత్వం, ఈ డొంకతిరుగుడు, యీ తెలివి తేటలు, ఉంది మీరు గమనించారా ? అనీ దీని గొప్పేమిటి ? అనీ చులకనచేసే ధోరణి కావటం గమనింపదగ్గ విషయం. ఆ ధోరణి సాహిత్యంలో ఫలప్రదం కావటానికి దాని వెనుక గోపీచంద్‌లో జీవితాన్ని గూర్చిన ఆసక్తి, ఆశ అప్పటి కింకా ఒక జ్యోతిగా వెలుగుతూండటమే కారణం: ''ఆశకు అంతు లేదు. జీవితానికి పునాదే ఆశ. జీవించడం అంటేనే ఆశపడటం. ఆశాజ్యోతి సర్వకాల సర్వావస్థలయందూ వెలుగుతూనే ఉంటుంది.... దేనికోసం బ్రతకటం అనే ప్రశ్న అర్థంలేని ప్రశ్న. బ్రతకటమే ఆనందం. కోడి రాలింది. దీపం మెరిసింది. మెరవటంలో కొలనులోని, కలువపువ్వులా మెరిసింది. భళ్లున తెల్లవారింది.'' ఈ వాక్యాలు 'ఆశాజ్యోతి' అనే కథ ముగింపు వాక్యాలు. గోపీచంద్ వ్రాసిన అన్ని కథల్లో 'ఆశాజ్యోతి' విశిష్టమైనది. ఆ కథలో 'ఇదీ యిందులోని మంచి' అని నిర్దేశించిచూపే ధోరణి ఉంది: మిగతా కథల్లో 'యిదీ యిందులోని లోపం' అని నిర్దేశించటమే గోపీచంద్ ధోరణి. ఆ హేతువాద ధోరణి జీవితంపట్ల మౌలికమైన విశ్వాసానికి భిన్నంగా, విరుద్ధంగా సాగనందువల్లే గోపీచంద్ కథలు ప్రయోజనాత్మకంగా ఉన్నాయి అనే విషయం యిక్కడ మనం విస్మరించకూడదు.

తండ్రి మరణానంతరం గోపీచంద్ హేతువాదపు విమర్శనాధోరణి జీవితంపట్ల విశ్వాసాన్నే ఛేదించే ధోరణిగా మారింది. జీవితంలో ఏ ఒక్కటి లోపరహితంగా, ఆదర్శయుతంగా కనిపించనప్పుడు జీవితం మాత్రం ఎందుకు ? అనే ప్రశ్న వచ్చింది. గోపీచంద్‌కు యీ ప్రశ్న తప్పు ప్రశ్నగా తోచింది; జీవించటానికి సామర్థ్యం లేనివాడే ఈ ప్రశ్న వేసుకుంటాడు అనిపించింది. అందుకే 'అసమర్థుని జీవయాత్ర' నవల వ్రాయవలసి వచ్చింది.

జీవితం ఎందుకు ? అనే ప్రశ్నకు సమాధానం ఆలోచనలో లభించదు.. హేతువాదానికే అది సరిహద్దు. ఆ ప్రశ్నకు సమాధానం జీవితమే యివ్వాలి. అందుకే గోపీచంద్ సీతారామరావు జీవితాన్ని ఊహించాడు. కొందరిలో స్వాభిమానం జిగీషగా ఉంటుంది; వ్యవహారాల్లో దక్షతగా, సామర్థ్యంగా అది వ్యక్తమౌతూ ఉంటుంది. ఇది క్రియాశక్తి ప్రధానమైన వ్యక్తుల సంగతి. కాని ఆలోచనాశక్తి ప్రధానమైన వ్యక్తుల్లో, సీతారామరావు వంటి వారిలో, జిగీష కంటె నిరాకృతి లేక తిరస్కృతి ఎక్కువ. తిరస్కారభావమే వాళ్ళు లోకంమీద సాధించే విజయం. దీన్నే 'అసమర్థత' అన్నాడు గోపీచంద్. తిరస్కారము హేతువాదం మూలంగా జరుగుతుంది సీతారామరావులో. జీవితంలో ప్రతి విషయాన్నీ ఎందుకు ? అని ప్రశ్నించి తిరస్కరించి తన ఆధిక్యత నిలబెట్టుకోవాలనే వ్యర్థప్రయత్నం సీతారామరావుది. పిత్రార్జితంగా దక్కిన డబ్బు చేయిజారిపోవడంతో సీతారామరావు స్వాభిమానానికీ ఆధిక్యతకూ మొదటి దెబ్బ తగులుతుంది. భార్య గుట్టుగా సంసారాన్ని ఉన్నంతలో నిర్వహిస్తూ ఉంటుంది. అదీ అతని అభిమానానికి దెబ్బే ! భార్య మీద కోపం వస్తుంది. డబ్బుమీద గౌరవం చూపకుండా, దాని కోసం ప్రాకులాడకుండా ఆర్థిక సమస్య నెలా ఎదుర్కోవాలో అతనికి తెలీటంలేదు ! పార్వతీ పరమేశ్వరులు వరం యిస్తే ! (—ఆ వరం కూడా ప్రత్యేకంగా తనకే యివ్వాలి అంటుంది అతని దురభిమానం !) అసలు ఆకలి, అన్నం, అనేవి ప్రపంచ సమస్యలు కావటమే నీచంగా కనిపిస్తుంది ! మామ, మేనమామ వంటి వారితో వ్యవహారం నడపటమే స్వాభిమానానికి భంగకరంగా కనిపిస్తుంది ! మేనమామ సాహాయ్యాన్ని అతను మూర్ఖంగా కాలదన్నుకుంటాడు. ''నీ కిచ్చిన డబ్బుకి ఎన్ని కుక్కలు వచ్చేవా అని ఆలోచిస్తున్నా'' నంటూ ఉత్తరం

వ్రాస్తాడు. ఈ దురభిమానం సీతారామరావు తండ్రిలోనూ ఉండేదంటూ, తమా, తన చెల్లెలూ పడ్డ బాధల్ని గూర్చి మేనమామ పాత కథలు త్రవ్వుతాడు. భూస్వామ్య వ్యవస్థకు సంబంధించిన దర్పమూ గర్వమూ వంశపారంపర్యంగా వస్తూ చివరి రోజుల్లో ఎటువంటి పరిణామం చెందిందో గోపీచంద్ ఈ పట్టులో చక్కగా వ్యక్తంచేశాడు. లోకజ్ఞత, వ్యవహార దక్షత, వాస్తవికతను గుర్తించే బుద్ధికుశలతా లోపించినా, వంశగౌరవం అనే దురభిమానాన్ని, డబ్బూ, ఆస్తీ, బంధువుల అభిమానం అనేవి ఉండటంవల్ల ఒక తరం అసమర్థులు నిలబెట్టుకోగలిగారు. కాని సీతారామరావు తరం వచ్చేటప్పటికి అటువంటి ఆధిక్యత నిలవలేదు. సీతారామరావు ఆదర్శవాదీ, హేతువాదం వంటబట్టినవాడూ, కావటంవల్ల డబ్బూ, ఆస్తీ, బంధువుల అభిమానమూ తొలగ్రోసి తన అసమర్థతను బయటపెట్టుకున్నాడు. అతని అభిమానానికి గట్టి దెబ్బ తగిలింది.

అహం బాగా దెబ్బతిన్న సీతారామరావులో తిరుగు దెబ్బ కొట్టే శక్తి కూడా శూన్యం. "కుట్ర—కుట్ర—మామా మేనమామల కలయిక" అంటూ బొమ్మ గీస్తాడు ఏమీ తోచక. అతని కోపం భార్యమీదికి తిరుగుతుంది. తనమీద కాకి తన్నినా, ఎరుకలదానితో పేచీ వచ్చినా, అతని కోపం భార్యాపిల్లలమీద ప్రసరిస్తుంది కాని ప్రపంచంమీద కాదు. ఇందులో ఒక సున్నితమైన మనస్తత్త్వ విషయం ఉంది. ఒకసారి రెండుసార్లు లోక వ్యవహారంలో దెబ్బతిన్న వ్యక్తికి లోకాన్ని చూస్తే భయమూ, తన ప్రయోజకత్వంమీద అపనమ్మకమూ ఏర్పడతాయి. ఇలా ఆత్మవిశ్వాసానికి సంబంధించినంతమేర, హేతువాద దృక్పథంగాని మరొక దృక్పథంగాని, కేవలం దృక్పథం, ఏమీ చెయ్యలేదనే సంగతి ఋజువవుతున్నది. ధైర్యమూ, పిరికితనమూ వంటి గుణాలు వ్యక్తిత్వానికి సంబంధించినవి కావటంతో లేని ధైర్యాన్ని హేతువాద కౌశలం తెచ్చిపెట్టలేదు. సీతారామరావు హేతువాదం జీవిత సమస్యలనుంచి పరారీ కావటానికి సాధనంగా పనిచేస్తూ అతని పిరికితనాన్నే వ్యక్తంచేస్తుంది.

సీతారామరావు హృదయంలేనివాడూ, ఆప్యాయతా ప్రేమా ఎరగనివాడూ కాడు. మంచిరోజుల్లో భార్యనూ పిల్లల్నీ ప్రేమతో ఆదరంతో చూచినవాడే. అందువల్లే అతనిలో కనిపిస్తున్న మార్పు ఎంత బాధాకరంగా ఉన్నా వాళ్ళు అతణ్ణి ప్రేమిస్తూ గౌరవిస్తూనే ఉన్నారు. ఆ సంగతి అతనికీ తెలుసు. పోతే, సీతారామరావుకు తన అసమర్థతకు మూలకారణం తన మెత్తని హృదయమేమో అని తోస్తుంది. మెత్తని హృదయం అంటే ఏమిటి? మళ్ళీ హేతు వివేచన ప్రారంభం. అది నరాలలో బలహీనత. నరాలు పటుత్వం తప్పటం ఎందుకు? ఆలోచనలవల్ల. ఆలోచనలు ఎందుకు? ఏపనీ చెయ్యకపోవటంవల్ల. ఎందుకని ఏపనీ చెయ్యబుద్ధిపుట్టటంలేదు? పరిస్థితులవల్ల. అయితే పరిస్థితులు ఎందుకు మార్చుకోరాదు? అలా బుద్ధి కలగటంలేదు. ఎందుకు? పరిస్థితులు మారితే కాని బుద్ధి మారదు! ఇలా పెళ్ళి అయితే కాని పిచ్చి కుదరదు, పిచ్చి కుదిరితే కాని పెళ్ళి కాదు అనే వ్యూహంలో వచ్చి నిల్చిపోతుంది అతని హేతువివేచన. సీతారామరావు హేతువాదం, కర్ణుని దివ్యాస్త్ర విద్యలాగా, అతి క్లిష్టసమయంలో చావు బ్రదుకులు తేల్చుకునే పరీక్షా సమయంలో ఎందుకూ కొరగాని వాదమైపోయింది!

సీతారామరావు ఆంతర్యంలోని సంఘర్షణ భార్యతో పోట్లాడటంతో, భార్యమీద చెయ్యి చేసుకోవటంతో పూర్తిగా బహిర్గతమైపోతుంది. సమస్యా పరిష్కారమార్గం ఆలోచనకు లొంగకపోవడంతో, సంకల్పశక్తి (will) చెదిరిపోవటంతో సీతారామరావు ప్రవర్తన పిచ్చివాని ప్రవర్తనలా తయారవుతుంది. ప్రపంచాన్ని నిరాకరిస్తూ పరారీ అయ్యే ప్రవృత్తి శూన్యంలో గుడిసుళ్ళు తిరిగి చివరకు ప్రపంచంవైపే విధ్వంసక శక్తిగా, ద్వేషంగా ప్రసరిస్తుంది. దెబ్బతిన్న అహం ప్రపంచంమీద కక్ష తీర్చుకోవటానికి ప్రయత్నిస్తుంది. విలువలు తారుమారవుతాయి. భార్య, స్నేహితులు—తను ఒకప్పుడు ప్రేమించిన వ్యక్తులే ఇప్పుడు నికృష్టులుగా కనిపిస్తారు. చివరకు మానవుడెవడైనాసరే వాడిమీద ద్వేషం పుట్టుకొస్తుంది. (దారులుకొట్టి బాటసారులని హింసించటం ఎంత హాయిగా ఉంటుందని ఊహిస్తాడు.) కాని ఈ ద్వేషం నిజానికి 'సంఘం' అనే సముదాయంమీద: "సంఘంలో ఉన్న కట్టుబాట్లు నియమాలు, ఆచారాలు, న్యాయశాస్త్రాలు— ఏమీ లేకుండా ఉండటం అతనికి హాయిగా ఉంది." ఈ 'సంఘం' అనే శృంఖలం లేకపోతే అతనిలోని మానవత్వం స్వేచ్ఛను అనుభవిస్తూ హాయిగా ఉంటుంది అనిపిస్తుంది. అడవిలో ('సంఘం' లేని చోట) వయస్సులో ఉన్న ఆడపిల్ల నొక్కర్తెను బంధించినట్టూ మానభంగం చేయబోయినట్టూ ఊహించికూడా ఆమెను చివరకు వదిలిపెట్టి ఆమె కృతజ్ఞతకు పాత్రుడైనట్లే ఊహించుకుంటాడు.—ఇది సీతారామరావులో 'సంఘం' బరువు బాధ్యతలు సోకని పసితనమునాటి ముగ్ధ ప్రకృతి; సిసలైన మానవత్వం. నిజానికి సీతారామరావు పిచ్చి ప్రవర్తనలో ప్రస్ఫుటమయ్యే సంఘర్షణ అతని మానవత్వపు ముగ్ధ ప్రకృతికీ, 'సంఘం' అతనిమీద మోపిన ఆదర్శాల, కట్టుబాట్ల, ఆచారాల

రువుతో తయారైన వ్యక్తిత్వానికి. రామయ్య తాతతో అతని సంభాషణలో ఈ సంగతి వ్యక్తమౌతుంది. తర్వాత అతను బజార్నపడి తన చుట్టూ పోగైన జనానికి ఉపన్యసిస్తాడు. అందులో సీతారామరావు మానవత్వము హేతువాదంమీద తిరుగుబాటు చేస్తుంది. సాంఘికమైన దృష్టిని అతనిలో తీర్చి దిద్దుతూ వచ్చినవాడు తండ్రి. ఆ దృష్టి హేతువాదం ప్రతి పాదించిన మానవ చరిత్రను అంగీకరిస్తూ వచ్చింది. సీతారామా రావు తిరుగుబాటు దానిమీదే! మొదట్లో దేవుడు, తర్వాత మానవ సంఘం, తర్వాత సంఘంలో ఆఖరివర్గం, ఆటు తర్వాత పరిణామసిద్ధాంతం— ఇలా ఆదర్శాలు ఒకటి తర్వాత ఒకటి మారుతూ సామాన్యుణ్ణి మభ్యపెట్టుతూ వస్తు న్నాయనీ, సామాన్యుడి జీవితానికి వీటితో సంబంధం కేవలం కృతకమనీ ఉపన్యసిస్తాడు సీతారామారావు. ''వీళ్లు హేతువాదం మీద ఆధారపడమంటార్రా. ఎందుకు ? ఎందుకు ? ఎందకు? అని ప్రశ్నించుకోమని చెపుతార్రా. అన్ని 'ఎందుకు'లకీ వాళ్లు జ్ఞానాన్నిబట్టి జవాబులు చెబుతారు. మనకున్న జ్ఞానాన్ని బట్టి మనం నమ్ముతాం. కాని ఆఖరి 'ఎందుకు' కు జవాబు లేదురా నా తండ్రీ....ఒరేయ్ మనం పుట్టటం నిజం. చావటం నిజం. మధ్యన బతకటం నిజం.......బతకటానికి మనకు కావలసింది అన్నమేగదరా! దీనికింత గొడవెందుకురా?' మనం నలుగురం కూడబలుక్కుని బతకలేమటరా ? ఈ ప్రపంచంలో ఏమో ఉందని మభ్యపెట్టి దానికోసం పోట్లాడుకు చచ్చేట్టు చేస్తున్నార్రా.......ఎందుకురా. ఎవరు కట్టుకుపోయేది ఏముం దిరా. బతకండ్రా తండ్రుల్లారా, చచ్చేదాకా బతకండి.'' అంటూ ముగిస్తాడు. సిద్ధాంతాలకూ, వర్గాలకూ అతీతమైన మానవత్వపు ఆక్రోశం, లోకం దృష్టిలో పిచ్చివాడైన సీతారామా రావు నోట ఇలా వెలువడుతుంది. సీతారామారావులోని ఈ మానవ త్వమే అతణ్ణి ఒక భోగందానిపట్ల జాలి, కరుణ చూపించేలా చేస్తుంది. కారణం ఆమెకూడా 'సంఘం', 'నీతి' అనే వాటివల్ల బాధింపబడుతున్న వ్యక్తే. ''తన ఇంటిముందు నుంచి ఊళ్లో మురికినంతా పోగుచేసుకుని నెమ్మదిగా, విశ్ర బ్ధంగా, గర్భిణిస్త్రీకి మల్లే పారే కాలువ జ్ఞాపకమొచ్చింది. ఆమెకు మనస్సులో నమస్కరించుకున్నాడు.'' కాని ఈ ఊహ లోనూ ఆమెను సాంఘిక దృష్టితో చూడటమే ఉంది. ఆమె భార్యగా ఉండి పిల్లల్ని కనాలన్న కోర్కె ఉన్నట్లు వ్యక్తంచేస్తూ ''మీరట్లా అంటారుగాని మేమూ అందరివంటి వాళ్లమే'' అనగానే, సీతారామరావు ఉలిక్కిపడతాడు. అప్పుడు అతనికి ఆమెలో ఉన్న మానవత్వమూ, తనలో ఉన్న మానవత్వమూ, వివిధ సిద్ధాంతాలు ప్రవచిస్తూ మేధావులనుకునే తన స్నేహి తుల్లో ఉన్న మానవత్వమూ, అంతా ఒక్కటేనన్న 'అద్వైత' భావన స్ఫురిస్తుంది: ''పై మెరుగుల్లోతప్ప, ప్రపంచంలో అందరూ ఒకటేనా ఏమిటి ? అందుకనే కాబోలు ఉద్రేకం వచ్చినప్పుడు అందరూ ఒకే రకంగా ప్రవర్తిస్తారు. ఆకలివేసినప్పుడు, కోపం వచ్చినప్పుడు, విచారం కలిగినప్పుడు, ప్రేమ సందర్భాల్లో అంతా ఒకే విధంగా ప్రవర్తిస్తారు. భేదాలు పై పూతలోనే! పూత కరిగి పోతే అంతా ఒకటే సరుకు!'' అయినప్పుడు తాగనివాడు తాగే వాణ్ణి చూచి వాడు తనకంటె హీనుడైనట్లు ''తాగావ్రా?'' అని గద్దించటం ఏం సబబు ? 'సంఘం' అనేది అచ్చంగా చేస్తున్న పని ఇదే! ''సీతారామరావుకి సంఘాన్ని తన్నబుద్ధి అయింది. కాని ఎట్లా ? ఈ సంఘానికి తలెక్కడ ? తోక ఎక్కడ ? ఉదరం ఎక్కడ ? ఎట్లా తన్నేటట్లు ?'' ఒక మీటింగు జరుగుతూ ఉంటుంది. ''తాను వెతుకుతున్న సంఘం, తన్ను హింసించిన సంఘం తనకు కనబడకుండా తప్పించుకున్న సంఘం అదే అనిపించింది.'' సీతారామరావు వేదిక ఎక్కి సంఘం పెద్దల ఒక్కొక్కరి జీవితాన్ని అందులో కుళ్లునీ బయట పెట్టుతాడు. అందరూ కలిసి అతణ్ణి పిచ్చివాని క్రింద లెక్క గట్టి తన్ని పడేస్తారు.

సీతారామరావు పిచ్చి పిచ్చి కానేకాదు. అతని ఆంతర్యంలోని సంఘర్షణ బహిర్గతమైన, బాహ్యానికి ఆంతర్యానికీగల తెరను తాత్కాలికంగా ఛేదించివేసింది: ఆ 'అద్వైత' మనఃస్థితిలో సీతా రామరావులోని మానవత్వము, 'సంఘం', 'సంస్కారం' అనే శృంఖలాలన్నివిదిల్చివేసి, నిజస్వరూపాన్ని నిలబెట్టుకొన్నది. మానవత్వం జయించింది. నిజమే; కాని సంఘం గుర్తించని, సంఘానికి వెలి యైన, సంఘంతో విరోధించిన మానవత్వమే ఇది! ఈ సీతా రామారావుకి సంఘంలో స్థానం ఎక్కడ ? సీతారామరావు నూతన దృష్టికి సంఘంలో భిన్నత్వం, దానివెనుక మానవత్వపు ఏకత్వం కనిపించింది: ''ఒకవాదం మరొక వాదాన్ని రూపు మాపటంలేదు. వివిధ దశలకు సంబంధించిన కార్లూ, గుర్రాలూ ఎడ్లబళ్లూ అన్నీ సంఘంలో ఉంటూనే ఉన్నై........ ఒకటివచ్చి రెండోదాని అవసరంలేకుండా చెయ్యటంగాని, నామరూపాలు లేకుండా చెయ్యటంగానీ లేదు.— జరగటంలేదు. మానవ సంఘం ఎన్ని దశలు దాటినా, ఎంత పరిణామం చెందినా అన్ని దశలకు సంబంధించిన లక్షణాలు ఎప్పటికప్పుడు సంఘంలో ఉంటూనే ఉన్నై. ఈ అన్ని లక్షణాలనూ కలుపుకునే సంఘం వృద్ధిచెందుతూ ఉంది.........అయితే, ఒక దశనుంచి మరొక దశకు రావటం అంటే ఏమిటి?'' సీతారామరావును గమ నిస్తూ ప్రక్కనే ఉన్న రామయ్యతాత సమాధానం సూచి

స్తాడు: ''మానవుడీ విధంగా అభివృద్ధిచెందుతూపోతే ఒక ప్పటికి సంఘానికి దోహదం ఇచ్చే పనులే వ్యక్తికి ఆనందాన్ని, తృప్తిని ఇచ్చే స్థితి వస్తుంది......అప్పుడు 'ఎందుకు?' అనే ప్రశ్నకు తావులేదు. ఎందుకనే ప్రశ్న మానవునిచేత మంచి పనులు చేయించటానికి సహాయకంగా ఉంటానికి పుట్టింది. మానవునికి మంచి పనులు చెయ్యటమే స్వభావం అయినప్పుడు ఈ 'ఎందుకు'? యొక్క అవసరం క్షీణిస్తుంది. లేకుండా పోతుంది...........సాంఘిక పరిణామమే మానవునికి ఆనందం ఇచ్చే మనస్తత్వం కలిగాక సంఘానికి మానవునికీ సంఘర్షణ ఉండదు......మానవుడు పరిపూర్ణ మానవుడవుతాడు.....సాంఘిక దృష్టి అలవరచుకొని ముందుకు చూడు. సంఘాన్ని ముక్కలుగా (వర్గాలుగా) చూడక మొత్తంగా చూడటం నేర్చుకో.....ఇప్పుడు నువ్వు తరువాత మెట్టుకు వెళ్లవలసిన స్థితికి వచ్చావు. ధైర్యంగా ముందుకు వెళ్లు. నువ్వు సుఖపడు. నీ కుటుంబాన్ని సుఖపెట్టు. లోకాన్ని సుఖపెట్టు.........'' జీవితం ఎందుకు ? అనే ప్రశ్నకు : సంఘ పరిణామానికి అని జవాబు ! ఆ పరిణామం పూర్తయేదాకా మానవునికి స్వేచ్ఛలేదు! పరిపూర్ణత లేదు! అది ఎప్పుడు ఎంత కాలంలో పూర్తవుతుంది ? అనే ప్రశ్నకు జవాబులేదు. ఏమో ! ఎప్పుడో ! ఈ పరిణామవాదం అంతు లేని సోరంగంగా కనిపిస్తోంది. అంతేకాదు, సీతారామరావులో మేల్కొన్న మానవత్వాన్ని 'నీకు స్వేచ్ఛలేదు, నువ్వు కోరే పరిపూర్ణత రాదు. నువ్వు సంఘానికి బానిసగానే ఉండాలి,' నీ స్థానం అదే !' అంటూ ఏ పంజరంలోనుంచి విముక్తి లభించి నట్లయిందో ఆ పంజరంలోకే మళ్లీ వెళ్లి కూర్చోమంటున్నది ఈ సాంఘిక దృష్టి ! ''సీతారామరావు......మూర్తీభవించిన నిశ్శబ్దంలా కూర్చున్నాడు.......అర్ధ చంద్రాకారాన్ని అంతులేని సొరంగాన్నీ చూస్తున్నాడు. అతని కళ్లవెంట కన్నీటి చుక్కలు రాలుతున్నాయి. ఉండి ఉండి అకస్మాత్తుగా 'మిథ్య, మిథ్య, అంతా మిథ్య !' అని తన విశ్వాసాన్ని నిలబెట్టుకోటానికి అరిచాడు.'' అర్ధచంద్రాకారం అతని మానవత్వం; సంఘానికి వెలియైన దానికి పూర్ణత్వంలేదు ! కాని అంతులేని సొరంగం మాత్రం తనకు మార్గంకాదు ! అందులో ఏమున్నది ? అంధకారం, శూన్యం తప్ప ! అయితే వేరే మార్గమే లేదా ? జీవితం మీద తన విశ్వాసం ఎలా నిలబెట్టుకోటం? తన మానవత్వానికి స్థానం ఎక్కడ ?

సీతారామరావు శ్మశానంవైపు నడుస్తాడు. సీతారామరావు తనలోని మృత్యుచ్ఛాయతో— జీవితం ఎందుకు ? అని అవిశ్వాసం ప్రకటించిన తనలోని ఒక భాగంతో— ముఖాముఖి నిలుచుంటాడు. ఆ భాగం తన తండ్రినుంచి సంక్రమించిందని అతనికి వెంటనే తెలుస్తుంది : — ఏం ''నాయునా నేను చెప్పింది తప్పా ?'' అది తండ్రి గొంతుకలానే ఉంది ! తండ్రి 'ఎందుకు ?' అని ప్రశ్నించటం (హేతువాద దృక్పథం) తనకు నేర్పాడు. ఫలితం 'జిల్లేడు మొక్కలు' ! ! ''అతనికి ఈ జిల్లేడు మొక్కలకు తన తండ్రి ఎరువయాడనిపించింది..... ఉన్న మొక్కల్లో పెద్దమొక్క కదిలింది. తన్ను పలకరించింది. 'అన్నాయ్' అంది. అతడు ఉలిక్కిపడ్డాడు.'' హేతువాద దృక్పథం ఒక్కటే కాదు, గౌరవ ప్రతిష్ఠల పేరిట దురభిమానంకూడా తండ్రినుంచీ సంక్రమించిందే ! ఈ రెండింటిమీదా తిరుగుబాటుచేసి, బజార్నపడి, సంఘాన్నీ సాంఘిక దృక్పథాన్నీ తిరస్కరించి, దెబ్బలుతిని సంఘంలో ఇమడలేక శ్మశానం వైపు నడిచిన 'మానవత్వపు' అంశ, అది తల్లినుంచీ సంక్రమించింది. సీతారామరావులోని ఈ రెండు భాగాల మధ్యా వివాదం ఒయల్దేరుతుంది.

ఇక్కడ జాగ్రత్తగా చదివి అన్వయించుకోవలసిన భాగం ఒకటి ఉంది. సీతారామరావు శ్మశానంలో నిజంగానే ఒక ముసలి వ్యక్తిని చూస్తాడు: 'ఏం నాయనా, నేను చేసింది తప్పా ?' అని ఆ వ్యక్తి ప్రశ్నిస్తాడు. సీతారామరావు అంతర్యానికి యిది తన తండ్రి అడుగుతున్న ప్రశ్నలా కనిపిస్తుంది. 'ఏది తప్పో ఎవరు చెప్పగలరు? ఎవరి మనస్సు వాళ్లకే సాక్షి' అంటాడు. ఈ మాట తండ్రిని ఉద్దేశించి అన్నట్లే అంటాడు. ఒక్క లిప్తలో జిల్లేడు మొక్కలు కదలటం, తన తండ్రి తనని తప్పుపట్టటం, తను తండ్రిదే తప్పని తిరగబడటం, తనలోనే తండ్రి అంశ ఒక భాగంగా తల్లి అంశ ఒక భాగంగా రెండురకాల వ్యక్తిత్వాలు ఉండటం, సీతారామరావు గుర్తిస్తాడు. ఇంతలో ఎదుట నిలుచున్న వృద్ధుడు సీతారామరావు అన్న మాటక్క సమాధానంగా : 'అదుగో— బాబు, సత్యం చెప్పావు. 'నూరేళ్లు వర్ధిల్లు !..........' అంటూ తను నీతిగా బతకలేకపోవటం, తన కూతురు తనకోసం చేసిన త్యాగం, ఆమె చనిపోవటం గూర్చి చెబుతాడు. సీతారామరావులోని మానవత్వానికి అంటే తల్లి అంశకూ, వైయక్తిక దృక్పథానికీ (ఎవరి మనసు వాళ్లకే సాక్షి అనే మాటకు) మద్దతు లభిస్తుంది. చావు బ్రదుకులూ, సుఖ దుఃఖాలు, కేవలం సిద్ధాంతాలకూ, ఆదర్శాలకూ, దృక్పథాలకూ, హెచ్చుతగ్గులకూ అతీతమైన పరమ సత్యాలుగా గోచరిస్తాయి, వృద్ధుని చరిత్ర విన్న సీతారామరావుకు.

అయితే సీతారామరావు తను ఏ అంశగా జీవించాలి ? ఎవరు నిజమైన సీతారామరావు ? తండ్రి 'పిడాక పీడకలగా ఉన్నాడు' అంటూ నిర్లక్ష్యమిస్తాడు. తల్లి సమాధి 'బాబూ !' అని పిలుస్తూ 'నువ్వు మారావు నాయనా !' అంటుంది. సీతా

# శ్రీ గోపీచంద్

రామరావు ఆ సమాధి మీద పడి భోరున ఏడుస్తాడు. 'ఏమి లాభంలేదమ్మా ! ఆలస్యం అయిపోయిందమ్మా !' అంటాడు గత జీవితపు ఫలితాలు, తను మారినా, భవిష్యత్తులో తనను వెంటాడక మానుతాయా ? అని అతని సందేహం. అదే అతని ఆకారం. వృద్ధాప్యం వస్తుంది. తన పిల్లలు తన భార్యని ప్రేమించినట్లు తనని ప్రేమించరు. 'తన్ను జాలి తలిచేవాళ్లూ లేరు. తనకు సానుభూతి చూపేవాళ్లు కూడా లేరు.' ఇదీ తండ్రి అంశగా పెరిగిన తన ఆకారం ! 'తన ఆకారాన్ని తాను జయించలేడూ ?' సీతారామరావుకూ అతని ఆకారానికీ మధ్య యుద్ధం ప్రారంభమౌతుంది. ''తన ఆకారాన్ని లోబరుచుకున్నాడు. తన ఆకారాన్ని జయించాడు. తన ఆకారాన్ని నామరూపాలు లేకుండా చేస్తున్నాడు.... తన్ను తానే హత్య చేసుకున్నాడు.'' అతనికీ అతని ఆకారానికీ అంతటి అవినాభావ సంబంధం !

జీవితం ఎందుకు ? అనే ప్రశ్నకు, జీవితం ఎలాగో ఒకలాగా జీవించటానికే ! అనే సమాధానం సీతారామరావుకు లభించింది. కాని భవిష్యత్తులో ఎలా జీవించాలి ? తనకు ప్రేమ లభ్యంకాదేమో ! అన్న సందేహంతో పోరాడుతూనే, దానిమీద సాధించిన విజయం ఫలితంగానే సీతారామరావు మరణించాడు. అతని మరణం అతను జీవితం మీద విశ్వాసాన్ని నిలబెట్టుకోవటమే !

నవలలో 'అసమర్థుని అంతం' అనేది యించుమించు సగం భాగంగా ఉంది; ఇది ఉత్తమ రచన, చాల జాగ్రత్తగా చదువవలసిన రచన. సీతారామరావు 'పిచ్చి' షేక్స్‌పియర్ నాటకాల్లో హేమ్లెట్, లియర్ పాత్రల 'పిచ్చి' కోవకు చెందింది. లియర్ కొమార్తెల కృతఘ్నతతో అతని ఊహాప్రపంచం బద్దలు కావటంతో, స్వాభిమానము, దర్పము, చక్రవర్తి నన్న భావము ఊడిపడటంతో తనలోని మానవత్వపు లోతుల్ని స్పృశించి, తద్వారా నికృష్టుడైన బిచ్చగానితో తాదాత్మ్యాన్ని అనుభవిస్తాడు—ఆ సమయంలో అతను 'సంఘం' బాహ్యావేషం మీదా, కట్టుబాట్లు, ఆదర్శాలు, న్యాయం మొదలైన వాని మీదా చేసే విమర్శ, సీతారామరావు 'సంఘం'మీద చూపే తిరుగుబాటూ ఒక కోవకు చెందినవే. హేమ్లెట్, లియర్‌లు మరణించినా, వారి మరణంద్వారా వాళ్లు సాధించిన ఆత్మజ్ఞానము, జీవితంపట్ల విశ్వాసమూ ప్రస్ఫుట మౌతూనే ఉంటాయి. సీతారామరావు మరణం కూడా అటువంటిదే !

సీతారామరావు పాత్ర సృష్టించటం ద్వారా గోపీచంద్ సాధించిన విజయం : సాంఘిక దృష్టికీ, ఆదర్శాలకూ అతీతమైన జీవితంపట్ల విశ్వాసం. జీవితం ఎందుకు ? అనే ప్రశ్నకు జీవితం జీవించటానికే అన్న సమాధానం. జీవితం 'సంఘ పరిణామంలో పాత్ర నిర్వహించటానికి,' లేక 'తండ్రి గౌరవ ప్రతిష్ఠలు నిలబెట్టటానికి' అనేటటువంటివి సమాధానాలు కానేరవు అని గోపీచంద్ గుర్తించిన సత్యం .... ''తర్కానికి అందకుండా ఉండి మానవుని అనుభవంలోకి వచ్చే అనుభూతులు కొన్ని ఉన్నాయి. మానవునిచే అనేక కార్యాలను చేయించే స్వాభిమానం అనే గుణం ఉంది. వీటిని వేటినీ అజలోకి తీసుకోదు హేతువాదం. అందువల్ల సత్యసాధనకు అది పూర్తిగా ఉపకరించదు. .... హేతువాదం మనోవీధిలో ఉన్నంతవరకు ప్రమాదంలేదు. అప్పుడది విభిన్నదృక్పథాలనూ, సిద్ధాంతాలనూ కొంతవరకూ సహిస్తుంది. ఒకదానితో ఒకదాన్ని పోల్చి చూచుకొని సామరస్యం కోసం ప్రయత్నిస్తుంది. మారుతుంది; విశాలపడుతుంది. ఉన్నతిని పొందుతుంది. కాని జీవితంలో అడుగుపెట్టి పరిపాలించటానికి పూనుకునేటప్పటికి సిద్ధాంతంగా తయారై గిడసబారి ప్రతి అభివృద్ధి కదలికకూ అడ్డుగా నిలిచి నిరోధిస్తుంది. సామరస్యానికి కాక, సంఘర్షణకూ రక్తపూరిత విప్లవాలకూ దారితీస్తుంది...'' (తత్త్వవేత్తలు : పీఠిక) 'అసమర్థుని జీవయాత్ర' వ్రాసిన సుమారు 15 సంవత్సరాల తర్వాత వ్రాసిన పై వాక్యాలు ఆ నవలకు మంచి వ్యాఖ్యానంగా ఉన్నాయి. ఇందులో, 'స్వాభిమానాన్ని' గూర్చి ప్రత్యేకంగా పేర్కోవటం, హేతువాద దృక్పథం మనోవీధిని దాటి జీవితంలో ప్రవేశిస్తే కలిగే దుష్ఫలితాల్ని సూచించటం ముఖ్యంగా గమనించదగ్గవి.

'అసమర్థుని జీవయాత్ర'ను తండ్రికి అంకితం యిస్తూ ''నాన్నగారికి ఎందుకు అనే ప్రశ్న నేర్పినందుకు'' అన్నాడు గోపీచంద్. అది తనలోని తండ్రి ఛాయకు ఒక వీడ్కోలు నమస్కారం. దానితో ఆలోచనలో హేతువాద దృక్పథపు ప్రాభవానికి, కేవలం సాంఘిక దృష్టికి కూడా స్వస్తిచెప్పిన గోపీచంద్ జీవితాన్ని గూర్చి విచికిత్స బదులు విశ్వాసం పెంపొందించుకున్నాడు. ఈ విశ్వాసం మానవుడిమీద—సామాజికుడైన మానవుడి మీద కాదు, వ్యక్తియైన మానవుడిమీద. ఫలితంగా ఎమ్. ఎన్. రాయ్ దర్శనమే కాదు, ప్రపంచ తత్త్వవేత్తల దర్శనములను కూడా అధ్యయనం చేశాడు. ఇది మానవుల్లోని దృక్పథ వైవిధ్యాన్ని భిన్నత్వాన్నీ గౌరవంతో సమదృష్టితో అర్థంచేసుకునే ప్రయత్నం. అంతకంటె ముఖ్యంగా గోపీచంద్ అనుభవంద్వారా వ్యక్తిగతమైన జీవిత స్వరూపాన్నే దర్శించే ప్రయత్నం చేశాడు. జీవితాన్ని విమర్శించి నెరసులు వెదికే దృక్పథంతో కాదు, జీవితాన్ని నమ్రతతో అంగీకరించి అనుభవించే దృక్పథంతో జరిగిన ఈ ప్రయత్నమే అతని తర్వాతి నవలలు ప్రతిబింబించాయి. (సశేషం)

# “కాలదూరాల మధ్య”

## శ్రీ రంగధామ్

ఎవడో రాక్షసుడు విల్లునెక్కుపెట్టి విడిచిన బాణంలా, రివ్వుమని దూసుకుంటూ వచ్చి ప్లాటుఫారం దగ్గర నిల్చింది మెయిలు. అంతకు ముందే ప్రారంభమైన కలకలం స్టేషనులో ఒక్కసారి బాగా విజృంభించింది. ఎలక్ట్రిక్ లైట్ల వెలుగులో జనం హడావిడిలో, ప్లాటుఫారం అకస్మాత్తుగా మేలుకున్నట్లయింది. ఆ కొద్ది నిమిషాలూ ఆ ప్రాంతంలో గొప్ప చైతన్యం. కంపార్టుమెంటుల వైపు చూస్తూ నడుస్తున్న నాకు, ఒక పెట్టెలో నేనెరిగున్న ముఖం ఒకటి కన్పించింది.

అవును, సందేహం లేదు. ధనరాజే! ప్రక్కన ఎవరో స్త్రీతో మాట్లాడుతున్నాడు. పాత సంగతులు జ్ఞాపకం రాగా కొన్ని నిముషాలు అలా నిలబడి పోయాను. పదిహేనేళ్లయింది మేం కలుసుకుని. అప్పటి రోజుల్లో మేం రోజూ సాయంకాలం రైల్వే స్టేషన్‌కు వచ్చే వాళ్లం.

మనసులో ఒక సినిమా రీలు తిరిగింది.

* * *

మెయిలు రాగానే మా మామూలు కార్యక్రమం ఆరంభించాం. గార్డు పెట్టె దగ్గర్నుంచి ఇంజను దాకా వరుసాగ్గా పెట్టెలోని మొహాల్ని పరిశీలించడం ప్రారంభించాం. రోజూ సాయంకాలం మా కదే పని. మెయిలు రాగానే శ్రద్ధగా అన్ని కంపార్టుమెంటులూ తణిఖీ చేస్తాం. ప్రయాణికులందర్నీ విమర్శగా చూస్తాం. థర్డు క్లాసు పెట్టెలలో క్రిక్కిరిసి కూరుకు పోయిన మనుష్యుల దగ్గర్నుంచీ, ఫస్టు క్లాసు, ఎ. సి. పెట్టెలలో విశ్రాంతిగా, ప్రశాంతంగా ప్రయాణించే మహాను భావుల్ని వారి ఆకర్షణీయమైన సామాన్లనీ చూసి ఆనందిస్తాం. మధ్య మధ్య కన్పించే అందమైన అమ్మాయిల వదనాల మీద మా దృష్టి మరి కొన్ని సెకనులు నిలవడంలో విపరీత మేమీ లేదు.

నేనూ, ధనరాజ్, ప్రకాశం రైలాగి నప్పుడు కన్పించే దృశ్యాల్ని చాలా ఉత్సాహంతో తిలకిస్తాం. అరడజనుకు పైగా భోజనపు పళ్లాల్ని రెండు చేతుల మధ్యా పట్టుకుని, నైపుణ్యంగా జనాన్ని తప్పించుకుంటూ వెళ్లిపోయే హోటలు వెండర్లూ, పత్రికలూ, మిఠాయిలూ, చుట్టా బీడి సిగరెట్లు అమ్మే కుర్రవాళ్లూ, తమ కెక్కడ చోటు దొరకదోనని తమ సామానుతో సహా పరిగెత్తే ప్రయాణీకులూ, చోటుకోసం, ప్రవేశం కోసం జరుగుతూండే వాగ్వాదాలూ ఇవి మామూలుగా కన్పించేవైనా, వాటిని చూడడం అదొక సరదా. ప్రయాణికుల అవస్థలు చూసి నవ్వుకున్నాం. చిన్న చిన్న పిల్లలతోనూ, బోలెడు సామానుతోనూ ప్రయాణం చేసే కుటుంబీకుల్ని సానుభూతితో చూసాం. చివరకు రైలు కదుల్తూంటే, ఎవరో ఆప్తబంధువుల్ని రైల్లో సాగనంపుతున్నట్లు, అందరి ప్రయాణికులకూ వర్తించేట్లు చేతులూపుతూ, రైలుతో కొంత దూరం నడిచాం. కదుల్తున్న రైలుతోపాటు, కరిగి పోయిన కలలోంచి, ఘనీభవించిన యదార్థ స్థితిలోకి వస్తున్న ప్లాటుఫారం మీద నిలబడి ఒకరి వైపొకరం చూసుకున్నాం. విరగబడి నవ్వాం. ఒకసారి “బావుంది” అనుకుని మళ్లీ నవ్వాం. మెల్లిగా నడుచుకుంటూ నిర్మానుష్యమై పోతున్న ప్లాటుఫారం మీద సిమెంటు బెంచీల మీదకు చేరాం.

ఆ చిన్నవూరైన పలాసాలో సాయంకాలం వినోద కార్యక్రమంలా మెయిలు కోసం స్టేషనుకి రావడం, ప్లాటుఫారం మీద మెయిలు వచ్చే ముందర కొంతసేపు, వెళ్లి పోయాక కొంతసేపూ కాలం గడపడం మాకు అలవాటయిపోయింది. మెయిలు వచ్చే ముందర, ప్లాటుఫారం, ఎలక్ట్రిక్ లైట్ల వెలుగులో, ప్రయాణీకుల సంరంభంలో ప్రియుడి కోసం అలంకరించుకుని ఎదురు చూస్తున్న ప్రేయసిలా వుంటుంది. ఆ చివరనుండి ఈ చివర దాకా నడిస్తే అనేక రకాల మనుష్యులూ, దృశ్యాలు కన్పిస్తూంటాయి. ఆ కలకలం, సన్నాహాలూ చూస్తూంటే మాకు కాలం ఇట్టే గడిచి పోయేది. మెయిలు వెళ్లిపోయిన తరువాత చాలాసేపు కబుర్లు చెప్పుకోవడం మాకు సరదా. అందులోనూ ప్రణయం గురించి మాట్లాడుకోవడం మాకు చాలా ప్రీతికరం. అప్పట్లో ధనరాజ్ యొక్క దిన దిన

ప్రవర్థమానమవుతున్న ప్రణయం గురించి రోజూ కొత్త విశేషాలు వింటూండే వాళ్ళం.

"ఇవ్వాళ వీధులో నుల్చుని చాలాసేపు నావైపు చూసిం దోయ్." అనో "ఇవ్వాళ పలకరిస్తే చాలా సరదాగా మాట్లా డిందోయ్." అనో ప్రారంభించేవాడు. ఆరోజ పరిణామం గురించి ముగ్గురం కాస్సేపు చర్చించి స్త్రీల మనస్తత్వం అగాధం అనీ, ఏమైనా ఆ అమ్మాయిలో ధనరాజ్ ను ప్రేమి స్తున్న లక్షణాలు చాలా కన్పిస్తున్నాయనీ నిర్ణయించే వాళ్లం.

ధనరాజ్ నల్లగా వున్నా అతని నవ్వులో చెప్పలేని అందం ఏదో వుంది. మనిషి చాలా బోళావాడు. అమాయకంగా మాట్లాడు తాడు. ఎప్పుడు చాలా సరదాగా వుంటాడు. అతని వయస్సు పాతికేళ్ళు. మేం ముగ్గురం అదే వయసులో వాళ్లం. అతను ఎక్సయిజ్ సబ్ ఇన్‌స్పెక్టర్; నేనూ ప్రకాశం స్కూలు మాష్టర్లం. ముగ్గురమూ బ్రహ్మచారులమే. క్లబ్బులో పేకాట దగ్గర స్నేహితులమయ్యాం. కొన్నాళ్ల తరువాత క్లబ్బు మానేసి సాయంకాలం స్టేషను ప్లాటుఫారం మీద గడపడం మొద లెట్టాం.

మేం ముగ్గురం వివాహం చేసుకోక పోవడానికి కారణం ఒక్కటే. మాకు నచ్చిన అమ్మాయిలు కన్పించలేదు. మా స్నేహం ప్రారంభమైన మొదటి రోజులలో మేము వివాహం చేసుకో బోయే అమ్మాయి ఎలావుండాలో చర్చిస్తూండే వాళ్లం. అసలటు వంటి అమ్మాయిలు దొరకరేమోనని కూడా మాకు అనుమానంగా వుండేది. అప్పుడప్పుడు మా అమ్మ, "ఆ రాజోలు వాళ్ళు మళ్ళీ ఉత్తరం రాశారురా." అని గోల పెట్టినప్పుడు, కాస్సేపు ఆ అమ్మాయి జ్ఞాపకమొచ్చేది. సాయంకాలం ప్లాటుఫారం మీద నేను మా స్నేహితులతో వర్ణించిన వూహా సుందరికీ, ఆ అమ్మాయికి ఎంత భేదమో చూచుకొని, అమ్మకు జవాబు చెప్పకుండా వూరుకునే వాణ్ణి. ప్రకాశం పుస్తకాలు తెగ చదువుతాడు. ఆ పుస్తకాలలో వర్ణించే నాయికలలాటి భార్య కావాలంటాడు. ధనరాజ్ కి సినిమా స్టార్ల పిచ్చి. అందులోనూ హిందీ తారలంటే మరీ అభిమానం.

ఇందిరలో కొద్దిగా సినిమా తారల పోలికలున్నాయి. ఆమె డాక్టరు శివరాం గారి మూడో కుమార్తె. వయస్సు పద్దెనిమిది సంవత్సరాలు. ధనరాజ్ శివరాంగారి ప్రక్కింట్లోనే అద్దెకుంటున్నాడు. ధనరాజ్ ఆ వూరికొచ్చిన దగ్గ ర్నుంచీ, ఇందిర అంటే చాలా అభిమానం ప్రకటించసాగాడు. ఆమె దృష్టి నాకర్షించాలని అనేక పనులు చేస్తూండే వాడు. కాని చాలా కాలం వరక్కూ ఇందిర తన అభిప్రాయ మేమిటో తేల్చలేదు. ఈలోపల ధనరాజ్, శివరావ్ గారితో పరిచయాన్ని వృద్ధి చేసుకుని తరచూ వాళ్ళింటికి వెళ్లసాగాడు.

మొదట్లో ధనరాజ్ కు ఆమె యెడలగల ఆకర్షణంతా రాను రాను ఆరాధనగా మారింది. మాకు ఇందిరలో అంత ప్రత్యేకత ఏమీ కన్పించక పోయినా, ధనరాజ్ ప్రేమని మాత్రం గౌరవించ సాగాం. ధనరాజ్ తన తల్లితో ఉంటున్నాడు. ఆవిడకు ఏభై ఏళ్ళుంటాయి. చాలా మంచి మనిషి. ముగ్గు బుట్టలా నెరిసిన తలతో, బక్కపల్చని ఆమె విగ్రహంలో చిరు నవ్వు మొహం, ఏదో జాలి, అభిమానం, వ్యక్తం చేస్తూండేది. ఆమెకు ఇద్దరు కొడుకులు. ధనరాజ్ పెద్దవాడు. రెండవ వాడు నాగరాజ్, డాక్టర్ పరిక్ష పాసయి విశాఖపట్నంలో 'హౌస్ సర్జను' చేస్తున్నాడు.

ఇందిర, ధనరాజ్ ఇంట్లో లేనప్పుడు వాళ్ళింటికి వచ్చి అతని తల్లితో మాట్లాడుతూండేదిట. పత్రికలూ, పుస్తకాలూ అడిగి తీసుకు వెళ్తూండేది. ఆమెకు అప్పుడప్పుడు పువ్వులు కూడా ఇస్తూండేవాడు ధనరాజ్. ఆమె కూడా అత నిచ్చిన పువ్వులు ఆప్యాయంగా ధరిస్తూండేది. క్రమంగా ధనరాజ్ అంటే ఆమెకు కొంత అభిమానం ఏర్పడినట్లు తోచ సాగింది. అన్ని విషయాలలోనూ ధనరాజ్ చాలా చొరవైన వాడే. కాని ఇందిర విషయంలో తను ఏమాత్రం చొరవ చూపిం చినా, వ్యవహారం చెడి పోతుందేమోనని ఓపికతో ఇందిర అనురాగం సంపాదించటానికి ప్రయత్నించాడు.

మేము ముగ్గురం సాయంకాలం రైల్వేస్టేషను వద్ద కలుసుకోగానే ఆ రోజు జరిగిన విశేషమేదైనా ఉంటే మాతో చెప్పేసేవాడు. స్టేషను ప్లాటుఫారం మీద పచార్లు చేస్తూ కబుర్లు చెప్పుకోవడం అంటే మాకెంతో సరదాగా ఉండేది. పగలంతా ఆ సమయం కోసం ఎదురు చూసేవాళ్లం. ఎన్ని పనులున్నా తెముల్చుకుని ఆరో గంటకల్లా ప్లాటుఫారం మీదకు చేరుకునే వాళ్లం. మెయిలు టైము అవుతున్న కొద్దీ ప్లాటు ఫారం మీద కలకలంతో బాటు, మాలో ఉత్సాహం కూడా పెరిగేది. మెయిలు రావడం పెట్టెలన్నీ తణిఖీ చెయ్యడం అయి పోయాక తీరికగా సిమెంటు బెంచీల మీద కూచుని మా చర్చలు ప్రారంభించేవాళ్లం.

ఆ స్టేషనులో ఒక కుంటిది అందరి వద్దా ముష్టి అడుగుతూండేది. దానికి నలభై యేళ్ల దాకా వయసుంటుంది. దాని రూపం ఎంతో వికారంగా ఉంటుంది. కాని దానికి నోటి మంచి ఉండడం వల్ల, అందరినీ ఆప్యాయంగా పలకరించి, డబ్బులు సంపాదిస్తుంది.

## కాల దూరాల మధ్య

''అందం అంటే బాహ్య సౌందర్యం అని అనుకుంటాం గాని, నిజానికి ఆంతరంగిక సౌందర్యం తెలుసుకున్న నాడు ఎంతో ఆనందం కలుగుతుందోయ్'' అన్నాను నేను చర్చను ప్రారంభిస్తూ, ఆకుంటిదాన్ని ఉద్దేశంలో పెట్టుకుని.

ప్రకాశం అవునని తలూపాడు. ''కాని ఆంతరంగిక సౌందర్యం తెలుసుకునేంత అవకాశం రావాలి కదా ?'' అన్నాడు.

ధనరాజ్ మాతో ఏకీభవించలేదు. ''స్త్రీకి బాహ్య సౌందర్యమే ముఖ్యం. ఆంతరంగిక సౌందర్యం అనేది చెప్పుకోడానికి బాగానే ఉంటుంది కాని, అది పరిస్థితులపై ఆధారపడి ఉంటుంది తప్ప ప్రత్యేకంగా ఉండదు.'' అన్నాడు.

''అంటే ?'' అన్నాను అర్థంకాక.

''అంటే మరేమీ లేదు. తన చుట్టూ వాతావరణం మంచిదైతే ఆమె మంచిదౌతుంది. తన చుట్టూ చెడే ఉంటే, ఆమె చెడ్డదవుతుంది. తలితండ్రులు మంచివారైతే పిల్లల అంతరంగాన్ని సౌందర్యమయం చెయ్యగలరు. కాని భౌతిక సౌందర్యం భగవంతుడిచ్చేది. అది కలిగించే ఆనందమే గొప్పది'' అని ధనరాజన్నాడు.

''భౌతిక సౌందర్యం ఉండి ఆంతరంగిక సౌందర్యం లేకపోతే ?'' అని నేను ప్రశ్నించాను.

''అది అంత సమస్యనుకోను. ప్రయత్నించి ఆమెను మంచిదానిగా మార్చవచ్చు. కాని బాహ్య సౌందర్యం అబ్బడం అంత సులభంకాదు. దానికున్న ఆకర్షణ మరి దేనికీ ఉండదు. నా స్వవిషయం ఒకటి చెప్తాను వినండి'' అని సిగరెట్టు తీశాడు ధనరాజ్.

మేము తలొకటి తీసి వెలిగించ నారంభించాం. ధనరాజ్ ని ఈ చర్చ ఎందుకో గాని బాగా కదిలించిందని గ్రహించాం.

''మా మామయ్య కొక కూతురుంది. ఆమె కుంటిది. ఇప్పుడు దాని వయస్సు పద్దెనిమిది సంవత్సరాలు. అదంటే తలిదండ్రులకు చాలా అభిమానం. అది పుట్టుకలోనే ఒక కాలు అవిటితో పుట్టింది. అతి కష్టం మీద దానికి కుంటుకుంటూ నడిచే నడక వచ్చింది. అది చాలా తెలివైనది. మా మామయ్య దానిని స్కూలు ఫైనలు దాకా చదివించాడు. అది మంచి మార్కులతో పాసయింది. దానికి పెళ్లి చెయ్యాలని పై చదువుకు పంపలేదు. దాన్ని నాకిచ్చి పెళ్లిచెయ్యాలని వాళ్ళు ప్రయత్నం చేశారు. నేను ఇంటర్మీడియట్ పాసయిన ఏడే మా నాన్నగారు చనిపోయారు. మా కేమీ ఆస్తులూ పాస్తులూ లేవు. మేమిద్దరం అన్నదమ్ములం, చదువులో చురుకుగా పైకి వచ్చినా, పై చదువులకు వెళ్ళే స్తోమతు మాకు లేదని గ్రహించాం. నేను వెంటనే ఉద్యోగంలో చేరాలని నిశ్చయించాను. నా తమ్ముడు ఇంటర్ రెండో ఏడు; వాడిని ఆ ఏడాది చదివించగల్గుతానన్న నమ్మకం కూడా లేదు. ఇంట్లో నానా ఇబ్బందులూ పడ్తున్నాం. ఆ సమయంలో మామయ్య ఒకనాడు మా ఇంటికి వచ్చాడు.'' అని ఒక్క నిముషం ఆగి, రెండు సిగరెట్టు దమ్ములు గట్టిగా లాగి మళ్లీ ప్రారంభించాడు ధనరాజ్. ప్లాటుఫారం మీద ఎక్కువ మంది జనం లేరు. లైట్ల వెల్తురూ, వెన్నెలా, చల్లని గాలీ, వాతావరణం కథలు వినడానికి ఎంతో బాగుంది.

''మామయ్య మా స్థితికి చాలా సానుభూతి చూపించాడు. తనకు చేతనైన సహాయం తప్పక చేస్తానన్నాడు. నన్ను తన కూతుర్ని వివాహం చేసుకోమని అడిగాడు. కట్నం చాలా ఇస్తానన్నాడు. కాని నా అభిప్రాయం నేను స్పష్టంగా చెప్పేశాను. నాకు మామయ్య కూతురియందెంత మాత్రమూ ఆ అభిప్రాయం లేదు. నేను అందమైన పిల్లను వివాహం చేసుకోవాలని ఆశయం పెట్టుకున్నాను. కాబట్టే మామయ్య చూపించిన ఎరకి లొంగి పోలేదు. నా విషయం లాభం లేదని తెలుసుకున్నాక, మా మామయ్య, తమ్ముణ్ని కదిపి చూసాడు. వాడికి యం. బి. బి. యస్. చెప్పిస్తానన్నాడు. వాడికి చిన్నప్పటి నుండీ డాక్టర్నవ్వాలని కోరికగా ఉండేది. అందువలన వాడు తనకు డాక్టరు చదువు చెప్పించే పక్షంలో, మామయ్య కూతుర్ని పెళ్లి చేసుకుంటానన్నాడు. మామయ్య ఎంతో సంతోషించాడు. అమ్మ కూడా చాలా సంతోషించింది. అప్పటి నుండి మా తమ్ముడి విషయమంతా మా మామయ్యే చూసుకుంటున్నాడు. వాడు యం. బి. బి. యస్. కోర్సంతా పూర్తి చేశాడు. నన్ను త్వరలో వివాహం చేసుకోమని అమ్మా, మామయ్యా బలవంతం చేస్తున్నారు. నా వివాహం కాగానే వాడి వివాహం చెయ్యాలని వాళ్ల అభిప్రాయం. కాని నాకు నచ్చిన పిల్ల ఒక పట్టాన దొరకటం లేదు. ఈ మధ్య మా అమ్మ వత్తిడి భరించలేక ఇందిరను వివాహం చేసుకుం టానని చెప్పాను. అప్పటి నుండి మా అమ్మ వాళ్లతో ఎల్లాగైనా ఈ విషయం కదిపి, నా వివాహానికి ఏర్పాట్లు చెయ్యాలని చూస్తోంది. వాళ్లు కూడా సుముఖంగా ఉన్నట్లున్నారు.''

మాకు చాలా ఆనందం వేసింది. ''నీలాగ కుండ బద్దలు కొట్టినట్లు నిర్మొహమాటంగా చెప్పడం అందరికీ చాతకాదోయ్. అలా చెయ్యడం వల్ల మొదట్లో అందరికీ కష్టమనిపించినా.

తరువాత సంతోషప్రదమవుతుంది.'' అన్నాను ఆ నాటికి మెల్లిగా చర్చ ముగిస్తూ.

''ఏమైనా నా తత్వ మంతే'' అంటూ లేచాడు ధనరాజ్. ముగ్గురం కొంత దూరం కలిసి నడిచి తరువాత ఎవరిళ్లకు వాళ్లు వెళ్లిపోయాం.

మర్నాడు మెయిల్ టైముకు మేము ప్లాటుఫారం మీదకు వెళ్ళేసరికి, ధనరాజ్ తనతో బాటు మరియొక యువకుణ్ణి తీసుకువచ్చి పరిచయం చేశాడు. అతను నాగరాజ్. పచ్చని శరీరచ్ఛాయా, చక్కని కనుముక్కు తీరూ మంచి ఎత్తయిన విగ్రహం, అతనిది. మాతో సరదాగానే మాట్లాడినా, ధనరాజ్‌లా అతిగా మాట్లాడే తత్వం కాదతనిది. ముభావంగా ఉంటాడు. అతని కోర్సు గురించీ, వైజాగ్ గురించి ఏవో కబుర్లు చెప్పాడు. మెయిలు వచ్చి వెళ్లిపోయాక అన్నదమ్ములిద్దరూ తొందరగానే ప్లాటుఫారం వదిలి వెళ్లిపోయారు. నేనూ, ప్రకాశం కూడా ఆ రోజు తొందరగానే ఇళ్లకు వెళ్లిపోయాం.

వరుసగా రెండు రోజులు అలాగే గడిచి పోయాయి. అన్నదమ్ములిద్దరూ మెయిలు టైముకు వచ్చి త్వరగా వెళ్లిపోతూండే వారు. మూడవ రోజు ప్రొద్దున్న నాగరాజ్ విశాఖపట్నం వెళ్లిపోయాడు.

ఆ రోజు సాయంకాలం మళ్లీ మేం ముగ్గురం, మెయిలు వెళ్లిపోయాక ప్లాటుఫారం మీద కూర్చుని బాతాఖానీకి ఉపక్రమించాం.

ధనరాజ్ ప్రారంభించాడు. ''మా వాడొక కొత్త సమస్య తెచ్చి పెట్టాడు'' అన్నాడు. నేనూ ప్రకాశం ఒకరి మొహం ఒకరు చూసుకున్నాం.

''మొట్ట మొదట వాడు, మామయ్య కూతుర్ని పెళ్లాడుతానని అన్నప్పుడే నేను వాడికి అనేక విధాలుగా చెప్పాను. అది చాలా కష్టమనీ అనవసరంగా చిక్కుల్లో పడద్దనీ. చదువు మీద ఉండే ఆసక్తి కొద్దీ మామయ్య షరతుకు ఒప్పుకున్నాడు. ఇప్పుడు విచారిస్తున్నాడు.''

''ఏం ? ఏం జరిగింది ?'' అని అడిగాడు ప్రకాశం.

''వాళ్ల క్లాసమ్మాయి నొక దానిని ప్రేమించాడట. ఆమె కూడా వీడిని ప్రేమించింది. రెండు సంవత్సరాల నుండీ ఇద్దరి మధ్యా ఇది జరుగుతోంది. ఆమె వివాహానికి తొందర పడుతోంది.''

''మరి మీ మామయ్య కూతురు సంగతి ?'' అన్నాను నేను.

''మామయ్య మొన్ననే రాశాడు, ముహూర్తం తొందరలో పెట్టించమని ఉత్తరం. నా వివాహం వెంటనే జరిపించేసి, వాడి వివాహానికి ఏర్పాటు చేసేస్తానని రాశాడు. ఇందిర విషయం అమ్మ రాసినట్లుంది. అందుకని నా వివాహం జరిగి పోతుందనీ, వాడి వివాహం చేసెయ్యొచ్చుననీ అనుకుంటున్నాడు.''

',అయితే ఇప్పుడెలా ?'' అన్నాడు ప్రకాశం.

''అదే నేనూ ఆలోచిస్తున్నాను. నాగరాజ్ ఇప్పుడెంతో బాధ పడుతున్నాడు. అప్పుడు వాడికి చాలా చిన్న వయస్సు. పెళ్లంటే ఏమిటో తెలియక ఒప్పుకున్నాడు. కాని జీవితంలో ప్రేమ ప్రభావంలో పడ్డాక వాడికి అన్ని విషయాలూ తెలుస్తున్నాయి. ఈ మూడు రోజులూ నాకూ అమ్మకూ, వాడి గొడవతో నిద్రాహారాలు సరిగా లేవు. మామయ్యా కేం జవాబు చెప్పాలో తెలియటం లేదు.'' అన్నాడు దిగులుగా ధనరాజ్.

నేనూ ప్రకాశం ఎంత ఆలోచించినా ఈ సమస్య పరిష్కరించలేక పోయాం. ధనరాజ్ మామయ్యకు ఏం సమాధానం చెప్పాలి ? నాగరాజ్ అన్నీ తెలుసుండి ప్రేమలో ఎందుకు పడాలి ? ధనరాజూ, తల్లీ, మామయ్య తన చదువు కిచ్చిన డబ్బు విషయం ఎత్తితే నాగరాజ్, తను మామయ్య అప్పు అణా పైసలతో తీర్చేస్తానంటాడుట. కానీ మామయ్య ఆశలూ, మామయ్య కూతురు నీరజ భవిష్యత్తూ ఏమవాలని అడిగితే, తను అందుకు ఏమీ చెయ్యలేనంటాడుట. ధనరాజ్ తమ్ముణ్ణి ఏమీ అనలేక పోయాడు. 'వాడికి అప్పుడు చిన్న తనం. పెళ్లి అంటే ఏమిటో తెలియక ఒప్పుకున్నాడనే' అతని వాదన. కాని 'ఒక స్త్రీ జీవితం అతనిపై ఆధారపడి ఉందనీ, ఇప్పుడామెను ఇతరు లెవరైనా వివాహం చేసుకోవడం కష్టమనీ,' మేమన్నాం. ధనరాజ్ నిజమే నన్నాడు, మామయ్యకి విషయం ఎలా చెప్పాలా ? అని బాధ పడుతున్నాడు. కుటుంబ బాధ్యత గలవానిగా, ఈ సమస్య పరిష్కారం కోసం బుర్ర బద్దలు కొట్టుకుంటున్నాడు, ఎంతో భయపడుతున్నాడు.

అతను భయపడ్డట్టే రెండు రోజుల తరువాత మెయిల్లోంచి వాళ్ల మామయ్య దిగాడు. ఆవాళ మేము రోజూలాగే మెయిలు టైముకి ప్లాటుఫారం మీద తిరుగుతున్నాం. ఇంతలో మా వెనకాల నుండి ఒక నడి వయస్సాయన వచ్చి ధనరాజ్ భుజం మీద చెయ్యేసాడు. ఆయనను చూసి ధనరాజ్ కొంచెం ఖంగారు పడి పలకరించాడు. ఆయనకు నలభై ఏళ్లుంటాయి. పొడుగ్గా సన్నగా, వుంటాడు. కొంచెం బొట్టుగా వుండే మనిషిలా కన్పించాడు. ధనరాజ్ ఏమన్నా ప్రశ్నా

శాన్ని పరిచయం చేసి నప్పుడు మా వైపు చూసి తలవూపి వూరుకున్నాడు. అతను చేతి సంచితో వచ్చాడు. మెయిల్ వెళ్ళి పోగానే ధనరాజ్ ఆయనను తీసుకుని ఇంటికి వెళ్ళి పోయాడు. నేనూ ప్రకాశం కాస్సేపు ప్లాటుఫారం మీద కూర్చుని బాతాఖానీ కొట్టాం. ఇంక ఏం జరుగుతుందా ? అని మాకూ చివరకు బుర్రలు పాడై ఇంటికి వెళ్ళి పోయాం.

ఆ మరునాడే ధనరాజ్ మామయ్య తిరిగి వెళ్ళిపోయాడు ఆయన నాగరాజ్ గురించి విని మండి పడ్డాడట. తను ముహూర్తము నిశ్చయించేసాననీ, నెల రోజుల లోపల పెళ్ళి జరుగాలనీ, పట్టు బట్టాడట. నాగరాజ్ తన కూతుర్ని వివాహమాడి తీరాలన్నాడట. అసలు ఆపిల్ల ఏనాడో నాగరాజ్ భార్య అయిపోయిందన్నాడట. అతని పట్టుదల చూసి, ధనరాజ్, అతని తల్లీ కూడా, అతనికి తోడ్పడ దల్చారు.

సుబ్బయ్యగారు, అంటే ధనరాజ్ మామయ్య విశాఖపట్నం వెళ్ళి నాగరాజ్‌తో మాట్లాడాడట. అతని ననేక విధాల బ్రతిమాలాడు. కాని నాగరాజ్ తన పట్టు వదలలేదు. మామయ్య కూతుర్ని పెళ్ళాడితే, తన జీవితం, ఆమె జీవితం కూడా నాశనమవుతుందనీ, అంతకన్నా తను చేస్తున్న పనే మంచిదని వాదించాడుట. ఆయన తను ఎన్ని చెప్పినా అతను వినకపోయే సరికి, అతని సహచరులందరితోనూ, జరిగిందంతా చెప్పి, వాళ్ళను నాగరాజ్‌కు చెప్పమన్నాడుట. వాళ్ళు కూడా ఆయన యందు సానుభూతితో అతనికి చెప్పి చూశారు. కాని నాగరాజ్ లొంగలేదు. ఆఖరికి నాగరాజ్ ప్రేమించిన సరళ అనే అమ్మాయికి కూడా ఈ విషయం తెలిసింది. సుబ్బయ్యగారు ఆమె వద్దకు కూడా వెళ్ళారట. ఆమె ఏమందో తెలియదు గాని, ఆఖరుకు నాగరాజ్‌ని, తన కూతుర్ని పెళ్ళి చేసుకోకపోతే కోర్టుకీడుస్తానని బెదరించి ఆయన తన వూరు వెళ్ళి పోయాడు.

వాళ్ళ వూరు వెళ్ళిపోయాక ఆయన ధనరాజ్ పేర నిష్ఠూరంగా చాలా ఉత్తరాలు వ్రాశాడు. నాగరాజ్ తనని చేసిన మోసం ఆయనను క్రుంగ దీసింది. కూతురి భవిష్యత్తు మీద ఆయన కట్టుకున్న ఆశా సౌధాలన్నీ కూలిపోయాయి. ఆ మనోవ్యాధితో ఆయన మంచం పడ్డాడు.

నాగరాజ్ వివాహం కూడా అనుకున్నంత సులభం కాలేదు. ఎందుకంటే అతను ప్రేమించిన సరళ, తమ వివాహానికి ముందు, నాగరాజ్ తన మామయ్య వద్ద తీసుకున్న డబ్బు పూర్తిగా తీర్చెయ్యాలని షరతు పెట్టిందట. నాగరాజ్‌కు ప్రయివేటు ప్రాక్టీసుపెట్టే స్తోమతు లేదు. కాబట్టి హౌసు సర్జనుగా ఏడాది అయిపోయాక, మెడికల్ కాలేజిలో డిమాన్‌స్ట్రేటరుగా ప్రవేశించాడు. మామయ్య కివ్వవలసిన పదివేలూ, జీతంలో తీర్చాలంటే ఎన్నేళ్ళు పడుతుందోనని విచారించేవాడు. అయినా అంతకన్నా గత్యంతరం లేదు. నాలుగైదు సంవత్సరాలలో తీర్చేసి, సరళను వివాహం చేసుకోవాలని అతని కోరిక.

మేము రోజూ సాయంకాలం మెయిలు చూసివచ్చి, కబుర్లు చెప్పుకుంటూ ఈ విషయం కూడా చర్చించే వాళ్ళం. వాళ్ళ మామయ్యగారి మనోవ్యాధి నానాటికి ముదరసాగింది. నాగరాజ్ ఎప్పుడు రాసినా, ఉత్తరంలో తను ఎంత ఇబ్బంది పడుతూ డబ్బు నిలవ వేస్తున్నాడో రాశేవాడు. ధనరాజ్‌కూ అతని తల్లికీ ఆ విషయం ఎంతో బాధకరంగా ఉండేది.

నాకు ఇంట్లో వత్తిడి ఎక్కువైంది. అమ్మ, ఎలాగైనా ఆ యేడాది నేను వివాహం చేసుకోవాలని పట్టుబట్టింది. ఎన్ని సంబంధాలు చూపినా, నా వూహాసుందరి నాకు కన్పించలేదు. వచ్చిన సంబంధాలలో ఆ రాజోలు వాళ్ళ సంబంధమే బాగనిపించసాగింది. చివరకు ఆ అమ్మాయిని చేసుకోవడానికి నా అంగీకారం తెల్పాను. కాని నా మనసులో, ఎప్పటికైనా నా వూహాసుందరి కన్పిస్తుందనీ, ఆమెతో ఆమె కోసం ఎన్నాళ్ళు ఎంతగా పరితపించానో చెప్పుకోవచ్చునని ఆశగా ఉండేది.

ధనరాజ్‌కు ఆ వూరి నుండి బదిలీ అయిపోయింది. అతనికి ఇందిరతో వివాహం చెయ్యడానికి మరొక సంవత్సరం వ్యవధి అడిగాడు డాక్టరు శివరాం. అందువల్ల అవివాహితుడిగానే ఆ వూరు వదిలి వెళ్ళిపోయాడు, ధనరాజ్. అతను వెళ్ళిపోయాక కొన్ని రోజులు నేనూ ప్రకాశం విధిగా మెయిలుకు వచ్చి, ప్లాటుఫారం మీద బాతాఖానీ కొట్టుతూండే వాళ్ళం. మరొక నెల రోజులకు ప్రకాశానికి మరొక వూరు బదిలీ అవడంతో అతను కూడా వెళ్ళిపోయాడు.

నేను ఒంటరిగా కూర్చుని, మెయిలు వెళ్ళి పోయాక ఆలోచిస్తూండే వాణ్ణి. ఆ ప్లాటుఫారం మీద అనేక రకాల దృశ్యాలు చూస్తూండేవాణ్ణి. బిచ్చగాళ్ళూ, లక్షాధికారులూ, దొంగలూ, ఖూనీ కోరులూ, పెద్ద మనుషులూ, వ్యభిచారులూ, సంసారులూ, త్రాగుబోతులూ, మంచివాళ్ళూ, టిక్కెట్టు లేనివాళ్ళూ, ఇంకా ఎన్నెన్నో రకరకాల మనుషులు కన్పిస్తూండేవారు. అందరివీ మానవ ఆకారాలే, కానీ వాళ్ళ మాటల్లో, మనసుల్లో, భావాల్లో, ప్రవర్తనలో, ఎన్నో తేడాలు. అందరూ ఏవో ఆశలనూ కోరికలనూ దృష్టిలో పెట్టుకుని జీవితం గడుపుతున్నవారే. ఆ ఆశలే వారి జీవితాన్ని నడిపిస్తున్నాయి. దూరంగా ఎక్కడికో చేరాలనే తాపత్రయంతో పరిగెత్తే రైలుబండి వంటి జీవితాలే, అందరివీ ! ఆ పరుగులోనే కాలం

గడిచి పోతుంది. బాల్యం మొదలు, వృద్ధాప్యం దాకా ఆ ఆరటం తోనే పయనిస్తారు. మధ్యమధ్య, మజిలీల లాగ ఏవో సంఘటనలు జరుగుతూంటాయి. రైలుబండి, స్టేషను ప్లాటుఫారం దగ్గర, కొద్ది క్షణాలు ఆగి, నీరూ, బొగ్గూ వేసుకుని బయలుదేరినట్లు, జీవిత మజిలీలలో కొద్దిక్షణాలు ఆగి, మళ్లీ, పయనిస్తూంటాడు, మానవుడు. కాల దూరాల మధ్య రైలుకు కొద్ది క్షణాలు విశ్రాంతి ఇచ్చే ప్లాటుఫారం లాటివి, జీవితంలోని మలుపులు, అని అనిపించేది.

ఆ వూళ్లో ఉంటూండంగానే నాకు వివాహమైంది. నేనూ అందరిలాగే సంసారం ప్రారంభించాను. పదేళ్లలో మాకు ముగ్గురు పిల్లలు పుట్టారు. రానురాను నా వూహాసుందరి నాకు దూరమైందే గాని కన్పించలేదు. డబ్బు చాలక పోవడం, స్కూలు గొడవలూ, ఇంట్లో పిల్లల చికాకులూ, క్రమంగా నా మనసు నాక్రమించుకోసాగాయి. నేను ఎప్పుడూ డబ్బు సంపాదన గురించే ఆలోచించేవాణ్ణి. జీవితంలో ఇంకా ఏదో మార్పు వస్తుందనీ, ఇంకా ఎక్కువ డబ్బు సంపాదిస్తాననీ ఆశించేవాణ్ణి. పలాసా వదిలి, మూడు వూళ్లు తిరిగాక ఈవూరు వచ్చాను, రెండు నెలల క్రిందట.

''ఏమోయ్, రామారావు ! ఇక్కడుంటున్నావేమిటి?'' అని పలకరించాడు, ధనరాజ్ రైలు కిటికీ లోంచి వంగి చూస్తూ.

''అవునోయ్. ఇప్పుడు నువ్వెక్కడ ?'' అని అడిగాను.

''రాజమండ్రీలో పని చేస్తున్నాను. ఏమిటి. విశేషాలు? ఒకసారి, రా ! మనం కలిసి చాలా కాలమైంది. వివాహమైందా?''

''అయింది. నీ సంగతి ?'' ఇంతలో రైలు కూసింది.

''ఆ నాకూ అయింది. ఈవిడే నా భార్య. నీకు చెప్తూండే వాణ్ణి కదూ, మా మామయ్య కూతురని.'' అన్నాడు ధనరాజ్. రైలు కదిలిపోతూంటే. ''మా నాగరాజ్ విశాఖపట్నంలో ఉన్నాడు. నువ్వు మా వూరురా ! అన్ని విషయాలూ మాట్లాడదాం'' అని అంటూంటే, రైలు నాకు దూరంగా వెళ్లిపోయింది

ధనరాజ్ చివరకు తన మామయ్య కూతుర్ని వివాహం చేసుకున్నందుకు నేను ఆశ్చర్యంతో కొద్దిసేపు ప్లాటుఫారం మీద అలా నిల్చుండి పోయాను.



# శ్రీ మిర్జాగాలిబు వ్యక్తిత్వము

శ్రీ సదాశివ

మిర్జాగాలిబును గురించి 'సమకాలికులూ' తరువాతి వారూ పలురకాల అభిప్రాయాల్ని ప్రకటించారు. కొందరు అతని ఫారసీ కవితను ప్రశంసించారు. మరికొందరు అతని ఉరుదూ కవిత ఉత్తమమైందన్నారు. అతని గజలు రచన విశిష్టమైందని కొందరన్నారు. అర్థరహితమైందని మరికొంద రన్నారు. అతడు ఆభిజాత్యాభిమానమూ, సాహిత్యాహంకారమూ కల వాడని కొందరు అభిప్రాయపడితే, అవి రెండూలేని వట్టి అవకాశవాది అని కొందరు నిశ్చయించారు. సూఫీ తత్త్వవేత్త అని కొందరు భావించారు. కేవలం త్రాగుబోతనీ భోగలాల సుడనీ కొందరు నిందించారు.

ఏమైనా పదుగురి నోటపడటానికి అతని ప్రఖ్యాతే కారణం. అతడు గొప్పవాడని అందరూ ఒప్పుకున్నారు.

అయితే, అతన్ని గురించి ఇలా పలురకాల అభిప్రాయాలు ప్రబలటానికి కారణాలేమిటి ?

గాలిబు తండ్రి తాతలు సల్జూఖీ రాజవంశానికి చెందిన తురుష్కులు. యుద్ధ విద్యలో నిపుణులు. సైన్యంలో చేరి జీవిక సంపాయించాలని భారతదేశానికి వలసవచ్చారు వారు. కొంతకాలం షాహఆలం చక్రవర్తిని, మరికొంతకాలం మహారాష్ట్రుల్ని ఆపైన అన్య సంస్థానాధిపతుల్ని, ఆంగ్లేయుల్ని ఆశ్రయించి తమ సేవకు ప్రతిఫలముగా ఒక జాగీరును పొంద గలిగారు. ఆ జాగీరు గాలిబు బాల్యంలోనే జప్తుచేయబడింది. దానిమీద రావలసిన పెన్షన్ కోసము దాయాదులంతా దావా వేశారు. కోర్టు మెట్లు ఎక్కుతూ దిగుతూనే తన యౌవన కాలం గడిపివేశాడు గాలిబు. కాని ఫలితం మాత్రం శూన్య మయింది.

అర్థ సంపన్నమూ, శిష్టాచార సంపన్నమూ అయిన జాగీర్దారీ వంశంలో జన్మించిన 'నవాబ్ మిర్జా అసదుల్లాబేగ్ ఖాన్ గాలిబ్' బుద్ధి తెలిసేనాటికి అర్థహీనుడు. అర్థంలేకున్నా ఆచారం అనుల్లంఘనీయం— ప్రాణాపాయం వాటిల్లినా వంశమర్యాద పాటించక తప్పదు. దీన్ని 'వజా—దారీ' అంటారు.

అర్థ సముపార్జనం చేయటానికి అనువైన మార్గాన్ని అన్వేషించలేక, వంశమర్యాద నిలుపుకోవటానికి ఆచార సంప్ర దాయాల్ని వదులుకోలేక, 'వజా—దారీ' కొరకు మిర్జా గాలిబు ఎన్నో కష్టాలు పడ్డాడు. ఎన్నో వేషాలు వేశాడు— అన్నిటిలో అతని అసలు రూపమేదో తెలిసికోవటం కష్టం.

ఎదుటి వాడికంటే తన వ్యక్తిత్వానికో ప్రత్యేక విశిష్టత ఉన్నదనుకోవటం, దాన్ని నిలుపుకోవటానికి ప్రయ త్నించటంకూడ జాగీర్దారీ వజాదారీ లక్షణమే. గాలిబులో ఈ లక్షణం అతిమాత్రం.1 అన్ని రంగాల్లో, అన్ని విషయాల్లో తనదే ప్రత్యేకత. మంచికీ, చెడుకూ, అధికతకూ, న్యూనతకూ; విజ్ఞతకూ, అజ్ఞతకూ, తనదే ప్రత్యేకత.

అందుకే అతన్ని గురించి పలురకాల అభిప్రాయాలు ప్రబలినవి.

బాల్యంలో తండ్రి తాతలవలె యుద్ధ విద్య నేర్చే అవకాశం అతనికి లభించలేదు— ఆ కాలంలో అలాంటి అవసరం కూడలేదు. కనుక జాగీర్దారుల పిల్లలకు సహజాలైన డాబు దర్పాల్లో, ఆటపాటల్లో, చదువు సంధ్యల్లో అతని బాల్యం గడిచింది. చదువు సంధ్యలైనా సక్రమంగా సాగలేదు. సమర్థు డైన గురువు దొరకలేదు—సరస్వతీ ప్రసన్నత కల ప్రతిభావంతు లకు గురువు నిమిత్తమాత్రుడు—సహజ ప్రతిభ వలన, స్వయం కృషి వలన గాలిబు ఫారసీ ఉర్దూల్లో పరిణితమైన పాండిత్యం గడించాడు. బాల్యం నుంచే కవిత చెప్పటం ప్రారంభించాడు. ఆనాటి ఉర్దూ కవులు మీర్‌నో నాసిఖ్‌నో అనుకరించేవారు. గంభీర భావాలు, సామాన్య భాష, సరళ శైలి, మీర్ ప్రత్యే కత. సామాన్య భావాలు, శబ్ద చమత్కృతి, అన్వయ కాఠిన్యము,

1. చూడు – "వయే-శార్-పురానే చిరాగ్." పాలి. అల్ అహమద్ సురూర్ రచన.

నాసిఖ్ ప్రత్యేకత. మీర్‌ను అనుకరించటం కష్టమని అందరి వలె తానూ అనుభవపూర్వకంగా గ్రహించాడు. ఫారసీలో బేదిల్ అనే కవి ఝుడితిస్ఫూర్తిగల శబ్ద సృష్టిచేసి కవితను అయోమయం చేయటంలో ప్రఖ్యాతుడు—నాసిఖ్ పద్ధతినీ, బేదిల్ పద్ధతినీ మేళవించి ఒక వింత శైలి కనుక్కున్నాడు గాలిబు— కనుక ఆదిలో అతని కవిత పాషాణపాకాన పడింది. అతని కవిత ముషాయిరాల్లో వినిపిస్తే ముగ్గురు నలుగురికి తప్ప అన్యులకు అర్థమయ్యేదికాదు. ''ఇదేమి కవిత ?'' అన్నారు ఆనాటి సాహిత్య సమీక్షకులు— ''మీ కవిత మీకే తెలియాలి. తప్పితే పైవాడికే తెలియాలి.'' అని పరిహసించారు.

గాలిబు మనస్సు చివుక్కుమన్నది.
''నసితాయిష్‌కి తమన్నా, నసిలేకీ పర్వా
గర్‌నహి హైఁ మెరె అషార్ మె మానే—నసహీ.''

'నాకు ప్రశంసల పట్టింపులేదు. ప్రతిఫలవాంఛలేదు. నా కవితకు అర్థంలేదేని లేకపోనీ'—అన్నాడు జవాబుగా.

అందరికీ అర్థంకాకుండ కవిత చెప్పటమే తన ప్రత్యేకత. (ఇప్పుడు లభ్యమయ్యే ''దీవానె—గాలిబ్''లో అర్థంకాని పద్యాలన్నీ తొలగించబడినవి. అతని మిత్రులు కొందరు అతని సమ్మతితో సంకలనం చేశారు.)

మీర్‌తఖి మీర్ తప్ప ఉర్దూ కవులెవరూ తనకు సరి రారని గాలిబు అభిప్రాయము. ఎవరైనా పోటీకి వస్తేమాత్రం ''కవిత చెప్పటం నా వృత్తికాదని,'' ''నేను యోద్ధల వంశానికి చెందిన వాణ్ణ''ని తప్పించుకునేవాడు. అయినా తన ఉర్దూ కవిత పట్ల అతనికి అభిమానంలేదు. తనకు తగినది పారసీ కవిత. సజాతీయమైన ఫారసీ భాష తనకు ఆజన్మ సిద్ధము. ఖాతిల్ మొదలైన సమకాలీన ఫారసీ కవులు భారతీయులు కనుక సజాతీయమైన భాష వారికి అలవడలేదని అతని ఆక్షేపము.

మరి తానుమాత్రం భారతీయుడు కాడా ? పారసీలోని జాతీయాలూ, పలుకుబళ్లూ అతనికెలా అలవడినవి ?

''పారసీ నా స్వభావానికి సరిపడిన భాష'' అని జవాబు చెప్పుకున్నాడు గాలిబు. కాని అది సమంజసముగా లేదు. ఇంకొక జవాబు సిద్ధం చేసుకున్నాడు.

'హర్మజ్' అనే ఫారసీక విద్వాంసుడు ఇస్లాం మతం పుచ్చుకొని, అబ్దుస్సమద్ అని పేరు మార్చుకొని దేశ పర్యటనచేస్తూ ఆగ్రాకు వచ్చాడుట, ఈరాన్ నుంచి. అతనికి భాషా రహస్యాలన్నీ బాగా తెలుసు— గాలిబు మూడు సంవత్సరాలు అతన్ని సేవించి అవన్నీ సేకరించుకున్నాడట.

దీన్ని ఖాజా అల్తాఫ్ హుస్సేన్ హాలీ2, మౌలానా మొహమ్మద్ హుసేన్ అజాద్3, మౌలానా అబుల్కలామ్ ఆజాదులు4 ఔనని ఆమోదించారు.

తన పారసీ వైదుష్యాన్ని శంకించే పండితుల వాగ్బంధన మైతే అయింది గాని ఈ అబ్దుస్సమద్ వలన తన ప్రత్యేకతకు భంగం వాటిల్లే సూచన లేర్పడినవి. కాబట్టి కొంతకాలమయాక ''నాకు గురువులేడు—అబ్దుస్సమద్ నా కల్పన'' అన్నాడు గాలిబు. ఈ రెండు మాటల్లో ఏది సత్యం ? అని సాహిత్య విమర్శకులు చాలాకాలం చర్చించుకున్నారు. అబ్దుస్సమద్ అస్తిత్వాన్ని ఆమోదించారు కొందరు— ''అది కేవలం కల్పన;'' అని ఖండించారు మరికొందరు. అలా ఖండించిన వారిలో గాలిబు అనుచరుడూ ఆప్తుడూ అయిన హకీమ్ గులామ్ రజాఖాన్ ముఖ్యుడు.5

అబ్దుస్సమదనే పేరుగల విద్వాంసుని ప్రసక్తి ఫారసీ సాహిత్య చరిత్రలో లేదు—అంతటివాడు ఆగ్రాలో అన్నేళ్లు నివసించాడుకదా, గాలిబు తప్ప అన్యులెవరు అతన్ని ఎరిగిన వారు లేరు. కనుక ఇది కవి కల్పనే కావచ్చు. కాని ఈ కల్పన గాలిబు స్వభావాన్ని పట్టి చూపగలది.

అతని ఫారసీ కవిత్వం నేడు ప్రచారంలో లేకున్నా ప్రామాణికమైందని పండితులందరు ఒప్పుకున్నారు.

అతని ఉర్దూ కవితకున్న ప్రచారం ఇంకే కవితకూ లేదు. వేదాల తర్వాత పవిత్రమూ ప్రామాణికమూ అయింది గాలిబు కవితే డా. అబ్దుర్రహమాన్ బిజనోరీ అభిప్రాయంలో.6

అతని కవిత శబ్ద చమత్కృతి తప్ప అర్థవంతంకాదు డా. అబ్దుల్లతీఫ్ దృష్టిలో.7

---

2. ''యాద్‌గారె— గాలిబ్.'' ఖాజాహాలీ రచన.
3. ''అబె—హయాత్.'' మొహమ్మద్ హుసేన్ అజాద్ రచన.
4. ''నామ—యె — గాలిబ్''. గులామ్ రసూల్ మెహర్ రచన.
5. ''సవానె— ఉమ్రీ— బేనజీర్''. అబ్దుల్గఫూర్ రచన.
6. ''మహాసినె— కలామె— గాలిబ్.'' డా. అబ్దుర్రహమాన్ బిజనూరీ రచన.
7. ''గాలిబ్'' (ఆంగ్ల గ్రంథం) డా. సయ్యద్ అబ్దుల్లతీఫ్ రచన.

# శ్రీ మిర్జాగాలిబు వ్యక్తిత్వము

అతని కవితలో ఆవేశం కంటె ఆలోచన అధికం— ఆవేశమే కవిత్వమనుకునేవారికి అతడు కవిగా కన్పించకపోవచ్చు. 8

"సంఘటన కఠినమైందే—అయినా జీవితం ప్రియతమమైంది. కనుక సహించుకోక తప్పదు." అనేవారికి ఆవేశమెక్కడిది ?

అర్థహీనుడూ, అధికారశూన్యుడూ అయిన బహదూర్‌షా జఫర్‌ను ఆశ్రయించి అనేక స్తోత్ర కావ్యాలు వ్రాశాడు గాలిబు.

రామపూర్ నవాబుకు ఆశ్రితుడై అతని ఆస్థానానికి రాకపోకలు సాగించాడు.

విక్టోరియా మహారాణి ప్రశంసలో ఎన్నో ఖసీదాలు వ్రాశాడు. ఆంగ్లప్రభుత్వపు ఉపాధిని పొందవలెనని ఆరాటపడ్డాడు. కలెక్టరు మొదలుకొని గవర్నరు జనరల్ వరకు గల ఆంగ్లేయాధికారుల్ని ఆశ్రయించి తిరిగాడు.

భరణం పెంచవలసిందని ప్రభువుల్ని బతిమాలుకున్నాడు. తిండికి లేదని దీనంగా దేబరించాడు—శిష్యుల ముందూ, మిత్రుల ముందూ సిగ్గువిడిచి చేయి సాపాడు.

విప్లవం తర్వాత, వృద్ధాప్యంలో, ఆదాయమార్గ మేదీ లేనప్పుడు, మిత్రుల బలవంతం మీద దిల్లీ ఉర్దూ కాలేజీలోని పారసీ ఆచార్యపదవికి అర్జీ పెట్టుకున్నాడు. 'ఇంటర్వ్యూ' కు పల్లకీలో వెళ్లి బయట పచార్లు చేస్తూ నిల్చున్నాడు. "అభ్యర్థి యెక్కడ ?" అని సెక్రటరీ తామ్సన్ అడిగితే, "తాము ఎదురుగా వెళ్లి స్వాగతమిస్తే తప్ప లోనికి రాడట !" అని విన్నవించాడు చప్రాసీ.

"జాగీర్దారుగా వస్తే స్వాగత ప్రసక్తి ఉన్నది, కాని అభ్యర్థిగా వచ్చినప్పుడు అదెలా కుదురుతుంది ?" అని నసిగాడు తామ్సన్.

"ప్రభుత్వోద్యోగమంటే ప్రతిష్ఠాకరమనుకున్నాను, కాని ఉన్న గౌరవం కాస్తా ఊడేటట్టయితే అదెందుకు ?" అని తిరిగి వెళ్లాడు గాలిబు.

గాలిబు బీదవాడే. తనకంటే బీదవాళ్లు కనిపించినప్పుడు మనస్సు కరిగి ఎదుటివాళ్ల మనస్సు నొవ్వని విధంగా ఒంటిమీది చొక్కా సైతం వూడ్చి ఇచ్చివేశేవాడు.

అతని ప్రవర్తనలో ఇలాటి వైరుధ్య మెందుకు ?

బహదూర్‌షా అర్థహీనుడైనా, అధికారశూన్యుడైనా తైమూరు వంశానికి చెందిన చక్రవర్తి. అతని ఆస్థాన కవిగా, ఆచార్యుడుగా ఉండటం గౌరవాస్పదమే గాలిబు దృష్టిలో.

రామపూర్ నవాబు అతనికి దిల్లీలో ఉంటే నెలకు వంద, రామపూర్ వెళ్లితే రెండు వందలు ఉపకారవేతనం యిచ్చేవాడు. ఆశ్రితుని వలె కాక, ఆచార్యునివలె, మిత్రునివలె ఆదరించేవాడు. కనుక అతన్ని ఆశ్రయించటంలో అవమానంలేదు. 9

పతనావస్థలో ఉన్న భారత ప్రభుత్వాలు పడిపోవలసినవే అన్న సంగతి గాలిబుకు ముందే తెలుసు. 10 ఏడు సముద్రాలు దాటి వచ్చి ఈ దేశాన్ని ఆక్రమించిన జాతి, దీన్ని అభ్యుదయ పథంలో పెట్టటానికి సమర్థమయిందని ఆశించాడు—అతనికి జాతీయ చైతన్యమూ, రాజకీయ పరిజ్ఞానమూ లేని మాట వాస్తవము. ఇవి అతనికే కాదు. ఆనాటి అనేకులకు లేవు—ఆ పరిస్థితులే అలాంటివి.

తన ఆర్థిక దారిద్ర్యాన్ని ప్రకటించటం, యాచించటం అతని దృష్టిలో అవమాన కారకాలు కావు. అర్థం అవసరాలు తీర్చడానికి పనికివచ్చేదే కాని వ్యక్తిత్వాల్ని ప్రభావితం చేయగలిగింది కాదని అతని అభిప్రాయం.

మనం వాంఛించినట్లు గడువనప్పుడు జీవితాన్ని ఎలాగోలాగ గడుపాల్సిందే. శిష్యుడు మున్షీ హరిగోపాల్ తఫ్తాకు ఇలా జాబు వ్రాశాడు.

"సికింద్రాబాదులో ఉన్నావు. ఇంకెక్కడికి వెళతావు ? బేంకులోని డబ్బు లేపుకున్నావు ? ఇంకెక్కణ్ణించి తింటావు ? అబ్బాయి ! నేను చెప్పే అవకాశం లేదు. నీవు వినే విషయమూ కాదు. ఆకాశం తిరుగుతూ ఉన్నది. (ఆకాశ భ్రమణంవలన మానవుల అదృష్టాలు మారుతాయని విశ్వాసం— ఆకాశం తిరుగుతూనే ఉన్నది. గ్రహాలు తిరుగుతున్నవి.) కావలసింది అవుతూ ఉంటుంది. మనకు చేతనయ్యేదైతే ఏమైనా చేయవచ్చు. చెప్పవలసిందైతే ఏదైనా చెప్పవచ్చు.

నన్ను చూడు—నేను స్వతంత్రుణ్ణి కాను—బంధితుణ్ణీ కాను—దుఃఖితుణ్ణీ కాను —నిరోగిని కాను—సంతుష్టుణ్ణీ కాను. అసంతుష్టుణ్ణీ కాను — మృతుణ్ణీ కాను — జీవితుణ్ణీ కాను— బతుకుతున్నాను. రోజూ రొట్టె తింటున్నాను—అప్పుడప్పుడు మద్యం తాగుతున్నాను—కాలం తీరినప్పుడు చచ్చిపోతాను."

అప్పుడప్పుడు మద్యం తాగుతున్నానన్నాడు కాని

8. చూ. "ఆజ్‌కల్" మాసపత్రిక. గాలిబ్ నంబర్. శ్రీ మసీవుజ్జమాగారి వ్యాసము. ఫిబ్రవరి 1958.

9. "అహవాలె—గాలిబ్". ముఖ్తారుద్దీన్ సంకలనము.

10. "రుఖ్కాతె—గాలిబ్." "ఉర్దూ—ఏ—మొఅల్లా." (గాలిబు లేఖలు).

ఎప్పుడూ త్రాగేవాడు. రమ్జాన్ నెలలో కూడ త్రాగేవాడు. పస్తులున్నా, అప్పులు చేసైనా మద్యం మాత్రం త్రాగేవాడు.

తన నెదుర్కొంటున్న విషమపరిస్థితుల్ని మరిచిపోవనికి త్రాగుతున్నా ననేవాడు.

''మై సే గరజ్ నిషాత్ హై కిస్ రూహ్ సి యాహ్ కో
ఇక్ గోన బే ఖుదీ ముఝే దిన్ రాత్ చాహి యే.''

'ఆనందం కోసం మద్యమెవడికి కావాలె. ఎల్లప్పుడూ తన్మయత నాశించి త్రాగుతున్నాను.''

ముసల్మానయివుండీ, సాటివారి అసహ్యభావానికి తిరస్కారంగా త్రాగుతూ ఉండటం తన ప్రత్యేకత.

''యెమసాయిలె—తన వ్వుఫ్, యె తెరా బయాన్ గాలిబ్
తురేం హమ్‌వలీ సమఝ్తే, జౌన బాద—ఖార్ హోతా.''

''గాలిబ్ ! నీ యీ సూఫీతత్వ వివరణ, యీ ప్రవచన వైఖరి వలన నీవు త్రాగుబోతువే కాకుంటే యోగిగా భావించే వారము.'' అని ఒకచోట చెప్పుకున్నాడు.

తనను తాను ముసల్మానని భావించలేదతడు.

''ఒకరోజు నమాజు చదివిన పాపానపోలేదు. ఒకపూట మద్యపానం మానలేదు. మరి ఆంగ్లప్రభుత్వం నన్ను ముసల్మానని ఎలా భావించింది ?'' అని ప్రశ్నించాడొకసారి పండిట్ మోతీలాల్‌ను. ఈ మోతీలాలు పంజాబు గవర్నమెంటు ( ాన్సిలేటర్.

గాలిబ్ మిత్రులూ, శిష్యులూ చాలా మంది హిందూవులు—అతనికి ఏ మతంమీద అభిమానంలేదు. దేనిమీదా ద్వేషం లేదు. అతనిది ''ఫ్రీమిషన్.'' (ఈ పేరుగల సంస్థ ఒకటి ఆ కాలంలో ఉండినది.)

''ఎవరి మనస్సు నొప్పించకునికియే అతని మతము'' ! అన్నాడు సయ్యద్ గౌసలీషా.

ఈ గౌసలీషా ఆనాటి ప్రఖ్యాత సూఫీయోగి. అతడు కొంత కాలం దిల్లీలో నివసించాడు. తానే మొదట గాలిబు ఇంటికి వెళ్లి పరిచయం చేసుకున్నాడు. ''తాము యోగులు— నేను త్రాగుబోతును—తమ సరస కూర్చుండ తగను.'' అని గాలిబు సంకోచించేవాడట. గాలిబు విద్వత్తనూ, వినయసంపదనూ, ఆధ్యాత్మిక జిజ్ఞాసనూ గౌసలీషా చాలా చాలా ప్రశంసించాడు.

ఇలా చూస్తూ పోతే గాలిబును ఏమనాలో తెలియదు. అతని ఆంతర ప్రకృతికి బాహ్య ప్రవర్తనకు పొత్తు కుదరదు—అతని వ్యక్తిత్వం గందరగోళమై పోయింది.

ఏమైనా అతడు మహాకవి—పదహారణాల మానవుడు.

''అన్నిపనులు సులభాలగుట కష్టం—మానవుడు మానవుడగుట కష్టమే.'' అన్నా డతడు ఒక కవితలో.**12** అతని దృష్టి మానవత మీద అవలగ్నము.

---

11. ''తజ్కిరా గౌసియా.'' షాహగుల్షన్ రచన.
12. చూ. గాలిబు గీతాలు. శ్రీ దాశరథి.



# నీవు - నేను

## "శ్రీ నిరాలా"*

తుంగహిమశైల కైలాస శృంగ మీవు,
పరమచంచల దివ్య నిర్ఝరిణి నేను;
ప్రవిమలమ్మగు మానసోచ్ఛ్వాస మీవు,
కలిత కమనీయ కామినీ కవిత నేను;
నీవు ప్రేమము
—మరియిక
నేను శాంతి.

ఘనసురాపాన మత్తాంధకార మీవు,
సంతతోన్మత్త బహుళ విభ్రాంతి నేను;
చండ దినకర కిరణ ప్రకాండ మీవు,
భాసురాంబుజ మృదుమందహాస మేను;
యుగయుగమ్ములుగన్న వియోగి నీవు,
వితత నిర్మల పూర్వసంస్మృతి నేను;
నీవు యోగము
—మరియిక
నేను సిద్ధి.

ప్రథిత నిశ్చల పరమ తపస్సు నీవు,
ఇద్ధ శుచి పూర్ణ సరళ సమృద్ధి నేను;
భవ్యమందార మృదు మనోభావ మీవు,
పటు మనోరంజకమైన భాష నేను;
తత మహానంద నారామ తరువు నీవు,
సతత శీతల సౌఖ్య ప్రశాఖ నేను;
నీవు ప్రాణము
—మరియిక
నేను తనువు.

---

* హిందీ మూలం : అనువాదం : పవికవిరాజా.

రమ్యమగు సచ్చిదానంద బ్రహ్మ మీవు,
మనసు కదిలించి భ్రమియించు మాయ నేను;
శ్రమ గమించెడు పథిక విశ్రాంతి వీవు,
అవ్యయంబైన మార్గాన, ఆశ నేను,
అమల దుస్తరమైన భవాబ్ది వీవు,
లఘుగతిని దాటగను నభిలాష నేను;
నీవు నభము
—మరిక
నేను నీలిరేఖ;

అమల శరదిందు సత్ప్రకాశ హాస మీవు,
రిమ్మ నడిరేయిలో మధురిమను నేను;
రామణీయక కుసుమ పరాగ మీవు,
మెల్లగ జరించు మలయ సమీర మేను;
స్వేచ్ఛ దిరుగాడు పురుషహరీంద్ర మీవు,
ఖిలము లేనట్టి ప్రణయ శృంఖలము నేను;
శంకరుడ వీవు
—మరియిక
శక్తి నేను.

ద్యుమణికులమణి రామచంద్రుడవు నీవు,
నమ్రగుణ భక్తిపూర్ణ జానకిని నేను;
పృథు రణోన్మాద తాండవ నృత్య మీవు,
అనుపమాంగనా నూపుర స్వనము నేను;
సార నాదాగమోంకార సార మీవు,
క్రమ రచనా విశిష్ట సత్కవిని నేను;
వ్యాప్త యశ మీవు
—మరియిక
ప్రాప్తి నేను.

సురుచి కుందేందు సరసీజశుభ్ర వీవు,
ప్రబల మాధుర్య నిర్మలవ్యాప్తి నేను;

# కాళిదాస భవభూతులు-2*

## -చరిత్ర చిత్రణము

శ్రీ జి. సూర్యనారాయణ

మహాభారతము నందలి దుష్యంతుఁడు కేవలమొక కాముకునిగ, మృషావాదిగ వర్ణింపఁబడెను. అతని యందు విశేషములైన నృపగుణము లెవ్వియును లేవు. సాధారణ ధరాధిపతి వలెనె మృగయాశీలుఁడు, యుద్ధకోవిదుఁడు, కష్ట సహిష్ణువు మాత్రమే! రఘువువలె దిగ్విజయమొనర్పలేదు. అర్జునునివలె ధనుర్విద్యా పారంగతుఁడై కౌరవసైన్యము నూచముట్టుగ నోడింపలేదు. భీష్మునివలె ప్రతిజ్ఞా పరిపాలకుఁడు గాడు. ధర్మజునివలె సచ్ఛీలుఁడుగాడు. కర్ణునివలె దానవీరుఁడుగాడు. వృకోదరుని వలె భీమ బలుఁడు గాడు. లక్ష్మణునివలె స్వార్థ త్యాగిగాడు. విదురునివలె తేజస్సంపన్నుఁడు గాడు. అతఁడొక సర్వసామాన్యుఁడగు పృథ్వీపతి.

కాని, కాళిదాసు తన నాటకమందీతని పెక్కు దోషముల నుండి సంరక్షించి యున్నత పథమునకు తీసికొని పోయెను. అయ్యు నాతని దోషరహితునిఁ జేయ జాలఁడయ్యెను. మృగయాశీలుఁడగు నాతఁడు సుదృఢ శరీరుఁడు.

> అనవరత ధనుర్జ్యాస్ఫాలన క్రూర, పూర్వం
> రవి కిరణ సహిష్ణుక్లేశలేశైరభిన్నం,
> అపచిత మపిగాత్రం వ్యాయతత్వాద లక్ష్యం,
> గిరిచర ఇవనాగః ప్రాణసారం బిభర్తి.

(ఎండ వేడిమి కోర్చుచు, నిరంతరము ధనుస్సు నెక్కు పెట్టుచు (ప్రాణి హింసారూపమగు) నిష్ఠుర కార్యమొనర్చు వాడగుటచే నతని యొడలిపై చెమట చినుకులుగూడ గ్రమ్మ లేదు. అతఁడు పర్వతమున సంచరించు నేనుగు వలె మహాసారయుక్తుఁడై బలిష్ఠుఁడుగ గనపట్టుచున్నాడు.)

దీనిని బట్టి ఇతఁడు నిరంతరము కామలోలుపతచే అంతఃపుర సంచారి యగు కేవల విలాస పురుషుఁడు గాడనియు శరీర శ్రమ నోర్వగల బలశాలి యనియు తెలుచున్నది. ఇది గుణము కానేరదు. ఈ కష్ట సహిష్ణుత చేతనే ఘనకార్యమును సాధించి యుండలేదు. ఈతుడు వేటాడినదియు శార్దూల భల్లూకాదులు గాదు. భయకంపనమున పలాయనము చిత్తగించు లేళ్లు. అదియును గాక మన్వాది శాస్త్రాచార్యులు వేటను వ్యసనము క్రింద జమకట్టిరి. కాని సేనాపతి యెట్లు ప్రశంసించెనో చూడుడు.

> మేదశ్ఛేద కృశోదరం లఘు భవత్యుత్థాన యోగ్యం వపుః
> సత్త్వానామపి లక్ష్యతే వికృతి మచ్చిత్తం భయ క్రోధయోః
> ఉత్కర్షస్సచ ధన్వినాం యదిషవస్సిధ్యంతి లక్ష్యే చలే
> మిథ్యైవ వ్యసనం వదంతి మృగయా మీదృగ్వినోదః కుతః ?

(వేటాడుట వలన క్రొవ్వు కరగి పొట్ట తగ్గును. కనుకనే ఒడలు చులకనగును. మనస్సు ఉత్సాహ పూరితమగును. భయక్రోధాదులచే జంతు హృదయమున నెట్టి చిత్తవికారము కల్గునో తెలియ నగును. చంచల లక్ష్య భేదమును నేర్చు ధనుర్ధరున కుత్కర్షహేతు వగును. అందుచే వేట వ్యసన

* మూలము : డి. ఎల్. రాయ్.

మొదటివ్యాసం "సెప్టెంబరు" భారతి.

మనుట వీసగదు. ఇట్టి వినోదము మరి వేనియందును గానము.) ఇది కేవలము యుక్తి చాతుర్యమే. ఇది గర్హించు వినోదము పరిగణనీయము కాదు. ప్రాణుల మనస్తత్వమును పరిశోధించిన తత్త్వవేత్తలందరును నిరంతర పరిశీలనముననే గనుగొనిరి గాని వేటాడి కాదు కదా! క్రొవ్వు కరగుటకును ఉదరము శోషించుటకును వేటయే యుండనక్కరలేదు. ఏ ఇతర వ్యాయామ క్రీడలనైన సాధింప దగును. ఆనందమునకు మార్గములు పెక్కు కలవు. యుక్తి చాతుర్యమును సేనాపతి ప్రదర్శింపకున్నను నాటక సౌందర్యమునకు శోభతగ్గదు.

రాక్షస బాధా నివారణార్థమై యాశ్రమమున నుండు ముని దుష్యంతుని కాహ్వానము వచ్చుట యథార్థమే? కాని అందుకే యాతడచ్చట నుండుట కంగీకరించె ననుట సత్యము కాదు. అతని యుద్దేశము వేరు. ''ఇప్పుడి యభ్యర్థనమున కనుకూలము''గా నున్నదన్న విదూషకుని వాక్యము వాస్తవము.

తదనంతరము రాజు మధ్యమధ్య ''భో భోస్తపస్వినః మాభైష్ట! మాభైష్ట! అయమహమాగత ఏవ'' (ఓ తాపసులారా! భయపడకుడు భయపడకుడు. ఇదిగో వచ్చుచున్నాను) తృతీయాంకము తుదనీరీతిగ హుంకరించుటయు సముచితముగనే యున్నది. కాని యాశౌర్యము శరత్కాల మేఘ గర్జనము వలె శుష్కము. ప్రదర్శనమున వీరత్వమే లేదు. సప్తమాంకమున మాత్ర మాతడు రాక్షస వధ గావించి స్వర్లోకము నుండి తిరుగు ముఖమైనట్లు చూచెదము. కాని యాతడు గావించిన ఈ క్రింది వర్ణన మాతనికి గౌరవ ప్రదముగా లేదు.

సఖ్యుస్తే సకిల శతక్రతోర జయ్య
స్తస్యత్వం రణశిరసి స్మృతో నిహన్తా
ఉచ్ఛేత్తుం ప్రభవతి యం న సప్తసప్తి
స్తన్నైశం తిమిర మపా కరోతి చన్ద్రః.

(ఇంద్రునిక జయ్యులగు ఆ రక్కసుల మృతి నీయుద్ధము చేత నగునని నిర్ణయమైనది. రాత్రి చీకటిని సూర్యుడు పోగొట్టజాలడు. చంద్రుడే దానికి సమర్థుడు) దేవేంద్రునకు రాక్షసులు, హిందువులకు గోమాతవలె అవధ్యులు గారు. ''ఇంద్రుని పరాక్రమము సూర్యునివంటిది. దుష్యంతుని పరాక్రమము చంద్రుని వంటిది''. ఈ స్వల్ప వాక్యము మాతని నోట రాక ఊహ్యమైనచో నెక్కువ తృప్తికరముగ నుండెడిది. తన సుధర్మా మధ్యము నందింద్రుడాతని గౌరవించుట యాతని సౌజన్యమునకు చిహ్నము మాత్రమే.

ధర్మ శాస్త్రాదులయెడను, విప్రులయెడ నాతనికి విశ్వాసము మెండు. కాని భరత వర్ష మందలి ప్రతి సామాన్య పురుషుని యందుండుటచే నిందు విశేషమైన యోగ్యత కన్పట్టదు. ఇతడు మహర్షి యాశ్రమమునకు వచ్చి రహస్యముగ శకుంతలను జూచుటచే, ఋషుల యెడ కృతఘ్నతను ప్రదర్శించి పావన ఋషి వాటికను గళుషిత మొనర్చెను. రాజ వంచిత యగు శకుంతలను క్షమించి, దుర్వాసుడు దుష్యంతుని శపించి యుండిన మేలయ్యెడిది.

దుష్యంతుడు తన సామ్రాజ్య పరిపాలనము నవశ్య మొనర్చెనే గాని తన సఖుడగు మాధవ్యుని 'సఖే! మాధవ్య! త్వమప్యం బాభిః పుత్ర ఇవగృహీతః (మిత్రుడా మాధవ్యా నీవును పుత్రునిగనే అమ్మగారిచే గ్రహింపబడితివి) అని యసంతుష్టికరమైన కార్యభార మాతనిపై మోపి పంపెను. తానో శకుంతలా ప్రణయ కలాపమునకు జనును. ఇట్లు ద్వితీయాంకమున దుష్యంతుని సత్యవాఙ్నియమము ప్రకటితమైనది. అతడు తన వయస్యునితో నిట్లనును.

క్వవయం క్వ పరోక్ష మన్మథో మృగశాబైస్సహ
మేధితో జనః,
పరిహాస విజల్పితం సఖే పరమార్థేన నగృహ్యతాం
వచః

(కళా వేత్తలమగు నాగరకులము మన మెక్కడ? కామావిర్భావము లేక మృగశాబకములతో పెంచబడిన వారెక్కడ? కనుక మిత్రమా! నీతో జెప్పిన దంతయు సత్యమును కొనకుము. కేవలము పరిహాసము) దీనిని బట్టి అప్పుడే రాజు తనలో రాణుల ఈర్ష్యా భర్జనములకు భయపడుచున్నట్లు స్పష్టము. కాళిదాసెన్ని మైపూతలు పూసి మఱుగు పరచ దలచినను మనస్సులోని కాలుష్యము దాగదు గదా! ఈ మానసికావస్థ నాతడు చూపక తప్పదు. ఏది అవశ్యం భావియో యది యతని లేఖినీ ముఖమున బహిర్గత మగును.

ప్రథమాంకమున రాజు తన స్వస్వరూపమును దెలుపకయే యనృత మాడుచున్నట్లు మనము చూచెదము. అతడు చోరునివలె దాగి యావద్వృత్తాంతమును వినెను. శేషించిన దాని నడిగి తెలిసికొనెను. ఇట్లు చేయుటలో నతని యుద్దేశ మేమి? ఏదేని ప్రయోజన మూహింపక జనులు వంచనకు దిగరు. శకుంతలా పరిశీలనమే ప్రయోజనము. తానును వో రాజని తెలిసినచో నామె మనసిచ్చి మాటాడ దనియు వివాహమునకు ముందు కొంత ప్రణయ చాతుర్యము ప్రదర్శింప వలెననియు నాతడు భావించి యుండును.

కాళిదాసుని దుష్యంతునిలో నాతని ధర్మభీరుత్వము ప్రధాన గుణముగా ద్యోతకమగును. ఇంత యేల? ప్రధాన

# కాళిదాస భవభూతులు

కళంక హేతువగు శకుంతలా ప్రత్యాఖ్యాన సమయమున గూడ ధర్మభియమే కారణముగా కాళిదాసు రూపించెను. శకుంతలా నిరాకరణమున పంచమాంకమున నిట్లనును.

> "భో భో స్తపస్వినః చింతయన్నపి నఖలు స్వీకరణ మత్ర భవత్యాః
>
> స్మరామి. తత్కథమిమా మభివ్యక్త సత్త్వలక్షణా మాత్మాన మక్షత్రియం మన్య మానః ప్రతి పత్స్యే".

(ఓ తాపసులారా ! ఆలోచించితిని. నేనీమె నెన్నడును పరిణయ మాడినట్లు జ్ఞప్తి లేదు. ఇక గర్భవతి యగు వీమెను గ్రహించి క్షత్రియ దూష్యమగు కార్యము నెట్లు చేయ గలను ?)

దీనిచే నాతని మహత్త్వ మతిశయించదు. ప్రతి యుత్తమ పురుషుని యాచరణ విధానము నిట్టిదియే. సుందర స్త్రీ దర్శన మాత్రమున నెవ్వఁడు తన యుద్రేకము నణంచుకొనలేని కామాతురడగునో వాడు మానవ పదవాచ్యుఁడు కానేరని పశుతుల్యుడు. కాళిదాసు రఘు వంశములోని రాజుల గూర్చి చెప్పుచు "మనః పరస్త్రీ విముఖ ప్రవృత్తిః". యని పరస్త్రీ విముఖత నుద్ఘాటించును. కనుక రాజైన దుష్యంతు డిట్లు గర్వించుటలో విశేషము కానరాదు. **Byron** యొక్క **Dinjuan** వంటి వారు లోకమున నరుదుగా నుందురు. ప్రతి నాగరకుఁడును అన్యకాంతను మాతగానే యెంచును. అట్లు కాకుండుట నింద్యము. అందుచే నిందు విశేషము లేదు.

ఇవిగాక కాళిదాసు దుష్యంతుని మఱికొన్ని సుగుణములచే యాతని శీలమును సురభీకృత మొనర్చెను. ఆతడొక ప్రతిజ్ఞాశాలియగు చిత్రకారుఁడు. షష్ఠాంకమున స్వహస్త లిఖిత శకుంతలా చిత్రమును జూపుచు ఉత్తమ చిత్ర లక్షణములఁ గూర్చి రాజు విదూషకునితో నిట్లనును.

> "అస్యాస్తుంగమివ స్తనద్వయ మిదం నిమ్నేవ నాభిః స్థితా
>
> దృశ్యంతే విషమోన్నతాశ్చ వలయో భిత్తౌ సమాయా మపి,
>
> అంగేచ ప్రతిభాతి మార్దవ మిదం స్నిగ్ధ ప్రభా వాచ్చిరం
>
> ప్రేమ్ణా మన్ముఖ మీషదీక్షిత ఇవస్మే రాచ వక్తీవ మాం॥

(చిత్ర ఫలకము సమతల మైనను వీమె స్తనద్వయ మున్నతముగను నాభి గంభీరముగను, వళులు నిమ్నోన్నతములుగను గనుపట్టుచున్నవి. తైల వర్ణ ప్రభావమున శరీర మార్దవము స్థిరముగా భాసించుచున్నది. అనురాగవశమున నా ముఖమించుక చూచుచు హాసన్ముఖియై నాతో నేమియో భాషించుచున్నట్లున్నది. తన మాయచే సదృశ్యయై అచ్చట నున్న మిశ్రమకేశికి శకుంతలా రూపచిత్రము శకుంతల యను భ్రమనుగల్గించెను. ఆ చిత్రమును జూచు రాజే భ్రమోన్మత్తుఁడాయెను. శకుంతలా ముఖ కమలము నభిలషించిన భ్రమరమును జూచి ఇట్లనును.

> "అయిభోః కుసుమలతా ప్రియాతిథే! కిమత్ర పరి పతన ఖేద మనుభవసి".
>
> ఏషా కుసుమనిషణ్ణా తృషితాపి సతీ భవంతమనురక్తా,
>
> ప్రతిపాలయతి మధుకరీ నఖలు మధుత్వాం వినా పిబతి."

(ఓ కుసుమ ప్రియాతిథీ ! ఇచ్చట పతన క్లేశ మేల యనుభవించుచుంటివి ? ఇందు ప్రాలియున్న మధుకరి దప్పిక కలదయ్యు నీ యందలి యనురాగముచే నీవు లేక మధుపానము చేయదు.) అంతకును తుమ్మెదలేచి పోకుండుటకు రాజు క్రుద్ధుడగుచు నిట్లనును.

> "భోనమే శాసన్ తిష్ఠసి శ్రూయతాం తర్హి సంప్రతిహి
>
> అక్లిష్ట బాల తరు పల్లవ లోభనీయం
>
> పీతం మయాసదయ మేవరతోత్సవేషు'
>
> బింబాధరం దశసిచ్ ద్రమర ప్రియాయాః"
>
> త్వాంకార యామి కమలోదర బంధనస్థం"

(ఓసి నీవు నా యాజ్ఞను మన్నింపకున్నచో వినుము. ఓ భ్రమరమా ! కెంజిగురాకు వలె లోభనీయమగు నా ప్రియురాలి కెమ్మోవిని స్మరకేళీ సమయమున నేను భద్రముగ గ్రోలితిని. మఱి నీవు దానిని గొఱికినచో నిన్ను కమలకోశమున బంధించెదను.)

విదూషకుఁడు రాజునకు చిత్తభ్రమ గలిగినదని భావించి "భో చిత్తం ఖిపదం" (రాజా ! ఇది చిత్తరువు సుమా) యనును. అంత రాజు విగతమోహుఁడై "కథం చిత్రం" (ఏమి ఇది చిత్రమా ?) యనును. ఇట్టి భ్రమను గల్గించు చిత్రమును రచించువాడు సామాన్యుఁడు గానేరడు.

పంచమాంకమున రాజు యొక్క మఱియొక సుగుణము ప్రస్ఫుటమగుచున్నది. శకుంతలను విడచి రాజు నగరమున్ జేరి యామెను విస్మరించును. రాజసభలో నున్నపుడు నేపథ్య గానమును విని యాలోచించును.

> "రమ్యాణి వీక్ష్య మధురాంశ్చ నిశమ్య శబ్దాన్
>
> పర్యుత్సుకో భవతి యత్సుఖితోపి జంతుః

తచ్చేతసా స్మరతి నూన మబోధ పూర్వం
భావస్థిరాణి జననాంతర సౌహృదాని.''

(ఈ ప్రాణికోటి సుఖవంత మయ్యును రమ్యవస్తు దర్శనమునను మధుర శబ్ద శ్రవణమున నుత్కంఠిత మగుచున్నది. ఆ జీవనము లన్నియు తమ హృదయములందు పూర్వ జన్మ స్థిరత్వము నొంది నేడు విస్మృతమైన సుహృద్భావమును స్మరించుచున్నవని నా భావన.) రాజునకే విషయమో స్మృతి పథమునకు వచ్చినట్లుండును. కాని జ్ఞప్తికి రాదు. అగాధమైన సుఖ దుఃఖములను బొందుచుండును. అట్లేల యనుభవించుచున్నాడో ఈతనికి తెలియదు. ఈ శ్లోకమున శకుంతలను గూర్చి యాతనికి గల యాతని సమధిక ప్రీతియు గాంధర్వ తత్త్వ జ్ఞానమును సమ్మిశ్రములై కన్పట్టును. ఈ ప్రణయ నైర్మల్యము దుర్వాసుని శాపమును గూడ నధిగమించును. గాంధర్వతత్త్వము కవిత్వతత్త్వము నధిగమించును. సుఖదుఃఖములు, వియోగసంయోగములు, స్థైర్యోద్రేకములు ఇచ్చట సమ్మిశ్రమములైనవి. ఉత్తుంగ తరంగ కల్లోలినియైన నీల సాగరముపై ప్రాతర్భాను మరీచి వలెను, నీలాభ్రము పైని చంద్రద్యుతి వలెను, శారద జ్యోత్స్నపై బడిన వనలక్ష్మి ఛాయవలెను నా సమ్మేళనము మనోజ్ఞముగా నున్నది. **Shakespeare** ఒకచోట.

**If music be the food of love, play on**
**Give me excess of if, That surfeiting**
**The appetite may sicken and so die**
**That strain again, It had a dying fall.**
**O if comes per my ear like the sweet south**
**That breathes upon a bank or violets**
**Stealing and giving odour.**

ఇంత సుందరమయ్యు నిది పై శ్లోకము ముందు తీసి కట్టే! ఇందు కవితా విజ్ఞానముల కలయిక లేదు. పూర్వాపరజన్మ సంయోగము లేదు. అప్సరోనృత్యము, మర్త్యవేదన, ప్రభాత సాయంతనపుటాశానిరాశలు, మాతృ రోదనము శిశు హాసము లిందు లేవు. అందుచే పై శ్లోక ముత్తమోత్తమము.

షష్ఠాంకమునే దుష్యంతుని రాజ్యశాసన పద్ధతి మన కవగత మగును. ఆతఁడు స్వయముగ రాజ కార్యముల దిద్దుకొనును. ఇది యాతని సద్గుణము.

నగర పాలకుని శ్యాలకుఁడును, రక్షక భటులును చోరుడని ఒక ధీవరుని బంధింతురు. రాజముద్రిక తనకు మత్స్య గర్భమున లభించిన దనగ నగర పాలక శ్యాలకుఁడు దానిని వాసనమూచి ''అవును. ఇది చేపకంపు గొట్టుచున్నదని'' చెప్పి రాజుకడకు గొంపోదురు. ఈ లోపున నతనిని హింసింప వారికి చేతులు దురదపెట్టును. (ఈ రోగము వారికి చాల కాలము నుండి యున్నట్లు తోచును.) స్యాలకుఁడు ప్రవేశించి ''నిగతం ఏదం'' యన్నమాట వినుటతోడనే ధీవరుఁడు ''హా హతోస్మి'' యనుకొనును. రాజు పారితోషిక మొసగి వానిని విడువుడని చెప్పగా ''యమ గృహము నుండి తిరిగి వచ్చినాడని'' చెప్పి వానిని విడతురే గాని శూలదండ విముక్తుడగు వానిని జూచి వారు కటకట పడెదరు. తన పారితోషికములో సగభాగము వారి మధ్యపానమునకై యొసగుటచే వారికి మైత్రి గల్గెను.

రక్షకభటుల మనఃప్రవృత్తి నాటికిని నేటికిని ఒక్కటియె! అపరాధుల దండతాడన కండూతి నేటివలె నాడును కలదు. నీచుని చేతిలోని శక్తి, బాలుని చేతిలోని కత్తి, దుర్మార్గుని భుజశక్తి ఒకే మన్ఫురితము నిచ్చును! రక్షకభటుల చేతులు కొట్టుటకే కాదు. లంచములు పుచ్చుకొనుటకును దురద పెట్టెడివి. మానవుల మనస్తత్త్వ మిట్టిది. దుర్దాంతులును పశుతుల్యులగువారును దుష్యంతుని రాజ్యమున రాజాజ్ఞను భావించిరే గాని నిర్లక్ష్యముగ ద్రోసిపుచ్చ సాహసింపరైరి. అప్రియమయ్యును రాజశాసన మంత దృఢమును కఠోరమునై యుండెను.

ఇతఁడు రాణికి వెఱచును. శకుంతలా చిత్రము చూచుచుండగా రాణి వచ్చును. అతఁడు చిత్తరువును మఱుగు పరచును. రాణికి వెరచియె శకుంతలా వృత్తాంత మసత్యమని విదూషకునితో బొంకును. అతఁడు విరహార్తుఁడై యవివేకగా శకుంతల పేరెత్తును. కాని వెంటనే లజ్జితుడగును. లోకము దీనిని గుణమనునో దోషమనునో! ఒకప్పుడిది గుణదోష సమ్మిశ్రితము గావచ్చును.

ఇతని సంగీత చిత్రకళాభిజ్ఞత యాతని సర్వగుణ సంపన్నతకు పోషకముగాదు. ఇతనిలో విశేషగుణ సంపద లేదు. భారత దుష్యంతుని కంటె తన దుష్యంతు నున్నతునిగా చిత్రించుటకు కాళిదాసు ప్రయత్నించిన మాట వాస్తవమే. కాని యాతని చరిత్ర మాదర్శవంతముగా జేయ ప్రయత్నింపలేదు. ఒకవేళ ప్రయత్నించినను కృతకృత్యుఁడు కాలేదు. దుష్యంతుని వంటి యతిథినే గృహస్థుడు కోరడు. ఏ దేశపు ప్రజలును అట్టివాని రాజుగా వాంఛింపరు. అట్టి పతిని బడయగోరియే సాధ్వియు పార్వతీపతిని ప్రార్థింపదు. అట్టి రాజు కొఱకై యే దేశమును పూజ లొనర్పదు.

ఇట్టి దుష్యంతుడే యీ జగత్ప్రసిద్ధ నాటక నాయకుడు. అయిన నేమి ? విశేష మేమియు లేకున్న నాటకమెట్లు జగత్ప్రసిద్ధ మయ్యెనని పాఠకులకు శంక కలుగ వచ్చును. అట్టి సర్వ సామాన్యమైన చరిత్రకు కాళిదాసెట్లు మెఱుగులుపెట్టి జగన్మోహనముగ తీర్చిదిద్దినో మందు చూడ గలరు.

ఈ నాటకమున మూడు విభాగము లున్నవి. మొదటి మూడంకములును కలిసి ప్రేమ సందర్శనము. చతుర్థ పంచ మాంకములును వియోగము. శేషించిన రెండంకములును సంయోగము. ఇట్లే క్రమముగ విభాగత్రయములో దుష్యంతుని పతనము, ఉత్థాన ప్రయత్నము, ఉత్థానము ప్రదర్శితములు.

ఈ పతనోత్థానములందే దుష్యంతుని మహత్త్వమున్నది. మృగయావినోదమున శ్రాంతి జెందిన దుష్యంతుడు కణ్వాశ్రమము జేరి శకుంతలను జూచుటచే బూర్తిగా పతన మయ్యెను. రహస్య ప్రదేశమునుండి శకుంతలను జూచుట, తన గోత్ర నామాదికము గుప్తపరచుట, ఒక స్త్రీని దర్శన మాత్రముననే యుపభోగ్య గావించుట, మాతాజ్ఞా పరిపాలన మొకరి కప్పజెప్పుట మొదలగు నత్యాచారము లెన్నింటినో గావించెను. ఇన్ని గర్హితములలో గాంధర్వ వివాహ మొక్కటియే సుకృతి. ఇదియే యాతని నరకమునుండి కాపాడినది తిరిగి యాతని యున్నతికి సహకరించినదియు.

రాజధానికి వెళ్లి శకుంతలను విస్మరించుటలో నాతని పతనము పూర్తియైనది. ఆ విస్మృతి సాగరమున నాతడు మునుగుచు తేలుచు యాతననుభవించును. నేపథ్య సంగీత శ్రవణ మాతని యుత్కంఠుని జేయును. కాని వెంటనే యీ వర్తమానమున నా యతీత స్మృతి లుప్తమగును. మునులు సభలో నెదుట నిలిచి శకుంతలను జూపి యీమె నీ పాణిగృహీతయని జెప్పినను ఆతనికి సందేహ నివారణముకాక, "క్విమత్ర భవతీ మయా పరిణీతపూర్వా ?" (ఈమెను నేను పరిణయ మాడితినా ?) యని శంకితు డగునేకాని స్మరణకు రాడు. కాని యామె నాతిస్ఫుట శరీరలావణ్యమును గాంచి లుబ్ధుడగును.

వెంటనే "భవత్వ నిర్వర్ణ్యం ఖలు పరకళత్రం' (అన్య కాంత దర్శింపరానిదిగదా) యని జ్ఞానోదయ మగును. అవకుంఠన నిర్ముక్తమగు శకుంతలాముఖమండలావలోకనమున నిట్లనుకొనును.

> "ఇదము పనత మేవం రూపమ క్లిష్టకాంతి
> ప్రథమ పరిగృహీతం స్యాన్నవేత్య ధ్యవస్యన్
> భ్రమర ఇవ విశాంతే కుంద మంతస్తుషారం
> నఖలు సపది భోక్తుం నాపి శక్నోమిమోక్తుమ్."

(స్వయముగ వచ్చినదియు, నిర్మలకాంతి గలదియు నగు నీ మనోహర రూపమును నే నెన్నడేని పరిగ్రహించి యుంటినో లేదో యని ప్రభాత సమయమున తుషారముతో నిండియున్న మల్లెపూవును భ్రమరమువలె నే నీమెను భోగించుటకును, త్యజించుటకును నోపకుంటిని.)

ఇట్లు చిత్తక్షోభము జెందియు రాజు ధర్మమార్గము నేమాత్రమును వీడడు. శకుంతల 'ఓ పౌరవా ! నీవు ఆశ్రమమున తొలుత నీ ప్రణయ ప్రకటనచే నా మనస్సును గ్రహించి యిప్పు డిట్లు సభలో నిష్ఠురముగ ప్రత్యాఖ్యానము చేయుటుచితమా యన్నప్పుడు రాజు చెవులు మూసికొని "శాంతం ! శాంతం! వ్యపదేశమావిలయితుం కిమీహసే జనమిమంచ పాతయితుం. కూలంకషేవ సింధుః ప్రసన్నమంభః తట తరుంచ" (చాలు చాలు ఒడ్డుల నొఱసి పారునది నిర్మల జలమును కలుషితము జేయుచు తీర వృక్షముల సైతము పడద్రోయునట్లు నీవును నా కులప్రతిష్ఠను బాడుచేయుచు నన్ను పతితుని జేయజూచుచున్నావా ?

తరువాత శకుంతల అభిజ్ఞానాంగుళీయకమును జూప గోరునపుడు రాజు లేవబోవుచు ప్రథమః కల్పః (చాల సమ్మకము) అనును. కాని శకుంతల ఉంగరమును జూపజాలనపుడు రాజు "ఇత్థంతా వత్ప్రత్యుత్పన్నమతిత్వం స్త్రీణాం" (స్త్రీల ప్రత్యుత్పన్నమతిత్వ మిట్లే యుండును) అని యనును. తర్వాత అతని అవిశ్వాసము మఱికొంత దృఢతరమై తుదకాతడు స్త్రీలోకమునే వ్యంగ్యోక్తిచే నిందించునంతటి యధఃపతితుడగును. తదనంతరము శకుంతల దుష్యంతుని తీవ్రముగ భర్త్సించును. విభ్రమశూన్యమును, రోషకషాయితము నగు శకుంతలా ముఖమును జూచిన రాజునకు వలుల సందేహము గల్గును.

> "న తిర్యగవలోకితం భవతి చక్షురాలోహితం
> వచో తి పరుషాక్షరం నచ పదేషు సంగచ్ఛతే
> హిమార్త ఇవవేపతే సకల ఏవ బింబాధరః
> ప్రకామ వినతే భ్రువౌ యుగపదేవ భేదంగతే."

(ఈమె క్రీగంట జూచుటలేదు. నేత్రములు రక్తరంజితము లైనవి. పలుకులు పరుషములుగ నున్నవి. మఱియు నావంటి లక్ష్యమున కనుపయుక్తములు. ఈమె బింబాధరము హిమపీడితము వలె నదరుచున్నది. క్రమముచే కనుబొమలు నిగిడి యున్నవి.)

అపిచ సందిగ్ధ బుద్ధిం మామధికృత్య అకైతవమివాస్యాః కోపః సంభావ్యతే. తథాహ్యనయా

మయ్యేవ విస్మరణ దారుణ చిత్తవృత్తౌ
వృత్తం రహః ప్రణయమ ప్రతిపద్యమానే
భేదాద్భ్రువోః కుటిలయోరతి లోహితాక్ష్యాః
భగ్నం శరాసన మివాతి రుషా స్మరస్య.

(మఱియు మఱపుచే కఠిన చిత్తుఁడనగు నేను ప్రణయ వృత్తాంతమును జూడ రోషకషాయితనేత్రములు గల యీమె కుటిల భ్రూభంగము క్రోధముచే భగ్నము గావింపబడిన పుష్ప శరుని శరాసనమువలె నున్నది.) తరువాత దుష్యంతుఁడు తిరిగి విస్మృతి సాగరమున బడును.

ఈ అంకమున దుష్యంతుఁడు కాముకుఁడును, ధృష్టవాదియు నయ్యును నాతనిలో మానుషత్వము మాత్రము పుష్కలముగనున్నట్లు కన్పట్టును. ఎట్టయెదుట అసమాన యౌవన లావణ్యవతి నయభయాదులచే పతిభిక్షను వేడుచున్నది. ఆ సౌందర్యమును జూచియే దుష్యంతుఁడు పూర్వ మొకసారి "దూరీకృతా ఉద్యానలతా వనలతాభిః" అని ప్రశంసించెను. అంతే కాదు, "మానుషీషు కథం వాస్యాదస్య రూపస్య సంభవః" అని యూహాపోగానము జేసెను. ఆ రూపమునకు ముగ్ధుడై ముని శాపమునకు వెరువక అతిథి మర్యాదాభంజకమైన అకార్య కాముక చర్య గావించెను. అట్టి రూప మింకను చెక్కుచెదరలేదు. ఆ లావణ్య మట్లే భాసించుచున్నది. ఆ లావణ్యవతియే నేడు వచ్చి నేను నీ యర్ధాంగిని గ్రహింపుమని కోరుచున్నది. కాని రెండవ దిక్కున ధర్మభయము బాధించుచున్నది. ఋషులును వృద్ధతాపసియు నెదుట నిల్చి పరిగ్రహింపుమని ప్రాధేయ పడుచున్నారు. బ్రహ్మక్రోధమును అధర్మమును నిన్ను నశింప జేయునని బెదిరించుచున్నారు. రాజునకు సందిగ్ధావస్థ. ఇటు వైపు లోకాతీత సౌందర్యముతో నాకర్షించు యువతి, ఋషి క్రోధము—అటు ధర్మభయము.

రాజు మహాతరంగమందలి యీతగానివలె మునిగి పోవుచు పైకి లేచుటకు ప్రయత్నించియు సఫలీకృతుఁడు కాలేదు. ఏలయన విధి బలవత్తరముగుట నాతడు దైవబల మున నుచ్చన్నుఁడగును. బంధింపబడిన కేసరి సముద్యత్క్రోధ ముతో బోనును పటాపంచ లొనర్ప తీవ్ర ప్రయత్నమొన ర్చును. కాని యజమాని కసరులకు తలయొగ్గును. అట్లే దుష్యంతుఁడును మంత్రముగ్ధమగు మహానాగమువలె బుస కొట్టుచుండునే గాని యా హిమావరణమునుండి బయల్పడలేని దైన్యావస్థలో నుండును. ఇట్టి దృశ్యమున నొక మోహము సౌందర్యము నుల్లాసము మనకు ద్యోతకమై యాతడు నిజ మున కొక మానవు డనిపించును.

ఈ పంచమాంకమున నొక యద్భుత సన్నివేశము దిల కించెదము. అంతర్యుద్ధ మొకటి తీవ్రతరముగ సాగును. ఒక పక్షమున బ్రహ్మతేజము ఋషి శిష్యుల రూపమున రాజు ననేకవిధముల భర్త్స్యంచుచుండును. అటు క్షత్రియతేజము క్రోధమును ప్రదర్శింపకున్నను ప్రతిజ్ఞాపాలనమునకు వెను దీయదు. అతడు బ్రాహ్మణశాపమునకు సైతము శిరసావ హింప సంసిద్ధుఁడగును. ఇది యొక యపూర్వ దృశ్యము.

శాకుంతల నాటకమందలి పంచమాంకము సర్వ ప్రపంచ నాటక సాహిత్యమునందపూర్వము, నద్భుతము, అద్వితీయము నని భావించెదను. గ్రీకు, ఫ్రెంచి, ఇంగ్లీషు భాషలలో నే నిట్టి నాటకమును జదువలేదు! ఇట్టి దృశ్యమును జూడలేదు!

షష్ఠాంకమున రాజునకు శకుంతలా పరిణయ వృత్తాంతము జ్ఞప్తికి వచ్చును. వసంతోత్సవ వేళయందును రాజ ప్రసాదము శోభావిహీనముగనే యుండును. పరిచారిక లిరువురు మదనపూజకై చూతముకుళముల గోయుచుండ వసంతోత్స వము లెచ్చటను చేయరాదని రాజశాసనము! కనుక కంచుకి వారిని నిషేధించును. దుష్యంతుని మానసికావస్థను కంచుకి యిట్లు వర్ణించును.

రమ్యం ద్వేష్టి యథా పురాప్రకృతిభిర్న ప్రత్యహం సేవ్యతే
శయ్యోపాంత వివర్త నైర్విగమయ త్యున్నిద్ర ఏవ క్షపాః,
దాక్షిణ్యేన దదాతి వాచము చితామంతః పురేభ్యో యదా
గోత్రేషు స్ఖలితస్తదా భవతి చ వ్రీడా వినమ్రశ్చిరమ్.

(ఇప్పుడు రాజు రమ్యములగువాని యన్నింటిపై ద్వేషము వహించుచున్నాడు. యథాపూర్వముగ అమాత్యాదుల సేవ లందుటలేదు. నిశల దుశయ్యపై నటునిటు దొర్లుచు జాగరము చేయుచున్నాడు. తన దేవేరుల కుచితమగు ప్రత్యుత్తర మీయ బోయి శకుంతలా నామగ్రహణముచే లజ్జావినమ్రుఁడగు చున్నాడు.)

అనంతరము తాపస వేషధారియగు దుష్యంతుఁడు విదూ షక ప్రతీహారులు వెంట రా ప్రవేశించును. అతని రూపమును కంచుకి యిట్లు వర్ణించును.

"ప్రత్యాదిష్ట విశేష మండన విధిర్వామ ప్రకోష్ఠే శ్లథం
బిభ్రత్కాంచన మేకమేవ వలయంశ్వాసోప రక్తాధరః
చింతా జాగరణ ప్రతామ్ర నయనస్తే జోగుణైరాత్మనః
సంస్కారోల్లిఖితో మహామణి రివక్షీణోఽపినా లక్ష్యతే.

(రాజు విశేషముగా శృంగార వ్యాపారమును విడిచెను. ఎడమచేతియం దొక్క కంకణమును మాత్రము ధరించెను. నిట్టూర్పులచే క్రింది పెదవి యెఱుపెక్కినది. నిరంతర చింతా జాగరణముచే కన్నులును జ్యోతులైనవి. ఈయన క్షీణించియు సానలదీరిన జాతి రత్నమువలె తేజో విశేషముచే క్షీణించిన ట్లగపడుటలేదు.) రాజు ప్రతీహారితో నిట్లనును.

''వేత్రవతి ! మద్వచనాద మాత్య పిశునం బ్రూహి అద్యచిర ప్రబోధాన్న సంభావిత మస్మాభిర్ధర్మాసన మధ్యాసితుం యత్ప్రత్య వేక్షితమార్యేణ పౌరకార్యం తత్పత్ర మారోప్య ప్రస్థాప్యతామితి''. (వేత్రవతా ! రాత్రి యమితముగా మేలుకొనుటచే నేను ధర్మాసనమునకు రాజాలననియు తానే రాచకార్య నిర్వహణ మొనర్చి తీర్పులను పత్రములపై వ్రాసి నా వద్దకు పంపవలసినదిగా అమాత్యునితో జెప్పుము.)

రాజకార్యములందు రాజప్రమత్తుడు. రాత్రి జాగరణమున ధర్మాసనమున గూర్చుండుటకు శక్యుడుగాకున్నను విశేష కార్యము లున్నచో తానే చూచును.

తరువాత ప్రియవయస్యుడగు విదూషకునితో రాజు తన హృదయమును విప్పి చెప్పును. విదూషకు డాతని ననునయించును. రాజంగుళీయకముతో నాతని తట్టుచు

అయే ఇదం తద సులభస్థాన భ్రంశే శోచనీయమ్.

''కథం నుతం కోమల బంధురాంగులిం
కరం విహాయాసి నిమగ్నమంభసి
అచేతనం నామగుణం న లక్షయే
మయ్యైవ కస్మాదవ ధీరితా ప్రియా.''

(దుర్లభ స్థానమునుండి తొలగి యీ యుంగుళీయకము శోచ్యస్థితి నందినది. ఓ యుంగుళీయకమా ! కోమలములు సుందరములు నగు నా వ్రేళ్ళు గల చేతిని విడచి నీవు నీటిలో నేల బడితివి ? దానికేమి ? అచేతన మగునది గుణమును పరికింప జాలకపోయెను. చేతనుడనగు నే నేల ప్రియురాలిని త్యజించితిని ?)

తిరిగి శకుంతల నుద్దేశించి రాజు :

''ప్రియే ! అకారణ పరిత్యాగాదనుశయ దగ్ధ హృదయ స్తావ దను కంప్యతామయంజనః పునర్దర్శనేన.''

(ప్రియా ! నిష్కారణముగ నిన్ను త్యజించితినను పశ్చాత్తాపాగ్నికి దగ్ధహృదయుడనగు నన్ను పునర్దర్శన భాగ్యముచే ననుగ్రహింపుము.) (పిమ్మట స్వవిరచిత శకుంతలా పటమును వీక్షించుచు విహ్వలుడై కన్నీరు గార్చును.) ఇంతలో రాచ కార్యము వచ్చును. మంత్రి రాజుయొక్క తీర్పును గోరును.

''విదితమస్తు దేవానాంధన మిత్రోనామ వణిక్ వారి పథోపజీవ నౌ వ్యసనేన విపన్నః సచానపత్యః తస్యచానేక కోటి సంఖ్యంవసు, తదిదానీం రాజ స్వతామాపద్యత ఇతి శ్రుత్వా దేవః ప్రమాణమితి, (మహారాజులకు విదితమగుగాక. ధనమిత్రుడను వర్తకుడు సముద్ర వ్యాపారము చేయుచు నౌకతోపాటు సముద్రగర్భమును చేరెను. అతనికి సంతానము లేదు. కాని, కోట్లకొలది ధనమున్నది. అది ప్రభువులదే యగును. మహారాజులు సెలవీయ దగును.) దానికి రాజు ''అతనికి పలువురు భార్యలుండ వచ్చును. అందెవరి గర్భమందైన సంతాన మున్నచో దీని కుత్తరాధికారి యగును.'' అని యాజ్ఞాపించి మరల నిట్లు పల్కును : ''కిమనేన సంతతి రస్తినాస్తీతి ? యేన యేన వియుజ్యంతే ప్రజాస్స్నిగ్ధేన బంధునా స స పాపాదృతే తాసాం దుష్యంత ఇతి ఘుష్యతాం'' (సంతానమున్న నేమి ? లేకున్న నేమి? ప్రజకు స్నేహపాత్రుడగు నే బంధువుతో వియోగము సంభవించునో ఆ స్థానమును దుష్యంతుడే పూరించును. కాని యా ప్రజ పాపకలుషిత కరాదని చాటింపుడు.)

ఈ స్థానమున కవి దుష్యంతు నొక మహోన్నత పథమునకు గొంపోయెను. శోకమగ్నుడయ్యును రాజు తన రాజధర్మమును కర్తవ్యమును మఱువలేదు. శాసన కార్యము యథాపూర్వముగ యంత్రమువలె సాగుచుండెను. కాని, ఇందు రాజుయొక్క శోకచ్ఛాయ యగుపడుచున్నది. ఇచ్చట రాజుయొక్క దుఃఖము, కర్తవ్య జ్ఞానము, స్నేహము, భూత వర్తమానములు అన్నియు కలసి ఇంద్ర ధనుర్నిర్మాణమువలె అపూర్వమగు శోభ గనుపించును. అపుత్రకుడగు పౌరుని సొత్తు రాజు వశపరచుకొనదగును. కాని, యుత్తరాధికారిని వెదకి యా సొత్తు నీయవలసి యుండును. ఇచ్చట వణిజుని సంతానహీనత, వితంతువుల శోకమును కలసి రాజుయొక్క అనపత్యతా వియోగములతో మిళితములై రాజునకును పౌరునకు నభేద మయ్యెను. దుఃఖ మిరువురను సమానుల జేసెను. రాజు కరుణచే కఱఁగి ''ఎవనికి ప్రియా వియోగము కలుగునో (వాడు పాపిగాకున్నచో) వానికి దుష్యంతుడు బంధువు'' అని పల్కెను ఎంత గొప్పమాట.

సప్తమాంకమున రాజు, మఱియు నున్నత పథమునకు బోవును. స్వర్గమునుండి తిరిగివచ్చు దుష్యంతుడు హేమకూట పర్వతమున కశ్యపాశ్రమమున శకుంతలను ఇట్లు చూచును.

''వసనే పరిధూసరే వసానా నియమ క్షామముఖీ
ధృతైక వేణిః,
అతినిష్కరుణస్య శుద్ధశీలా మమదీర్ఘం విరహవ్రతం
బిభర్తి.''

(మలిన వస్త్రమును ధరించిన ఈమె కఠినవ్రత ధారణమున శుష్కించిన ముఖముకలదై ఒంటి జడ దాల్చినది సత్త్వశీలయగు ఈ శకుంతల కఠినాత్ముడనగు నా దీర్ఘ విరహ వ్రతమును భరించుచున్నది.)

ఉభయుల సంభాషణము చాలా నీరసముగానున్నది. తొలుతనే శకుంతలను సంబోధించిన యాతని తీరు ఆతనిపై నేవగింపును గల్గించును. చూడుడు.

'ప్రియే! క్రౌర్యమపి మేత్వయి ప్రయుక్తమనుకూల పరిణామం సంవృత్తం తదహమిదానం త్వయా ప్రత్యభిజ్ఞాత మాత్మాన మిచ్ఛామి' (ప్రియా! నీయెడ నిష్ఠురముగ ప్రవర్తించితిని. కాని, ఫలితము సుఖప్రదాయక మయ్యెను. అందుచే నిపుడు పరిచితుడ నగుటకు కోర్కె కలుగుచున్నది.) తరువాతయు నిదియే ధోరణి. కాని శకుంతల ప్రత్యుత్తర మీయదు. ఆపై రాజు 'స్మృతిభిన్న మోహతమసో దిష్ట్యా ప్రముఖే స్థితాపి మే సుముఖి, ఉపరాగాంతే శశినస్సముపగతేవాళు రోహిణీ యోగమ్' (ప్రియా! పూర్వ వృత్తాంత స్మరణమున నా మోహ మంతరించినది. రాహువునుండి విముక్తమై చంద్రుని గలిసిన రోహిణి వలె అదృష వశమున నీ విపుడు నా యెదుట ప్రత్యక్షమైతివి.)

'ఆర్యపుత్రునకు జయమగుగాక' యన్నపుడు రాజు మాటలు "బాష్పేణ ప్రతిషిద్ధేపి జయ శబ్దే జితంమయా,

యత్తే దృష్టమ సంస్కారపాటలోష్ఠ పుటం ముఖమ్."

(ప్రియా! జయశబ్దము కన్నీటిచే ప్రతిరుద్ధ మయ్యును నాకు జయము చేకూర్చినది. అసంస్కారపాటలాధరమైన నీ ముఖమును జూడగల్గితివి.')

అప్పుడును రాజు తాను భాగ్యవంతుడను, జయశీలుడనని చెప్పుకొనుచుండెను. కాని, కొలదిసేపటికి శకుంతల అభిమానవశమున శోకింపగా రాజిట్లు చెప్పుచు నామెకు పాదాక్రాంతుడగును.

"సుతను హృదయాత్ప్రత్యాదేశవ్యలీక మపైతుతే
కిమపి మనసః సమ్మోహోమే తదా బలవానభూత్
ప్రబల తమసామేవం ప్రాయాః శుభేషుహి వృత్తయః
స్రజ మపిశిర స్యంధః క్షిప్తాం ధునో త్యహిశంకయా."

(ఓ పూబంతీ! నాచే పరిత్యక్తవై యనుభవించిన దారుణ దుఃఖమును నీ హృదయమునుండి తొలగింపుము. ఆ సమయమున నా హృదయము బలవంతమగు సమ్మోహముచే నట్లయ్యెనది. శుభకార్యముల విషయమై గాఢ తమస్సుచే నావృతములైన

ప్రవృత్తులిట్లే యుండును. శిరమందలి పుష్పమాలిక నంధుఁడు పాముని భ్రమించి త్రోసివేయునుగదా !)

ఇంతదనుక రాజు ఆత్మగోపనము చేయుచున్నట్లుండెను. అనుభక్తికి అనుసయ మిచ్చుటచే నది తన్ను శోకవిహ్వలుని జేయునవియు తదుపరి భాషించుటకే యవకాశ ముండదని తలచి యతడింతదనుక స్వానుభవము నణచికొనియే మాట లాడుచున్నట్లుండెను.

అంతట రాజునకు శకుంతలతో సంయోగము జరుగును. పాఠకు లింత వేగముగ సంయోగము జరుగుట కిష్ట పడక పోవచ్చును. కాని, పాఠకులను కాళిదాసు పూర్వాంకముననే కడు నేర్పుతో సన్నద్ధపరిచె ననుట మరువరాదు. షష్ఠాంక మున రాజు శోకించుచుండ సానుమతి యను నప్సరస (మేనక సఖి) యచ్చట యదృశ్యభావమున నుండి యంతయు విని శకుంతలకు నివేదించెను. శకుంతలయు నిట్టి సంయోగమున కాయత్తపడి యుండెను. కాళిదాసు రాజసంతాపములో నింత కౌసల్య మిమిడ్చెను. అందుచేతనే చివరి యంకమున-పశ్చాత్తాప మున కెడములేక సంయోగము త్వరలో సమకూరెను.

ఈ యంకముననే యాతని పుత్రవాత్సల్యమును ద్యోతక మగును. అంతదనుక యెఱుగకున్నను తన పుత్రునిగాంచి విచారించును.

> ఆ లక్ష్యదంత ముకులాన నిమిత్తహాస్తై
> రవ్యక్తవర్ణ రమణీయ వచః ప్రవృత్తీన్,
> అంకాశ్రయ ప్రణయి న స్తనయాన్ వహంతో
> ధన్యాస్త దంగరజసా మలినీ భవంతి.

(నిర్నిమిత్తమైన హాసముచే నంతటం గనబడు దంత ముకుళములు గలవారును, తొక్కు పలుకులచే నందముగ పల్కు వారును, తొడపై గూర్చుండ నిచ్చగించువారు నగు బాలుర నెత్తికొని వారి శరీర ధూళిచే తండ్రులు మలినాంగులగుచుందురు. ఆ బాలుని స్పృశించుచు రాజు :

> అనేన కస్యాపి కులాంకురేణ
> స్పృష్టస్యగాత్రే సుఖితా మమైవం
> కాం నిర్వృతిం చేతసి తస్య కుర్యా
> ద్యస్యాయ మంగాత్కృతిన: ప్రసూతః.

(ఎవనియొక్కయో కులాంకురమైన యీ బాలుని స్పృశించుటచే నాకే యింత సుఖముగా నున్నది. ఇక కన్నతండ్రి యెంత సుఖమందునో గదా !)

నాటకారంభదశలో కాముకుడుగా గన్పట్టు యీ దుష్యంతుని సుగుణములిట్లు వికసితములై నాటకాంతమున నాతని యెడ సామాజికునికి భక్తిభావమును గూర్చుచున్నవి. నాటకము సాంతముగ దర్శించిన, లేక చదివిన పిమ్మట దుష్యంతుడొక తుచ్ఛ కాముకుఁడు కాడనియు, అతడొక పవిత్ర ప్రేమ మూర్తియు, పుత్రవత్సలుడును, రససిద్ధుఁడగు కవియు, కళా వేత్తయు, కర్తవ్యపరాయణుఁడును, ధర్మమూర్తియు నని తోపక మానదు. ఒక సామాన్య రాజ చరిత్రము నెంతటి విశ్వ మోహనముగా చిత్రించెనా యని కాళిదాసుని కవితా కళావేత్వ తను శ్లాఘింతుము.

దుష్యంతుని చరిత్రము గుణదోష మిశ్రితము. కాని యీ గుణదోషముల మేళవింపు మనోహరము. ఆలంకారిక నియమముల కెంతగా బద్ధుఁడైనను కాళిదాసుని ప్రతిభ యెల్లెడ లద్భుతమే. అతడు మానవ తత్త్వ విజ్ఞాతయైన నొక మహాకవి. అత డుత్తమోత్తమమగు మానవ చరిత్రమును చిత్రింపబూనెను. కాని దుష్యంతు నొక యత్యంత సాధువును, జితేంద్రియునిగను వీరశ్రేష్ఠుఁడగు నొక మహాపురుషునిగ జిత్రింపజాలకపోయెను. కారణ మేమన నాత డట్లు రూపింప జూచినచో భారతకథ నంతటిని తారుమారు జేయవలసి యుండును. అట్లే చేసినచో నది దుష్యంతుని చరిత్ర కాక కామ విజేతయగు అర్జునుని చరిత్రమో. త్యాగశీలియగు భీష్ముని చరిత్రమో యై యుండెడిది. మహాభారత కథకు విరుద్ధముగం బోజాలఁడు గదా ! ఈ నాటకము శకుంతలా దుష్యంతుల ప్రేమ గాథయే గాని పార్వతీ పరమేశ్వరుల వివాహ గాథ కాదని మరువరాదు. అందుచేతనే ఋషులతోడి విశ్వాస ఘాతము, శకుంతలతో కాముకత మున్నగు నంశములు పరిత్యాజ్యములు కానేరవు. ఇట్టివి యున్నను నీ చరిత్రము నింత మహత్తరము గను, విశ్వ మోహనముగను తీర్చి దిద్దెను. కళంకమున్నను చంద్రుఁడు దర్శనీయుఁడే. అట్లే ఇందలి గుణ దోష మిశ్రమము మధురమై యాస్వాద యోగ్యమై యున్నది.

# విస్మృతాంధ్ర నవకవి
# శ్రీ తుమ్మలపల్లి వేంకటరత్నము

**శ్రీ నూతలపాటి రాఘవరావు**

"పూర్వపు కావ్యరీతుల కపూర్వ మపూర్వపు కావ్యశక్తికిన్
పూర్వపు దంచుకొంత కృతబుద్ధులు పల్కఁగ నా కవిత్వవా
గర్వ నిగర్వ నర్తకి 'మురారిది మూడవ పంథ' యన్న సౌ
వర్ణ వాఙ్మయోక్తి సరివచ్చుగదే, జగదేక మోహినీ !"

దేవీస్తుతిలో నీ కవి తన కవిత్వమును గూర్చి చెప్పిన పద్య మిది. ప్రసిద్ధులైన పూర్వాంధ్ర కవులు ధ్వన్యలంకార రీతి గుణపాకాది విశేషములందు చతురులనుట ఆంధ్ర కవితా రసికులకు క్రొత్త సంగతి కాదు. ఆ మార్గము లరసి క్రొత్త రీతిలో మెఱసిన నవ్యతకు స్వాగత మిచ్చిన కొలది మంది యువకవులలో కీ. శే. తుమ్మలపల్లి వేంకట రత్నకవి ఒకరు.

కృష్ణా మండలములోని గుడివాడ వీరి జన్మస్థానము. తల్లిదండ్రులు ఇందిరా కృష్ణయామాత్యులు. ఈ కవి తన 'జ్ఞాన వాసిష్ఠము'లో 'మజ్జనన కారణభూతు వేదండలంతు గంభీరుని నిందిరా సహిత వేంకట కృష్ణ మనోజయుష్ణునిన్' అని తండ్రిగారిని ప్రస్తావించినాడు. తన 28వ ఏటనే అనగా 1936 నాటికే ఈ కవి స్వర్గస్థుడయ్యెను. ఇతవిలోని కవితా శక్తి పసితనములోననే ప్రజ్వరిల్లినది. దశవర్ష ప్రాయమున పాలబుగ్గలతో వేమనయోగి పై జెప్పిన పద్యము లెంత కవితా పయస్సును పండించినవో పాఠకులు గమనింతురు గాక.

"తెలి ముత్తెంపు ధళం ధళల్ కడల నెంతే నల్కఁ క్రొంజిల్గఁ బ
ల్కులు భావ్యంబులు భావముల్ గలిగి వెల్గల్గల్గని దివ్యగీ
తలకున్ నీవు బిగించి, యొంచి శ్రుతి వెట్టన్ సర్వసర్వంసహా
గళ ఘంటా విగతాంప్రుతుల్ మనుచుఁ గాతన్ నేనునా మాం
కితా!"

వీరు గుడివాడలోని ఉన్నత పాఠశాలలో విద్యాభ్యాసము చేయునపుడు కీ. శే. దువ్వూరి సూర్యనారాయణగారు ప్రథానోపాధ్యాయులుగ నుండిరి. కవితా వ్యాసంగములో వీరికవిని మిక్కిలిగ ప్రోత్సహించిరి. సుప్రసిద్ధ నాటకములా దినములలో పేరు పొందిన నటులచే గుడివాడలో ప్రదర్శింపఁ బడెడివి. హరిశ్చంద్ర నాటకములో శ్రీ ముప్పిడి జగ్గరాజు చంద్రమతి భూమికను, శ్రీ కోడూరు శ్రీరాములు హరిశ్చంద్ర పాత్రను నిర్వహించెడివారు.

శ్రీ శ్రీరాములు పద్యములో రాగాలాపన తారా పథము నంటెడిది. వీరిని ప్రశంసించుచు ఈ కవి వ్రాసిన పద్యములలో నొక దానిని ఉదాహరింతును.

"ఆకాశంబున వాయువీచికలలో నవ్వాంయు చువ్వాబలెన్
పైకిన్ రివ్వున పోయి పోయి, యటుపైనన్ వల్లటీ
ల్గొట్టి, లో
జోక్లై క్రిందికి రాను రాను జిడఁగై చూపట్టుచున్నట్టి నీ
ఈ కంఠధ్వని ఈశ్వరార్పణముగానె పారు నెల్లప్పుడున్.'

బాల్యము గడచిన కొలది ఇతని కవితారీతి ప్రౌఢ మార్గమును పట్టినది. బడి చదువునకు 'స్వస్తి' చెప్పి 'అద్వితనాంధ్ర కవి ప్రపంచ నిర్మాత' అయిన శ్రీ చెళ్లపిళ్ల వేంకట శాస్త్రి గారిని సందర్శించుటకు తల్లిదండ్రులకు చెప్పకుండ కడియమునకు ప్రయాణము గట్టిరి. శాస్త్రిగారు ఈ బాలకవి కవితా శక్తిని గమనించి మిక్కిలి ఆనందించిరి. నాటి నుండియు కడియము వీరికి మాతామహ స్థానమయినది. ఆ యూరికి రాక పోకలు చేయు సందర్భములో వీరు మధ్యేమార్గమున నున్న కాకర పఱ్ఱులో దిగి, అచటి పండితుల గోష్ఠీ ప్రసంగములలో పాల్గొని వారొసగు షడ్రస సోపేత భోజనాది మర్యాద లందుకొనుట పరిపాటి యైనది. శ్రీ శాస్త్రిగారు గుడివాడకు సారస్వత సభల సందర్భముగ వచ్చినపుడు వీరి ఇంట బస ఏర్పాటయ్యెడిది. ఒకనాడు వేంకట రత్నకవి శాస్త్రి

# విస్మృతాంధ్ర నవకవి శ్రీతుమ్మలపల్లి వేంకటరత్నము

గారితో వారి బొబ్బిలి పట్టాభిషేకములోని పద్యముల పొర పాట్లను గూర్చి ప్రస్తావింపగ 'వెనుకటికి నే నొక కావ్యం వ్రాస్తే అది తప్పులే తడక అని మా తిరుపతి దానిని చించి పొఱవేయుపఱకు నిద్రపోనివ్వలేదు. మా తిరుపతి గతించిన తర్వాత నీవలె నా కవిత్వమును విమర్శించు వాడు నాకు కన పించలేదు' అని చెప్పి 'వానికేమిలేరా ! అవి 'ప్యాకేజి' పద్యాలు' అని చమత్కరించెడి వారు. తన కవితాలత పందిరి కెక్కుటకు కారణమైన వారు శ్రీ వేంకటశాస్త్రి అని శ్రీ తుమ్మలపలి తన కవితలో సంస్మరించిరి.

ఈ కవికి పద్యరచనలో నున్న యాసక్తి వానిని ప్రక టించుటలో లేదు. కాల క్రమమున ఆ రచన లన్నియు 'సంత ర్పణ' పద్యములై సభావేదికలపై సారస్వత ప్రియుల నోట వ్యాప్తిల్లినవి. వీరు 'కుకవినింద' అను శీర్షికతో వ్రాసిన 'నక్షత్ర మాల' కనుపించుట లేదు. వీరి రచనలలో రెండో మూడో మాత్రము భారతీత్యాది పత్రికలలో ప్రకటితములైనవి. మిగిలిన వన్నియు అముద్రితములుగనే మూలఁబడి యున్నవి. వానిలో కొన్ని— 'మహాత్ముని రాక', 'నీ వెవండవో', 'కవితా లత', 'అపక్వ గోస్తని', 'మధురిట్', 'కంజాత ప్రసవము', 'వ్యసన రసికుఁడు', 'విహంగి', 'భగ్న హృదయము', 'వేమన', 'ఎనిమిదవ ఎడ్వర్డు', 'అశ్రు తర్పణము', 'కవి కోకిలము', 'గుర్వారాధన', 'భీమేశ్వరస్తవము,' 'జగదంబా, నింబసం వాసినీ', 'మేష వాహోజ్జ్వలా !' 'సప్త శైలేశ్వరా !', 'అద్వై తము', 'పొంగలి', 'కన్యకా పరమేశ్వరీ కావ్యము,' 'సౌందర్య లహరి' (అనువాదము) 'జ్ఞాన వాసిష్ఠము' (అనువాదము) మొదలగునవి.

ఇతని కవితలోని వ్యుత్ప్రౌఢ శయ్యా సంపన్న మైనది. సంస్కృత కవి కోటిలో అగ్రశ్రేణికి చెందిన కవు లను ఆంధ్ర కవిత్రయమును వీరీ విధముగ ప్రస్తావించిరి.

> కవి వ్యాసున్, గవి వాసులూరు తనయున్, కవ్యగ్రణిన్
> మాఘువిన్,
> కవి బాణున్, గవికాణు, బిల్హణుని సత్కావ్యావనీస్థాణువిన్,
> సనిశీపజ్ఞ మురారి, భారవి కవిన్, సౌపర్వణాంధ్రీయ వా
> క్కవితా ప్రౌఢుని నన్నపార్యు, కవి తిక్కన్నన్, ప్రబంధే
> శ్వరున్.

రుచి భేదములను బట్టి లోకములో కవిత్వ రచనా విషయమున విభిన్నాభిప్రాయములున్నవి. అందు ముఖ్యమైన శబ్దార్థ సంబంధమును గూర్చి. శబ్ద మెట్లున్న నేమి భావము పది మందికిని తెలియు వలయునని కొందఱి వాదము. శబ్దార్థ ములు అవిభాజ్యము లగుట చేత భావదీప్తికి శబ్ద పాటవము మిక్కిలి యావశ్యకమని కొందఱి విశ్వాసము. ఇది కేవల విశ్వాసమే గాదు; సార్వకాలికమైన కవితా ధర్మము. ఈ ధర్మ మును చక్కగ నిర్వహించిన వాఁడీ కవి. తన రచనా రీతిని గూర్చి ఈ క్రింది పద్యమున చెప్పిన ఈ కవి ఒక ఉపాసకుని వలె కన్పించును.

> ''ఆవేశానల పాటవంబు కఠినంబై కావ్యపాకంబిటుల్
> చేవల్దేరఁగఁ జేయు దాని పలుచం జేయుంగ నాయాత్మలో
> నీవే నిన్నుపసంహరించు కొనుమీ, నే నింక పద్యస్ఫుర
> ద్భావుం డయ్యెదనయ్య ! యజ్ఞపురుషా ! దత్తాత్రిభవార్చి
> ప్రుషా !''

భావుకతలోని నాజూకుదనమునకు శబ్దప్రయోగము లోని విశేషార్థ స్ఫురణకు 'మహాత్ముని రాక' అను ఖండికలోని పద్యములు గమనింపదగినవి.

> ''నిజపదస్పర్శచే నిమ్నోన్నతాయుత
> క్షితి మండలము సమీకృతి వహింప
> నిర్మల మందహాసోర్మి నానావర్ణ
> నివహత్వ మైక కంఠ్యము భజింప
> ఆత్మబాహోయష్టి నా తలాతల మగ్గి
> త శ్వపాకాళి కై దండఁ గొనఁగ
> తన యహింసా పర్వతములో చలాచల
> విశ్వంబును ప్రశాంతి విశ్వసింప
> తనదు వ్యాహార సరణిలో వనుపదంబు
> నఖిల మతబోద్ధ లైక కంఠ్యము వలంప
> కోకిలమ్ములు పంచమ స్వీకృతిఁ గొనఁ
> దా వెలసినాఁడు మోహనదాసుఁ డిపుడు.''

> ''కోకిల లొండొరుం బిలుచు కొన్నవి వానిరవంబు పంచమ
> స్వీకృతియే వెలార్చెను వచించెడి స్వాగత వాక్ప్రణాళికన్'
> చీకటితోనె కొంత విలసిల్లె మనోజ్ఞ కుసుంభరక్తిమన్
> ప్రాకట లీల నే డిచట పంచమభూత ముఖాంచలంబునన్.''

ఇందు 'నిమ్నోన్నతాయుత క్షితి తలము సమీకృతి' వహించుట, 'కోకిలంబులు పంచమ స్వీకృతి గొనుట', 'పంచమ భూత ముఖాంచలమున' చీకట్లు పోగా కాంతులు విలసిల్లుట మొదలగు సందర్భములందు నిక్షిప్తమైన శబ్దశక్తి, ధ్వన్య మానత నిపుణులు పరిశీలింతురుగాక.

> ''అది యస్పృశ్య మవాచ్య మౌ నొక గరీయం పున్మహారేఖికా
> భ్యుదయం బాంధ్ర వసుంధరోపరి స్వయంభూనేత్ర రోచి
> స్సృథా

న్పదమై ఘోర తమిస్రపుంజ మవనీ పశ్చార్ధగోళాన కా
ర్తిదమై పర్వ వెలింగె నేఁడు గుజరాతి వైశ్యవర్చస్స్ఫురన్.''

'ఏ వెవండవో' అను శీర్షికలో జగద్వ్యాపితమైన పరమే
శ్వరుని చిద్విలాసము నానారీతుల వర్ణింపఁబడినది.

''మెఱుఁగుల తోటలోన వసియించెడు మేఘ రథంబుపైన, నం
బరమున వాయువేగమునఁ బైన మొనర్చుచు నీచరాచర
స్ఫురిత జగత్ప్రబోధక విశుద్ధగళ ధ్వని తోడ నన్ను హె
చ్చరిక యొనర్చుచున్ మొగము చాటొనరించిన నీవెవండవో!''

పింగళి సూరన్న చెప్పినట్లు శబ్ద సంస్కారము భంగ
పడని రీతిగ పదమైత్రి అర్థ సంపదలతో విలసిల్లునట్లుగ
చెప్పఁబడిన దీ పద్యము. పూర్వ కవులలో సాధారణముగ కన్పించు
ఊత పదములు పొల్లుమాటలు, నవ్యులగు కొందఱి రచనలలో
త్రాడు పేనినట్లు ప్రయోగింపఁబడు 'మధుర' లు 'విమలాతి
విమలము' లు 'లలిత' లు వీరి రచనలో కన్పింపవు.

'అపక్వగోస్తని' అను ఖండిక స్వామి శివశంకర సంకలిత
మైన కావ్యఖండికా గుచ్ఛములో ముద్రితమైనది. ఈ ద్రాక్షా
లత ఎక్కడిది, ఇది తన కెట్లు సంప్రాప్తించినది, తా నెట్లు
దానిని వర్ధిల్లఁజేసెనో కవి చమత్కారముగ వర్ణించుచున్నాడు.
వేమ చెప్పిన 'సంతర్పణ' పద్యములలో నివియుఁ జేరును.

''వెనుకటి కొక్క ద్రాక్షలత వేములవాడ కులీనుఁడైన భీ
మన కవిగారి యుల్వెరటి యందు దయించెను, తద్ర
సంపు సెం
జినుకుల జోరునన్ తెలుఁగుసీమల తియ్యఁదనాల మించి రా
జనపుఁ జిలుంగు కబ్బపుఁ బసందుల మోటికలెత్త వర్ధిలెన్!

''ఆపయి దాని యంటొకటి యాంధ్రమునన్ కవిసార్వ
భౌముఁడై
ప్రాపిత నైషధీయ సురవాక్పరిభాష తెనుంగు తేనెతో
పోసెడు నాత నింటికిని ముంగిరి పందిరిపైకి ప్రాకియా
యేపున కాపువట్టి రహియించెను గుత్తులు డిగ్గఁబ్రా
ఊఁగన్.''

''కాలమునాటి దాని విత్తనము ఏ గాలిపాటునో, లేక
మింట నెగురు ఏ చిలుక ముక్కు నుండియో యీ కవి గృహ
ముఖమ్మున వచ్చి పడినదట !—

విత్తు మొలకెత్తె లేఁ జిగుర్వెట్టె తీగె
కొనలు సాగెను ప్రాకులాడను దొడంగె
నంత నల చెల్లపిళ్ల వెంకన్న యొక్క
దొరువుఁగట్టె వద్దాకి నడవ దడవ.''

శ్రీనాథ భీమకవుల వంటివా రీతనికి గురుస్థానములోని వా
రనుట పై పద్యముల వలన స్పష్టమగుచున్నది. ఈ దిగువ
పద్యమున అట్టి పదబంధమే గోచరించును.

''గృధ్రవాటీ పురాగ్ర వాస్తవ్య భీమ
నాయక జటావలీ విలగ్న శశిబింబ
సంభృత సుధా ప్రపూర నిష్యందనమున
వల్లరీ ద్వంద్వమది ప్రవర్తిల్లె మున్ను.''

ఈ లతా బాలికకు అపత్య సంభావనగ సకలోపచారముల
గావించినాఁడు. ఈతని కవితపై శ్రీ చెళ్లపిళ్లవారి రచనా
సారస్య సాదృశ్యము లెట్టి ప్రభావము వహించినవో తెలియుటకు
ఈ క్రింది పద్యము తోడ్పడును.

''నారుంబోసియు నీరుఁ బోయఁడె ధర న్నారాయణుం
డన్న, వా
చా రీతిం బినుపొంది నేటికి గుళుచ్ఛం బొండ
ప్రాపించె, వి
స్తారంబయ్యెను కాయమానగతి హస్తప్రాప్య తన్మంజరీ
నీరంధ్రీకృత గోస్తనీ మధుర పానీయ ప్రపాకారమై''

వక్కత కొలువడినను 'కవనపు దప్పిఁగొన్న లోకము
కొఱకు పచ్చి పూపలు పుణికిన పాపమునకు, తన ముష్కర కరదుష్
పకారమును' క్షమింపుమని వల్లికా కుమారిని కవి ప్రార్థించు
చున్నాఁడు. ఏ మధురిట్ కుమారునో, ఏ విహంగినో, ఏ కంజాత
ప్రసవమునో వీక్షించినపుడు ఇతని యూహలకు రెక్కలు వచ్చును.
'ఎదలో భ్రమరించు తుమ్మెదకు శ్రుతిగా' వీతని జిహ్వాపై కవిత
లాస్యము చేసినది. ఆతని రచనాపుంజములో వీతని 'పద నటవ
క్రమాతి పరివర్తిత చారులయాను యానములు' పొదుగఁ
బడినవి. నా గీతికా మాధుర్యము మధుప్రియుఁడవైన నీ కెటుగా
రుచించునో యని కవి తుమ్మెద నడుగుచున్నాఁడు.

''చిరవైహాయస యానముల్ నెరపి కించిత్తిక్త
తిక్తాష్ట ది
క్కారి కండూల కపోలజాల మదవార్గండూష కేళీకలా
స్థిర వౌనీ కెటుగా రుచించెడి నా ! సుచ్చేతో రసా
లాంత రు
ద్దురమైరేయ రసోల్బణోద్యదతి మాధుర్యాతి
సౌగంధ్యముల్.''

రుచింపకున్నచో కవి చేయు హెచ్చరిక—

''పోయిరమ్మకపార్శ్వసాయాహ్న వికసిత
మల్లి మకరంద విస్సగల పైకి
వెళ్లిరమ్మకపారి ప్రవీణావలి క్రమ
కాశ్మీర పత్ర భంగముల పైకి

# విస్మృతాంధ్ర నవకవి శ్రీతుమ్మలపల్లి వేంకటరత్నము

ప్రాలి రమ్యమ్ము సముద్ర వేలా ప్రవాళాళి
పాంద్రీ భవన్నికుంజలముల పైకి
కాలాడు మొకసారి కౌబేర కేళికా
వన మాధవీ మంటపముల పైకి ....''

అని. ఆతని సంగీతములో తన సాంసారికాహ్వానములు వినఁబడ వనుచున్నాఁడు.

'వ్యసన రసికుఁడు' అను శీర్షికలో పూర్వమెపుడో వీరి పద్యములు కొన్ని ప్రకటితములైనవి. ఇదియే ''శీర్షిక''తో శ్రీరామచంద్ర అప్పారావు ఒక గేయమును వ్రాసిరి. శ్రీ తుమ్మలపల్లి రచనలో భావుకత విస్తారముగ గోచరించుచున్నది. పోఢిమ సడలని వినూత్నతయు గమనింపఁ దగిన విశేషము.

సీ॥ ''బహ్వంగనా ముఖ ప్రస్యంది నవ మధు గ్రహిళ పుష్పంధ
యాగ్ర సరుఁ డగుదు
లేలిహ్యమాన హరిప్రియా కారణ వ్యాఘూర్ణమాన
నేత్రాబ్జుఁ డగుద
చటుల తమస్వినీ కుటిల నీలాలక గ్రథనాపనిద్రితో
త్కలిక నౌదు
సంతతానన గుహా సంత్యక్త బహుళ ధూమౌఘ
కల్పిత వృష్టి మేఘుఁడౌదు
అగుదుఁ గాకేమి నీవు నన్ననగ రాదు,
జారుఁ డనియు, సురాపుఁడు, చోరుఁడితఁడు,
ధూమపాయు యటంచు నుద్దామ దివ్య
వాఙ్మయోత్కృష్ట శబ్దైక వర్ణ్యుఁ డగుదు !''

అంతియేకాదు; ప్రకృతియంతయు తన విహారముచే పులకించునఁట ! ఈ తర్వాతి పద్యమునకు మొదటి పద్యముతో అన్వయమున్నది.

సీ॥ ''నా కరస్పర్శచే లోకమ్ములోనున్న ప్రతి తీవయును
పూత పట్టుచుండు
నా కంటి రక్తిలో దూకెడు హ్లాద బిందులకై
నోరు విచ్చు పుడమి
నా నిశానట దంష్ట్రి నవలయ బ్రహ్మకై నీరస ప్రకృతి
ధ్యానించుచుండు
నా నిత్య ధూమ ధూపానకే తడియారు ఖచరికా
స్నానార్ద్ర కైశికముల
లోక కళ్యాణ ఘంటావళీ కలకల
వితత గ్రైవేయ యుత గవాంపతిని నన్ను
అనఁగ వచ్చునె కేవల వ్యసని ననుచు !
ఆగ వచ్చునె నాయధేచ్ఛానుభవము !''

లోక నీతి నతిక్రమించిన కవిదృష్టి సౌందర్యపు టెల్లలను ముట్టినది. ఆతని గళము 'లోక కళ్యాణ ఘంటావళీ' కలకల ధ్వనులను వినిపించుచున్నది. నవకవితలో ఇట్టి ప్రౌఢ మార్గము ఎక్కడనో గాని గోచరింపదు.

మెలతరో ! నీ కనుంగొనలు మెత్తని కత్తులు ! కాన నాతమ
స్తిలకిత బుద్ధికిన్ జిదిమి దీపము పెట్టగవచ్చు నీతనూ
విలసనమందు; నీ వెలు పిథుల బువ్వుల రేకులెత్తు; నిన్
దలచిన భావముల్ పులకితమ్ములు ప్రత్యహనూతనమ్ములై.

ఈ పద్యములోని భావ వ్యక్తీకరణములు రెండును నవకవితా రీతికి మచ్చు తునకలు.

'రాజ్య రమయా ? రమయా ?' అను శీర్షికతో ఎనిమిదవ ఎడ్వర్డు రాజ్యాధికారమును పరిత్యజించిన సందర్భమును పురస్కరించుకుని చెప్పిన కొన్ని పద్యములు లభించినవి. పంచమ జార్జి అనంతరము అతని కుమారుడు ఎడ్వర్డు మూర్ధాభిషిక్తుడు కావలసియుండెను. పార్లమెంటును అట్లే నిర్ణయించెను. యువరాజు సామాన్య కుటుంబమున జన్మించిన 'సిమ్సన్' అను యువతిని ప్రేమించెను. పార్లమెంటు అభ్యంతరపెట్టుటచేత ఆమెకొఱకు రాజ్యాధికారమునే త్యజించిన ఇతనినిగూర్చి ఈ రచన సాగినది. రమణికి ధారుణికి గల పోలికలను వ్యత్యాసములను చమత్కరించుట ఇందుగల విశేషము. వినూత్నమైన వర్ణనా పద్ధతి ఇతని ప్రతిభను చాటుచున్నది.

సీ॥ ''ఉత్తుంగ భూధరోద్వృత్త ధారుణికంటే వినతాంగ
మాంసలస్తని ఘనంబె !
సురుచిర సాంధ్య కౌసుంభ రక్తిమకంటె చెక్కు
మంకెన వన్నె లెక్కువగునె !
సూర్య దృక్చంద్ర దృక్సమహిమ క్షితికంటె చర్మ
చక్షుష్మ తీక్ష్ణ మెఱుంగె !
క్షణికాత్మత: ప్రదక్షిణ కృద్ధరణి కంటె పికిలి
కోలాట లాసిక, బెడంగె !
గాంగ కౌశేయ వసన శృంగారిత క్షమ
కుల్లి పార చీని చీనాంబరోల్ల సనపు
తరళపై రానతాంగ సుందరి బెడంగే !
సకల మెఱుఁగుదు వాంగ్లేయ చక్రవర్తి !''

ఈ హేలాణికే సార్వభౌమ పదవి పసలేనిదట. 'స్వాతంత్ర్యంపు టెడారి'

'సచివ హస్తస్థంపు తోల్బొమ్మ,' 'పరతంత్ర సాంజ్ఞిక
మహా
భూపాలతాముద్రము,' 'డమరుస్వన త్స్రచివ వాణిన్
శీర్షమాడించు

భూస్వామిత్వపు 'గంగిరెద్దుతనము' అని వర్ణించుచు దీనిని ఏ ప్రహస్వాత్ముడుగాని స్వీకరింపఁ డని ఈ కవి తీర్పు చెప్పుచున్నాడు. మరి, ఆ సితాస్య ఈ రసిక ప్రభువును లోగొనిన విలాస విభ్రమాది విశేషములేమో ! ఏమో గాని కవి ఇవేమోనని భావించుచున్నాడు.

హంసీ శంసితయానమో, దరపరీహాసంపుటుల్లాసమో,
సంసద్దంసక నిక్వణ క్వణితలాస్య ప్రక్రమంబో, వధూ
త్తంసీభూత తదీయ కర్షిత తనూ తారళ్య సారళ్య వి
స్రంసిస్రంసి దుకూలి కాంచల మరుత్సార ప్రసా
రమ్ములో !

తెలుఁగు పద్య రచన యొక మహాద్భుత శిల్పము. దీనిలో కృతార్థత ఎక్కడి కక్కడగనే యుండును. అర్థపుష్టి యున్న ప్రసన్నత కొరవడవచ్చును. ఎత్తుగడ బింకముగనున్న నిర్వ హణలో పొంకము జారిపోవచ్చును. సర్వ పూర్వాంధ్ర కవుల లోను సుప్రసన్న సుందర పద్య కవితకు ఇద్దరే పీఠాధిపతులు: వారు నన్నయ శ్రీనాథులు. శ్రీ తుమ్మలపల్లి కవి వీరికి సజా తీయుడు. కవితలోని ప్రసన్నతా గుణము అభినయములోని ఆహార్యము వంటిది. మొదటిది పాఠక హృదయమును రెండవది ప్రేక్షక హృదయమును చప్పున ఆకట్టును. ప్రసన్నత అని నప్పుడు అది రచనలోని సులభ శైలి కానవసరములేదు. రస భావ ప్రతీతికి వలసిన స్ఫూర్తిని దీప్తిని సమకూర్చు శబ్దార్థ బంధము ప్రసన్నత. అగ్నిదేవుని ప్రశంసించు సందర్భమున ఈ కవి ఈ గుణమునే పోషించెను. ఇతని పద్యము భావావేశ ముతో హృదయమునుండి దూసుకుని వచ్చునేకాని పదములను ఏరి కూర్చినట్లుండదు.

గ్రాహ గ్రస్త గజేంద్ర మోక్షణ నివర్ల ద్విష్ణు చక్రోజ్వల
ద్దాహార్చుల్, శిశుపాల కంఠ దళనోజ్యద్భ్వర సాదర్శన
వ్యూహీభూత కళల్, రథాంగకృత రాహుగ్రగ్రహోచ్ఛేదన
వ్యాహృష్ట ప్రభలుందలంచేద, ద్విశీర్షా ! ఆర్షహూతి
ప్రియా !

ఆముక్త మాల్యదలో దశావతార వర్ణనలో చెప్పబడిన పద్యములు జ్ఞప్తికి వచ్చుచున్నవి.

ఈ కవి గుడివాడలోని భీమేశ్వరస్వామిని గూర్చి చేసిన రచన కొంత కన్పించుచున్నది. శ్రీనాథ భీమకవులు కవి హృద యమున సాక్షాత్కరించి యుందురు. వారి యుద్దండ శైలికి వారసత్వము వహించిన వానివలె భీమేశ్వరుని సంస్తుతించుచున్నాడు.

''శ్రీనాథుండనువాడు పూర్వమెపుడో శ్రీ దక్షవాటీపుర
శ్రీనాథున్ నినుఁ గొల్చి కావ్యభువన శ్రీనాథుఁ డైనాఁడు, పెం
పొసఁన్ నాఁటికి నేఁడు నీ డొకడు సంప్రార్థించుచున్నాఁడు,
నేనాథుండగు వాఁ డొ ? గృధ్రవన వాటీశాన ! భీమేశ్వరా!''

''కేలన్ భక్తి ధనుస్సు గైకొనుచు హోంకృత్తట్ట హాసధ్వనుల్
చాలం గ్రాల మదీయ వాఙ్ముకుళికల్ సంధించితిన్ నీదు పా
దాలన్ లక్ష్యము నిల్పి వేసెదను తాతా ! ఈ నమస్కార బా
ణాలన్ నీవిక కాచికోర ఎటులైనంగాని భీమేశ్వరా !''

ఇందుక్తమైన 'కాచికోర' అను పదములోని శ్లేష గమనింపఁదగినది. లౌకిక విషయాసక్తమైన మనస్సును భక్తి లతా బద్ధముగావింపుమని ఈ కవి ధూర్జటివలె ఇట్లనుచున్నాడు.

నిరంతంబున్ తరుణీకుచాద్రులపయిన్ నిద్రించి మోహాటవి
వర తృష్ణా తరుశాఖలం దగిలి నృత్యంబాడు నాచిత్త వా
నరమున్ భక్తిలతా నిబద్ధమయి యుండంజేసి, భిక్షానకై
యరిగేటప్పుడు వెంటఁ బెట్టుకుని పోవయ్యాయి, భీమేశ్వరా !

భీమేశ్వరుని ప్రేమతత్త్వమును వర్ణించుటకు లోక మంతయు కవిమయమును, సముద్రమంతయు సిరాబుడ్డియు రెల్లుపుల్ల లన్నియు కలాలు, రేలన్నియు పవళ్ళును, ఆకాశ మంతయు తెల్ల కాగితమును అయినప్పటికి అసాధ్యమగునట !

'జగదంబా ! నింబసంవాసినీ !' అను ఖండిక లోని రచన భక్త్యావేశ సంపన్నమై జటిలపద ప్రయోగముతోను దుష్కర ప్రాసలతోను సాగినది.

''స్వర్గక్షీర గిరీశ్వరాట్టహాస స్వచ్ఛాంబు జచ్ఛేదము
గ్వార్గండూష గళన్మరంద కణము ల్వర్షింపఁ గా జాలుమ
ద్దీర్ఘా ద్ధ్యమునెంచి మామక మనో దేహాగ్ర దుర్గంధ భా
గ్దార్ఘ్యంబడగింపుమో కనకదుర్గా ! భర్గచేతః ప్రియా''

అర్ధాంగనా రూపము నీ కవి ఇట్లు సంస్మరించుచున్నాఁడు

''ఒక ప్రక్కన్ గనకోత రీయ, మొకచో నుత్కృష్ట
మత్తద్విప
ప్రకటత్వక్పరిధాన, మొక్కట జటాపాటల్య, మొక్కం
టఁ గై
శ్య కలాపం, బొకచోయురోజ, మొకమీసం, బిట్టు
లర్ధాంగనా
త్మిక శైవాంతర సాంధ్య నర్తకివి, శక్తీ ! ముక్తిఘంధా
యినీ !''

ఆయా స్తవములందు పద్యాంతమున ప్రయుక్తములైన సాభిప్రాయ సంబోధనలు మిక్కిలి మనోహరముగానుండును. 'అరుణాంఘ్రి ద్వయనర్తితాగమ కదంబా ! అంబ! నింబాలయా!' 'ఆకలంకోరు యుగీ కనత్కనక రంభా ! నింబసంవాసినీ !',

'అహరంతోద్ధత తాండవోగ్ర శివత స్వర్ధంబ! నింబాలయా!', 'రుద్రహృత్కమలినీ రోలంబ! నింబాలయా!' మొదలగునవి దేవీ స్తుతియందు చెప్పఁబడినవి. 'మేషనాహౌజ్వలా!' అను ఖండికలో 'సోఽహం,తే ప్రణమామి తే తులిత పూషా! సుశ్రిత శ్రీ వుషా!' 'దాసోఽహం దేవ భవత్ప్రభాచయ పుషాజ్య ప్రాజ్య సద్వి ప్రుషా!' 'దేవా! సర్వ దేవాననా!' ఋషుకే తుద్విష దక్షి గోళక మిషా! సందత్త హవ్యోన్మిషా!' అనియు, 'సప్త శైలేశ్వరా' అను ఖండికలోని 'శిరోజమాత్ర ధనలాభా! సప్త శైలేశ్వరా!' మున్నగునవి చమత్కారముగ నున్నవి.

తెలుఁగు పలుకుఁబడుల తీయందనాలు ఏ తీరున నున్నవో గమనించుటకు 'పొంగలి' అను రచన తోడ్పడును. రథసప్తమీ దినము భార్క ప్రాభవమును వర్ణించుపట్టుల మరల ఏ శ్రీనాథ కవియో దిగి వచ్చెననిపించును.

> "ముక్తి శ్రీ కబరీ పరిణత జపా పుష్పోత్కరంబై మదో
> ద్రిక్తా వ్యక్త జగద్భయంకరణమందే హారు దేహొద్గళ
> ద్రక్తాతిక్త వపుః ప్రపూజిత నభోరత్నంబు రాజిల్లెడిన్
> ప్రాక్తాటంకవతీ మణిమకుటమై, వైయత్క
> కూష్మాండమై".

త్రిభువనీ శోభనమును గూర్చు సూర్యదేవుని రాకకు నిలువెల్ల పులకరించిన ప్రకృతికాంత ఎట్లాతని స్వాగతించుచున్నదో గమనింపఁ దగియున్నది.

> సీ॥ "తెలి మంచు మేల్ముసుంగలనల్లఁ బోఁజోపి ప్రకృతి
> చిర్నగుమోము బైటఁ బెట్ట
> తన పైడి గిన్నెలో గొనబుఁ దేనియలూని బిసినీ కుమారి
> నైవేద్య మిడఁగ
> తళతళ లాడు ముత్యాల జూకాలతోఁ గుస్తుంభరియు
> నెదుర్కొలు నలుప
> వివృత ఫణామణీ విమలాంశురింభోళి వ్యాళ కన్య
> కలు నివాళు లెత్త
> నున్నతీ భూతమై తలయూచి మెచ్చి
> ప్రొద్దు తిరుగుడు మొగ్గ సొంపులు వెలార్ప
> నేడు గుఱ్ఱాల రథముపై నెక్కి వెడలె
> సూర్యదేవుండు త్రిభువనీ శోభనముగ."

శ్రీనాథ కవి రచనలందు విశేషముగ గోచరించు లింగ వక్రతా ద్యోతకములైన 'భ్రూవల్లీ', 'కల్లోలినీ' త్యాది పదములు స్మృతికి వచ్చునట్లు వీరి 'బిసినీకుమారి' 'త్రిభువనీ శోభనము' 'తాటంకవతీమణీ మకుటమై' మొదలగునవి ప్రయుక్తములైనవి. ప్రతి పద్య రసస్యందిగా నీ ఖండిక సంస్కృతాంధ్ర శబ్దముల విందుఁ దనముల వెలార్చుచు సాగినది.

జీవితములో కలిగిన బాధను కవిగా వ్యక్తముచేయుట నాటి భావకవులలో నొక విశిష్ట లక్షణము. తన ఏకైక పుత్రిక మృతినొందినపుడు "అశ్రుతర్పణము"లో నిట్లు పలికినాఁ డీ కవి.

కవి :

> "కడుపున రాలిపడ్డ తొలికందను తన్నుక పోయె
> గద్ద, ఏ
> బుడుత చిగుళ్లు లే వలపుఁ బూతలు గానని శూన్య శాఖపై
> బెడగయిడిగ్గ నా పనస పిందెను వంకర కోరలుచ్చి పో
> సుడుత యెదో 'కటుక్క'న నహా! కొఱికెన్ కొఱకంచు
> ముట్టియున్."

> "నానయునాతి శీతల గుణ ప్రతిపాదక నంది వర్ధనం
> బా! నుత యౌవనైక ఫలమా! హృదయాంబుజ
> కోరకోదరా
> హీనమరంద బుద్బుదమ! హృన్మథిత ప్రణయాంబు
> రాశి వీ
> చీన నవీత గంధ కవచీకృత కౌసుమ గాత్రవల్లరీ!"

> "ఈఁగా! ఈ గతి ప్రయోగగాఁ జెవిని నాహేవాకి తాంతర్యపున్
> భోగంపుం జెలివో! రహస్య కథనా భోగాత్మ మిత్రుండవో!
> రోగా హారి మనూపదేశ కలన ప్రోన్నమ్ర పౌరోధన
> శ్రీగర్భంబబ! తత్పుతా విలయు లక్ష్మీ గీతికా లాపివో!"

ఇట్టి రచనా పద్ధతి కెన్నేని పద్యములుదాహరింప వచ్చును. 'భగ్నహృదయుము' అను ఖండికలో నారీ హృదంతర విషాదము చక్కగ వినాపితమైనది.

> "అల దుఃఖంబు వెలార్పకే సతులు తామంతంతలోలో
> గుమా
> రిలి, యాత్మీయ హృదబ్జ కోరక విదారి ప్రేమ వైరస్య సం
> కలితోద్యద్వ్రణ బాధచే కుములుటల్ గల్గున్, మ మెన్నెన్నొకో
> మల బాలా సుకపోల లీలలు పరిమ్లానంబులై సోలవో!"

ఈ కవి మృతినొందుటకు రెండు సంవత్సరముల పూర్వమే నేత్రవ్యాధి సోకినది. తనకు దృష్టిని ప్రసాదింప వలసినదని అగ్నిభట్టారకుని వేడుకొన్నాడు. 'భవద్బాహుళ్యం బున నొక్క వెల్గు కణికన్ బంగారుకున్ షోడశ శ్రీ హర్షం బిడుదాని కంటజిలుకన్ సేవింతు నా దృష్టివల్లీ హల్లీసక తోరణాల నవు మూషా! మేషహౌజ్వలా!' అని ప్రార్థించుట ఇతని భక్త్యావేశమునకు నిదర్శనము.

'కన్యకా పరమేశ్వరీ చరిత్ర' మను కావ్యము మూడు వందలకు పైగా పద్యములు గలది. ఇవన్నియు పూర్వపు వాని వలెనే అముద్రితముగనే ఉన్నవి. ఈ కావ్యమున సంప్రదాయ బద్ధమైన కావ్య ప్రారంభ విధానమున్నది. రచనలో ప్రౌఢ కల్పనలు ప్రయోగములు విశేషముగ నున్నవి. కావ్యాదిని సంస్కృత శ్లోకమున్నది. కన్యకా రూపమును వర్ణించు నీ పద్యమున చేమకూర వెంకట కవి రచనలోని సులువైన తెలుఁగు శ్లేషలు జ్ఞప్తికి వచ్చుచున్నవి.

''చేరెడు కన్నులున్ మఁదుట జేరెడు ముంగురులుంగరాలునున్
బారెడు వేణి చంద్రుపయి బారెడు నవ్వు మొగిమ్ము మాటలో
మూరెడు సుస్వనంబులును మూరెడులంతలు సుస్తనంబులున్
పూరెడు పల్కు వింత వలపూరెడు నిశ్వసనంబు లొప్పఁగన్''

ఈ సందర్భమున చెప్పబడిన ఈ క్రింది పద్యముల ఎత్తుగడ, కుదింపు, నడకలోని తీవి శ్రీనాథ కవి దమయంతి సౌందర్య వర్ణనా సందర్భమును స్మృతికి తెచ్చుచున్నవి. స్థలా భావము చేత వానిని ఉదహరింపక విడుచుచున్నాను.

''పర్వతపు సానువులపైన ప్రభలు రేచు
మణులు సతి చెక్కులికి మారు మనువుగాదె
తీగె కొనలందుఁ బూచిన పూవులకును
పడఁతుక శిరోజముల కేమి బాంధవంబు!''

''తెలుప పాదాల పసిమి అద్దినదికాదు
అద్దకము మెచ్చు కవిని నేనసలుకాను
కృతక హారిద్ర కలన నిర్మిత విసర్గ
కనక పాంచాలికకు పావకర్మ కాదె!''

ఈ కావ్యమున వర్ణింపబడిన కన్యక తండ్రిపేరు కుసుమశ్రేష్ఠి. ఇతనితో నా పురమేలు రాజు తనను గూర్చి

''ఆ ప్రాతస్సమయంబు నా చరమసంధ్యాకాల మశ్వత్థప
త్ర ప్రాయమ్ములు చంచలమ్ములగు నా ద్రవ్యమ్ములన్ సర్వ భూ
త ప్రీత్యర్థమటంచు జీవితపు యాత్రన్ పల్పుచున్ వేటిపు
ణ్య ప్రారంభ దినంబు రేపను భవింపంబోదు స్వర్గానకున్.''

అనిచెప్పిన పద్యములోని నడక శ్రీ వెంకటశాస్త్రిగారిని ఆకర్షించినదనినచో ఆశ్చర్యములేదు. వసంతకాంతను వర్ణించు సందర్భమున సీస పద్యమెట్లు వంపులు దిద్దుకొన్నదో గమనింపదగియున్నది.

సీ॥ ''అల్లంత దూరాన మల్లెపందిరిఁ జూచి, పందిరిక్రింద నీ పడకఁ జూచి
చిరుత మామిడిరెమ్మ చిగురు పూతలు చూచి, రెమ్మలో నీ సొమ్మునమ్మఁ జూచి
వెన్నెల తీగెలో వెలుతురెల్లంజూచి దానిలో నీ చెక్కు తళుకుఁ జూచి
విర్సిన్నదాడిమీ గర్భంబులంజూచి వానిలో నీదు పల్వరుసఁ జూచి
పుప్పొడి దుమారపుం జైట పొలయుకలకుఁ
గెరలు కరువళ్ల చక్కిలిగింతలందు
'కిలా కిలా'నవ్వు కన్నెకోకిలలు నీకు
స్వాగతంబిచ్చు నోసీ! వసంత రమణి!''

శ్రీ శంకర భగవత్పాదుల 'సౌందర్య'లహరి'ని ఆంధ్రీకరించుటలో నీ కవి చూపిన నేర్పు ప్రశంసనీయమైనది. మూలమునందలి భావ గాంభీర్యము చెడకుండ తెలుఁగులో నాయా భావములను స్వతంత్రముగా పద్యరూపమున తీర్చినట్లున్నది వీరి యనువాదము. ఒక శ్లోకము నుదాహరింతును.

''గతైర్మాణిక్యత్వం గగన మణి భిస్సాంద్ర ఘటితం
కిరీటం తే హైమం హిమగిరి సుతే కీర్తయతి యః
స నీడేయచ్ఛాయాచ్ఛురణ శబలం చంద్రశకలం
ధనుశ్శౌనా సీరం కిమితి నని బధ్నాతి ధిషణాయ్''.

''భూరి విలాసమౌ నవ నభోమణి సంఘటితంబు నీదుకో
టీర మటంచు తాము ప్రకటించు కవుల్, నవరత్న రాజకి
మ్మీరరవిచ్ఛవిచ్ఛురణ మించిన యైందవ ఖండమున్ సునా
సీర ధనుర్లతా ధిషణచేఁ దిలకింత్రుగదే! మహేశ్వరీ!''

'సౌందర్యలహరి మొత్తము అనువాదము గావింపఁ బడినను చాలాభాగము కన్పించుటలేదు. వీరి జ్ఞాన వాసిష్ఠానువాదము కూడ అలభ్యముగనే యున్నది.

తన కవితా గౌరవమును గూర్చి శ్రీ తుమ్మలపల్లి కవి కొన్ని పద్యములందు పూర్వ కవులవలె చెప్పుకొనియున్నాడు.

''పొరపాటుల్ పయిపై కవిత్వలహరీ పోపూల్లయమానంబులై
పొరలాడున్ తృణజాల లీల నీక తన్మర్త్యాఖలోపార్జనా
పరులై యున్న నరుల్ మదీయ విపులాంతఃపూర నిర్మజ్జన
స్థిర దీక్షన్ గొని లోతుకుండిగ వలెన్ శ్రీకంఠ భీమేశ్వరా!'',

అని నన్నయ వలెనో శ్రీనాథుని వలెనో వక్కాణించుచున్నాఁడు.

తన కవితా గురువైన శ్రీ శాస్త్రుల వారిపై చెప్పిన పద్యములు భక్త్యావేశమునకు నిధులు. ఆంధ్రకవితా జగత్తుపై వారికున్న ఆధిపత్యమును మహోహరముగ వర్ణించియున్నాడు.

# విస్మృతాంధ్ర నవకవి శ్రీతుమ్మంపల్లి వేంకటరత్నము

''ప్రస్వి, లలాటదేశ విలసద్ద్రష్టు సుణాంశుడు శాంకరీ కృపా
దృగ్విభవుండు,మా గురువరేణ్యుఁడు నిల్చినచోట్ల నూతనా
రగ్వధ కోరకోదర మరందము జాల్గొనునట్టె! తన్మరుత్
భుగ్వనితా నితాంతనుతి పూత్కృతి మ్రోయునటే నిజం బుగన్!''

''మా గురు చెళ్లపిళ్ల కులమండను దీర్ఘ దృగంత రక్తిమన్
జే గురు సంజ వన్నియలు చిందిన వాంధ్ర సరస్వతి కపో
లాగత చంద్ర ఖండసితి మాంతరమందున వావి పల్కుకా
లాగురు సౌరభమ్ములి గలట్టిది వజ్రపు డాల్గనట్టిదిన్.''

**అట్టి** కాంతినే తన కవిత్వముకూడ సమకూర్చుకొనవలెనని ఇతఁడు 'మత్కవితా లతాంగి చెక్కుటద్దాల ప్రతిఫలించెడిని గాత'' ! మని సూర్యదేవుని ప్రార్థించినాఁడు. అట్టి కాంతి సౌరభములఁలేని పద్యమొకటి యైనను ఇతని రచనలందు కన్పింపదనిన అతియోశక్తికాదు. యౌవనము పూర్ణ వికాసము పొందకమున్నే ఈ కవి ఈ లోకమును విడుచుట సారస్వత ప్రియుల దురదృష్టము. వ్యాధిపీడితుఁడై యుండియు నితఁడు వ్రాసిన 'మేష వాహోజ్జ్వలా' మున్నగు రచనలు మహోజ్జ్వలముగ నున్నవి. కొఱత నెరుగని ఇతని జీవితము కూడ నట్లే జరిగిపోయినది. నవ్యసాహిత్య పరిషత్సభల నిమిత్తముగ సుప్రసిద్ధ కవులైన శ్రీ శివశంకరశాస్త్రి (స్వామి శివశంకరులు), శ్రీ కృష్ణశాస్త్రి, శ్రీ విశ్వనాథ మొదలైన వారితోను, శ్రీ పింగళి కాటూరి కవులతోను వీరికి గాఢ మైత్రి యుండెడిది. ఈ కవి యాసించిన యాత్రకు శరీరము కలిసిరాలేదు. లేకున్నచో నాంధ్ర సాహిత్య క్షేత్రమున బంగారు పంటలు పండించి నేటి అగ్రశ్రేణికి చెందిన కవులలో నొకడై యుండెడివాడు. బాల్యముననే ఇంతగాచేయి తిరిగిన పనివానితనము చూపిన ఈ కవనమునకు అబ్బురపడి శ్రీ చెళ్లపిళ్లవారు వీరిని 'నీవు శ్రీ దాస శ్రీరామ పండితుని యంత ప్రతిభాశాలి వగుదువు' అని ఆశీర్వదించిరి.



# ఇటర్నల్ జీరో

శ్రీ ఆర్. ఎస్. సింగ్

సూర్యునికి సుదూరాన
గిరిగీసుకుని
పహారా యిస్తుంది—భూమి ;
అంతు తెలియని విశ్వానికి
ఆలోచనలు అగడ్తలుత్రవ్వి
వాటి నధిగమించడానికి
పస్తాయిస్తూనే
పరిభ్రమిస్తున్నాడు—మనిషి.
గతి తప్పితే విలయం
మతి తప్పితే మారణం.

మానవు డెంతటి ప్రాజ్ఞుడో
అంతటి అజ్ఞుడు—
అల్పానల్పముల సమాన ప్రతినిధి.

సర్వ జీవరాశికీ
తలమానికం మానవమేధ;
అయినా దాని కంతు పట్టనిదే
జీవితం,
అది నిర్ణయించి లేనిదే
మానవ స్వభావం.

తన్ను తాను తెలిసికొనేందుకై
యుగానుగా మనిషిపడే తపనే
జ్ఞానమయ్యింది;
పరిసరాల్ని ప్రశ్నించడమే
విజ్ఞానమయ్యింది—
జీవితం మైనస్ గవేషణ
ఈజీక్వల్టు
ఇటర్నల్ జీరో.

---

# రసగంగాధరము

శ్రీ మా. శర్మ

ఈ గ్రంధానికి వెల లేదు. పీఠికాదులు లేవు. విషయసూచిక శ్లోకానుక్రమణిక లేదు. శ్రీ శృంగేరి పీఠాధిపతుల శ్రీముఖమున్నది. రచయిత రచించిన యవతరణిక యున్నది. ఈ ధరణికోట రసగంగాధరమునకు మూలము పండితరాయ జగన్నాథ విరచిత రసగంగాధరము. ఆ సంస్కృత రస గంగాధరమున కీ రసగంగాధరము ఆంధ్రభాషా వివరణము. దీనిలో ప్రథమాననము మాత్రమున్నది. ఈ యాననమునకు ధరణికోట సద్యోజాతమని పేరు పెట్టెను. సంస్కృతమున నిట్టి పేరులు లేవు. గంగాధరుడగు పరమేశ్వరునకు పంచముఖములు కలవు. ప్రాచీముఖము తత్పురుష రూపము. దక్షిణాముఖ మఘోరము. ప్రతీచీముఖము సద్యోజాతము. ఉదీచీముఖము, వామదేవాత్మకము ఊర్ధ్వముఖ మీశాన స్వరూపము. ఇట్లొక్రమము ప్రసిద్ధము కాగా సద్యో జాతము మూడవది యగును. మృత్యుంజయ— దక్షిణామూర్తి కామేశ్వర— నీలలోహిత— భూతేశ రూపములు ప్రాచ్యాది సంగతములని తంత్రవిదుల భాష. సద్యోజాతారంభముగా శివోపాసన సంప్రదాయముండునని భావించి ధరణికోట ప్రథమాననము, సద్యోజాతమని భావించి యుండును. ఈ వివరణము "వరివస్యావివరణమని" రచయిత భావించెను. వరివస్యా రహస్యము గుర్తించినవారు వరివస్యాప్రీతి చూపుట యుక్తము.

రసగంగాధరవరివస్యా వివరణము కవి సహృదయ మూర్ధన్య శ్రీ ధరణికోట వేంకటసుబ్బయ్యసూరి విరచితమని చివరనున్నది. శ్రీ వేంకటసుబ్బయ్య తన రూపము నిట్లు నిరూపించెను.

"బుధ ప్రఖ్యుండ......ఆత్మభాషా మాధుర్య
రసజ్ఞుడన్ సుకవితో సాహిత్య సంపన్నుడన్"

అయినను పండిత రాజ శ్లోకములకు తెలుగు పద్యములు వ్రాయలేదు. అట్లు వ్రాయుటయు శక్య క్రియ కాదు. పండితరాయలక్షర తపస్వి. తెలుగు రచనలో నట్టి తపస్విత యుండదు. ధరణికోట పండితరాయల శ్లోకములనె యున్నవాని నున్నట్లుంచి తాత్పర్యము వ్రాసి సమన్వయించుట యుక్తముగ నున్నది. కొన్ని స్థలములందు కొన్ని గీత పద్యములున్నవి. అవి రచయితకె తృప్తినిచ్చి యుండవు. ఆ ప్రక్రియ గ్రంథమంతట లేకుండుట లెస్స.

ఇదివరలో,

జమ్మలమడక మాధవ రామ శర్మ పండితరాయల రసగంగాధరమును నవరసగంగాధరముగ వ్యావహారిక భాషలో రచించి ప్రథమాననము నవ్యసాహిత్య పరిషత్పక్షమున ప్రకటించెను. అటి యుదాత్త గ్రంధము వ్యావహారిక భాషలో వెలయుట యుక్తముగనె యున్నదని కలిపయ గ్రాంధిక భాషా సమాదరము కలవారు నభినందించిరి. ఈ ధరణికోట రసగంగాధరము వేదము వేంకటరాయశాస్త్రి నిరూపితభాష రీతిలో గ్రథితమయినది. ధరణికోట— "వేదాన్వయ శ్రీమద్వేంకటరాయశాస్త్రి శిష్యుడు. గురు భావమున దీని నిబంధించెను. "జగన్నాథ కవి హృదయ సార్వభౌముని కృతికావ్య మీమాంసను రసగంగాధరంబు నిట్లు సాహసించి వివరింపవలచినాడ" యని రచయిత యనెను. "ధ్వన్యాలోక భాష్యంబు.........సవ్యన్యాయ విస్పృష్టమున్ రసగంగాధరమున్ భజించి విబుధాంధ్రశ్రేణి నర్పిం"చుట రచయిత సంకల్పము. "గంగాధర వరివస్యాఖ్యంగమ నీ కృతిని గొల్తు నస్మజ్జనకున్" అని రచయిత జనకులు రామస్వామి కంకితము చేసెను.

అముద్రితములయిన ఆంధ్రరసగంగాధరము లింకను తెలుగుదేశమున గలవు. అవియు సమయమున ముద్రితములై సహృదయ సంతుష్టి సంపాదించవచ్చును. మాధవరామశర్మ నవ రసగంగాధరము సారస్వతీయ లోకమున కొక నవ్యాలోక మిచ్చినది. లోకమునకు పండితరాయల రచనా రస భావ పరిష్కార ప్రీతి యుదయించినది. నవరసగంగాధరము మరల ముద్రితమయినగాని లోకమున కందదు. ఈ సమయమున

---

* రచయిత: శ్రీ ధరణికోట వేంకటసుబ్బయ్య. ప్రచురణ: ఆంధ్రప్రదేశ సాహిత్య అకాడమి, తిలక్‌రోడ్డు, హైదరాబాదు.

నిది యావిష్కృతమగుట లోకభాగ్యము. సాహిత్య అకాడమీ ధర్మసంస్థ కాకపోయినను దీనిని ప్రకటించుట యుక్తముగ నున్నది. కార్య కార్యమున కార్ధికలాభమూ కాంక్షించు నీ కాలమున నీ కార్యమున ధరణికోట వేంకటసుబ్బయ్య కుటుంబము వారికేమేని సౌకర్యము కలుగుటయు నాకాంక్షణీయము. ఇట్లే ఇతరములును ప్రకాశితములు కావచ్చును. మాధవ రామశర్మ సంగ్రహపఱచి ప్రకటించిన ''రసగంగాధరమణి'' యందుబాటులో నున్నదికాని యది సంగ్రాహ సుందరము. ధరణికోట రసగంగాధరము వరివస్యా వివరణ సముల్లసితము. ఇదియు ప్రథమానవము. అన్యానసములు విట్లే రచితములయి యుండునేని ఇట్లే ముద్రితములయ్యెడివి. ఆంధ్రమున నవరస గంగాధరము ఉండగా నీ రసగంగాధర మేల రావలెను? నవరస గంగాధరమున నేదేని యతృప్తి కలిగియుండును. ధరణికోటయున్నచో నది స్పష్ట గోచరమయ్యెడిది. సాహిత్య దర్పణము ధ్వన్యాలోకము మొదలగునవి యాంధ్రమున వెలసినవి. వానిని ధరణికోట వ్రాయలేదు. దీనినే వ్రాసెను. అనంతరకాలమున భాషాంతరములందు వెలసిన, సంస్కృత వ్యాఖ్యాంతరము విలసితములయిన గ్రంథముల భావములన్న క్రోడీకరించుటకై యయినచో వింకను కొన్ని సంక్లప్తములు కావలెను. సాహిత్య దర్పణాదులును రావలసి యుండును. ఇదియె వచ్చినది. ఏల ? ధరణికోట చెప్పనె చెప్పెను. గంగాధర వరివస్యకై దీని రచించెను. కాని దాని దీని సంవాద విసంవాద సమీక్ష చేయుట ధరణికోటయున్నచో బాగుండెడిది. ఈ గ్రంథము ముఖపత్రమునగాని లోని పుటలలో గాని జగన్నాథ పండితరాజ నామ సముల్లేఖము లేదు. ముఖపత్రమున నయిన నున్నచో నిది పండితరాజ జగన్నాథ రసగంగాధరమను భావము కలిగెడిది. అయినను రసగంగాధర వరివస్యావతరణికలో జగన్నాథుని పేరు గలదు. గ్రంథారంభ ప్రథమ పంక్తిలో నాతని పేరు కలదు. రసగంగాధర పదమే పండితరాజుది. కొంతగా నయిన సాహిత్యశాస్త్ర లక్షణ పరిచయము కలవారు ఇది ''జగన్నాథునిదె'' యని భావింపగలరు.

ఈ గ్రంథరచయిత శ్రీ ధరణికోట వేంకటసుబ్బయ్య గ్రంథము ముద్రణము నాటికె దివంగతుడు. శ్రీ వేంకట సుబ్బయ్య సజీవుడై యుండగా నిది ముద్రితము కాలేదు. అట్లే యయినచో నిది యిట్లుండెడిది కాదు. ఉండవలసిన శోభా విశేషములతో నుండెడిది. కొన్ని విషయభాగములందు సుపరిష్కృతమయ్యెడిది. ధరణికోట తన్మాత్ర సంభావిత విశేషములతో నుండెడిది. ముద్రణమునకు పూర్వ మభిజ్ఞులు చూచిన పరిచూచుటయు జరిగెడిది. ఇప్పు డిట్లయినది. అన్యథా భావమిచ్చు ముద్రణ స్ఖాలిత్యములిందధికముగ లేవు. కొన్ని ముద్రాదోషములున్న నవి సారస్వతేయులకు సవరింపదగినవె యగును.

ఈ రసగంగాధరము డెమ్మి ఆకారమున 517 పుటల నున్నది. కావ్య ప్రకరణము—రసప్రకరణము—రసప్రకరణము(?)—గుణప్రకరణము—భావధ్వని నిరూపణము అని యిది పంచధా విభక్తమయినది. ఒక్కొక ప్రకరణము కొన్ని యధికరణమ్ముల విభాగములతో నున్నది. ఇట్టివి విభాగ మిందు క్రొత్త. మొదటి కావ్య ప్రకరణములో 4, 5 అధికరణములు లేవు. అది లోటుకాదు. సంఖ్య పొరబాటు. రెండవది రసప్రకరణము. మూడవదియు రసప్రకరణమె. ఇట్టి పొరపాటులు బాధకములు కావు. ఈ రచన వివరణాత్మకము కావున పండితరాజ పంక్తి భావము వ్యాఖ్యారూపమున వివృతమయినది. పండితరాజీయమున పండితరాజీయమును గుర్తించుటకు గ్రంథమున స్ఫుటమయిన విన్యాసములేదు. రసగంగాధర వాక్య భావ విశదీకరణమునకు వీరివస్యా రచయిత పండితరాజ ప్రాక్తన గ్రంథములలోని భావములను నిరూపించుటయే కాక తదర్వాచీనుల గ్రంథముల భావములను స్వసంభావిత భావములను నిరూపించుటకు యత్నించెను. విశ్వేశ్వర విరచిత చమత్కార చంద్రిక (అముద్రితము) క్షేమేంద్రకవి కంఠాభరణము, రసరత్న ప్రదీపిక, అలంకార మహోదధి, అభినవ భారతి, నాట్యశాస్త్రము, సాహిత్య రత్నాకరము హేమచంద్ర కావ్యానుశాసనము, భానుదత్త రసమంజరి, కావ్య ప్రదీపము, సంగీత రత్నాకరము, రసచంద్రిక, రసతరంగిణి, అచ్యుతరాయ సాహిత్యసారము, రసార్ణవము, భగవద్భక్తి చంద్రికామృతము, శృంగార తిలకము, ఆంధ్రధ్వన్యాలోకము, కావ్యడాకిని, కావ్యదర్పణము, చంద్రాలోకము, రసార్ణవ సుధాకరము, దశరూపకము, సాహిత్యదర్పణము మొదలగు గ్రంథముల యనుశీలనము వలని విశేషము లిందు గోచరించును. ఇందు కొన్ని జగన్నాథునకు పూర్వతనములు. అయిన నాతడు పరామర్శింపలేదు. వివరణమని ధరణికోట వివరించెను. అర్వాచీనములను సంవాదమునకై యట్టె చూపెను. ఇది యుక్తమె యయినను ఏది పండితరాజ సూచితమో ఏది కాదో గుర్తించుటకి గ్రంథమున నరస గంగాధర పతిశల కాధారములు కన్పడవు. ధరణికోట యున్నచో వీని నధస్సూచికలో సూచించియుండును.

పండితరాజ రసగంగాధరముపై నాగేశుని వ్యాఖ్యానమ్ము మొదటి వ్యాఖ్యానముగ ముద్రితమై యందుబాటులోనికి వచ్చినది. నాగేశుడు వ్యాకరణవిబుధుడు. సాహిత్యలక్షణ గ్రంథమును సాహిత్యవాసిత హృదయముతో నాతడు వ్యాఖ్యానించినట్లభిజ్ఞులు భావింపరు. జయపురమునందున్న మంజునాథశాస్త్రి వ్యాఖ్యాన మీ మధ్యకాలమున వ్యాపించినది. ఇంకను విశదీకరణ

మావశ్యకమని భావించిన బదరీనాథ ఝా పండితుడు విస్తృతముగా వ్యాఖ్యానించెను. మదనమోహన ఝా పండితుడు హిందీ యనువాదము కూర్చెను. ఈ రెండిటి కలయికతో రసగంగాధరము కొంతగా ముద్రిత మయినది. ఇప్పుడిప్పు డది వ్యాపించుచున్నది. ఈ సమయమున నీ ధరణికోట గ్రంథము వచ్చినది. బదరీనాథ మదనమోహనులు రూపించిన రీతి మనసునకు నచ్చినదని ధరణికోట యిట్లు దీని రచించెను. అందలి కొన్ని క్లిష్ట శాస్త్రీయ రీతులను ధరణికోట విడిచి వివరణోపయోగి విషయ సంగ్రహమున దీని నిట్లు విస్తరించెను. అందలి ఝా హిందీ అనువాదమును కూడ యథోచితముగనె యీ రచయిత యనుసరించెను. మహారాష్ట్ర భాషలో ప్రథమాననము వెలువడినది. అందలి భావములను ధరణికోట యిందుల్లేఖించెనని నేను భావించుటలేదు. పురుషోత్తమ చతుర్వేది హిందీ యనువాదమును సహకరించి యుండును. ఇట్లనేకముల సమీక్షించి ధరణికోట ఈ గ్రంథము నిట్లు సంతరించియుండును. ధరణికోట ద్వితీయాననములోని భాగమును గూడ కొంత వ్రాసియుండును. ధరణికోట వ్రాయని భాగమును ఝా గ్రంథానువాదముగ నెవరయిన వ్రాయవచ్చును. ఆ వ్రాయువారు రసగంగాధరమును సంప్రదాయపద్ధతిలో చదివినవారును జిజ్ఞాసువులకు పాఠ ప్రవచనముచేసినవారు నయినచో బాగు. ఇంకను రసగంగాధర పూరణమునకు కావలసిన సామర్థ్యము కలవారు కావలయు ననుట జగన్నాథ ప్రియుల కభీష్టము కావచ్చును.

జగన్నాథ రసగంగాధరమున నసాధారణమగు వైశిష్ట్యమున్నది. అలంకారతంత్రము స్వతంత్ర తంత్రమని పండితరాజనెను. ఆ నిర్ణయమున విషయనిర్వచనము కావించెను. సర్వము నవ్య న్యాయ నిష్కృష్ట మొనరించెను. అట్టి న్యాయ శాస్త్రీయాంశముల విశదీకరణమునకు శ్రీ ధరణికోట యమంద శ్రద్ధ వహించెను. ఆంధ్రభాషలో న్యాయ శాస్త్రీయ న్యాయ నిరూపణమునకు గల పరిమిత సౌకర్యము వివరణమునకు తగినంతగా సహకరింపకపోవుటయందును స్పష్టమయినది. విషయక్లేశమును తగ్గించుటకు శంకా సమాధానములను కూర్చి ధరణికోట శ్రమపడెను. ఆ శ్రమఫలమును పాఠకు లందుకొనుట యుక్తము.

శాస్త్రీయమయిన విషయనిరూపణమున రచయితకు గలుగు క్లేశమును సమీక్షాయత్నా లిట్లు గుర్తించుట యావశ్యకము. భావధ్వని ప్రసంగమున రసగంగాధరమున నిట్లున్నది. "అథ భావధ్వ నిర్నిరూప్యతే। అథకిం భావత్వం ? విభావానుభావ భిన్నత్వే సతి రస వ్యంజ కత్వ మితిచేత్, రసకావ్య వాక్యేఽతి వ్యాప్త్యాపత్తేః। అర్థ ద్వారా శబ్దస్యాపి వ్యంజకత్వాత్। ద్వారాంతర నిరపేక్షత్వేన వ్యంజకత్వే విశేషితేత్వసంభవః ప్రసజ్యేత। భావస్యాపి భావనా ద్వారైవ వ్యంజ కత్వాత్। భావనాయామతి వ్యాప్త్యాపత్తేశ్చ" అని మూలము. "శబ్దము నర్థద్వారమున రసవ్యంజకము కావున, "విభావానుభావ భిన్నము రసవ్యంజకము భావము" అనినచో రసకావ్య వాక్యమున నతి వ్యాప్తి కలుగును. భావమున్న భావనాద్వారముననె వ్యంజకము కావున, "ద్వారాంతర నిరపేక్ష పేక్షముగా భావము వ్యంజకము" అనినచో నసంభవ దోషమ్ము ప్రసక్తమగును. భావనలో నతి వ్యాప్తియు గలుగును." అని పై మూలమునకు సూత్రాంధ్రము. 361 పుటలో పరివస్యా వివరణమున నిట్లున్నది. "రసధ్వని నిరూపణానంతరము ఇక భావధ్వని నిరూపింపబడును. మఱి భావ మననేమి ? బహులక్షణములు కలవు. పర్యాలోచనీయములు. (౧) అందొకటి. "విభావానుభావ భిన్నమై ఏది రసవ్యంజకమగునో అది భావము" అని ఈ లక్షణము. ఈ లక్షణము సరికాదు. రస ప్రతిపాదక వాక్యము (శబ్ద సముదయము) నందు దీనికి అతివ్యాప్తి ఆపన్నమగును. (శం) సరి అర్థము రసవ్యంజకమగును. శబ్దము రసవ్యంజకము కాదు కదా ! దానియందు అతివ్యాప్తి యెట్లు? (సమా) అర్థము సాక్షాత్తుగా రసవ్యంజకము. అర్థద్వారమున (పారంపర్యముగ) శబ్దము సైతము రసవ్యంజకము.

"శబ్దబోధ్యో వ్యనక్త్యర్థః, శబ్దోప్యర్థాంతరాశ్రయః
ఏకస్య వ్యంజకత్వే, తదన్యస్య సహకారితా."

శబ్దబోధ్యమగు నర్థము రసవ్యంజకము. శబ్దము సైతము అర్థాంతరమునకు ఆశ్రయము. ఇందొకటి సాక్షాద్వ్యంజకమగునప్పుడు ఇందొకటి సహకారి కారణమగును. అను నభియుక్తోక్తిచే బట్టి శబ్ద సహకారి కారణము (సహకారి వ్యంజకము) అగును.

ఇట వాస్తవ మారసినచో వాచ్యార్థ బోధకము లయినను గీతాది శబ్దములు రసవ్యంజకము లగునని ధ్వనికారాదుల యభిప్రాయము. అందుచే అర్థ ద్వారముననె (పారంపర్యముగనే) శబ్దము రసవ్యంజకము కానక్కఱలేదు. కాని, ఎట్లయినను ఇట అతివ్యాప్తి తప్పదు.

ఇత్యాదిగా వీ రచన సాగినది. ఇట్లు ధరణికోట ఏల వ్రాసెను. బదరీనాథ ఝా, మదనమోహన ఝాలు కాశీముద్రణమున సంస్కృత—హిందీ రచనలో నిట్లు వ్రాసిరి. వీరును వ్రాసిరి. "అర్థద్వారా శబ్దస్యాపి వ్యంజకత్వాత్" అను పండితారాజ వాక్య వ్యాఖ్యారూపమున ఆ ఝాలు—శబ్దబోధ్యో వ్యనక్త్యర్థః—అను మమ్మట కావ్య ప్రకాశగతకారిక నుల్లేఖించిరి. వీరు లిఖించిరి. తదర్థ కథనమున (362 పుట) "శబ్దము సైతము అర్థాంతరమునకు ఆశ్రయము"—"వాచ్యార్థ బోధకములైనను గీతాది శబ్దములు"—అను ధరణికోట వాక్యముల

కొంతగా నన్యథా యున్నను ఝా మూలకత విశదము—అధీత రసగంగాధరులను పట్టునట్టి యిట్టి పట్టులు కొన్ని యున్నవి. ధరణికోట రసగంగాధరము తెలియగోరువారు బోధకుని బోధన మునబోధ్యము చేసికొనవచ్చును. ధరణికోట పునరనుసంధానము చేయదలచెను. కాలపురుషుడు కుదరనీయలేదు. అట్లే చేయ దలచినది చేసెనేని రససూత్ర వివరణమునకు రస్యస్వరూప మేర్పడెడిది. కతిపయ గ్రంథ గత శ్లోక వాక్యానువాదములు తగ్గెడివి.

ధరణికోట పద్యరచనా ప్రగల్భుడయినను పండితరాజ పద్యములకు పద్యములు వ్రాయరాదని భావించి యుండును. ఇతరుల కొన్ని పద్యములను తెలుగు పద్యములుగ హేలగా తేట గీత శీలగా మార్చెను. ధరణికోట కవి సహృదయ మూర్ధన్యు డయినను సుకవితా సాహిత్య సంపన్ను డయినను తన పద్యము లలో నట్టి కైత దుక్కి (కవితా వ్యవసాయము) చూపలేదు చూడుడు 227 పుట.

కయిని నుత్ఫణ ఫణిరాజ కంకణంబు
కన్నె యుజ్జ్వల దనలంబు, కంఠముగా
కాలకూటిత కుటిలంబు, చేలమజిన
మగజ మద్వర వేష హృష్టాత్మ కాదె !

ఈ పద్య భావమునకు మూలమయిన హేమచంద్రుని కావ్యానుశాసన గత శ్లోకము ఈ గీతపద్య పదబంధములో నుండ దలచలేదు. ఇట్లె కొన్ని యున్నవి. పండితరాజ పద్యములక్క ధరణికోట పద్యములు లేవు. ఇదియె ధరణికోట అభీష్టమని భావింతును.

రసము స్వశబ్దబోధ్య మయినచో వమనాఖ్య దోషమ్ము వాటిల్లునని పండితరాయ లనెను. ఈ విషయమును విస్తరించి 255 పుటలో—స్వశబ్ద వాచ్యమైన మాత్రాన దోష ప్రసక్తి లేదని వేదాల తిరువేంగళాచార్య ధ్వన్యాలోక ప్రామాణ్యము నాస్థతో ధరణికోట నిరూపించెను. ఇట్లె కొన్ని కొన్ని స్థలము లందు పండితరాయల భావము కాదనుటకు ఇతరుల బల మును తన బలమునకు బలము చేసికొని ధరణికోట నిరూ పించెను. రౌద్రరస ముదాహరించి మహోద్ధత వృత్తి ఓజ స్వితను పోషించునని—"కృతమను మతం దృష్టం వాయై రిదం గురుపాతకం"—అను వేణీసంహార పద్యమున రౌద్రరస వ్యంజన క్షమమయిన వృత్తి లేదని, యది కవి యశక్తియని పండితరాజు భావించెను. ఈ భావమును ధరణికోట సవరించ టకు ధ్వనికారు నడ్డుపెట్టెను. ఇట్లె యీ గ్రంథమున గొన్ని కలవు. వాని విచార క్షమత సందేహస్థానము. కాని యిట్టి విమర్శన మొనరించుట విశిష్టతాద్యోతకమని భావింతుమేని యీ విశిష్టతయందు గలదనవచ్చును. ఇట్టి వన్నియు నట్టే యుండజాలవనుట వేరు విషయము.

ధరణికోట కాంగ్లీ ప్రియత్వ మున్నది. ఆ వివేకోల్లాస మున విశకలిత విధానమునకు యత్నించెను. రసాభాస స్వరూప విచారమున చాలన మొనరించి రచయిత తెలుగు గ్రంథ గతము లను పరిశీలించెను. "ప్రతాపరుద్రీయమున ఎర్లి పేరయ్యలది శృంగారము కాని తదాభాసము కాదు" 479 పుట. అని యని తన గురుభక్తి ప్రకటించుకొనెను. ఇట్టి గ్రంథమున సాహితీ ధర్మములు సమీక్షింపదగిన యంశము లున్నవి. అన్నిటి యుల్లే ఖము పృథక్ సృష్టి యగును. శ్రీ ధరణికోట వేంకట సుబ్బయ్యగారు సజీవులై యుండగా నీ గ్రంథము సుముద్రిత మయినచో పాఠకలోక మితోధిక సాహితీ సంపల్లాభ భాజన మయ్యెడిది. అంతయు ముద్రితమయిన నింక నది కల్గెడిది. ఇప్పటికయిన పాఠకులు సంతుష్టిపడుట కవకాశమును అకా డమి కలుగజేయుట యుక్తముగ నున్నది. ఇట్టి కార్యమున నింకను సావధానత యుక్తమని నే ననుటయు యుక్తముగ నున్నది. అస్తు.



# షడ్బలానంతరము

## శ్రీ దివాకరుని వెంకటసుబ్బారావు

జ్యోతిష శాస్త్రరీత్యా జాతకులు క్రమవిధానమున తమకు ప్రాప్తించు ఫలముల నరయుటకు గ్రహముల షడ్బలములు, భావముల బలములు శాస్త్రరీత్యా నెరుగుట ప్రధానమను విషయము సర్వఋషి సమ్మతము. ఈ బలప్రాప్తి నెరుగుటకు శ్రీపతి, కేశవ దైవజ్ఞుడు, శ్రీధరుడు, గార్గి, దేవలుడు, వరాహమిహిరుడు, కళ్యాణవర్మ, జీవశర్మ దామోదరుడు, గుణాకరుడు, కాళిదాసు, భట్టోత్పలుడు, సత్యాచార్యుడు, మంత్రేశ్వరుడు, ఉత్పలుడు, దివాకర దైవజ్ఞుడు మొదలగువారు వివిధ పద్ధతుల దెలిపియున్నారు. ఇందు శ్రీపతి పద్ధతి, కేశవ పద్ధతి, దివాకర సిద్ధాంతము ప్రజల మన్నన పొందుటే కాక ప్రధానములుగా పరిగణింపబడుచున్నవి. శ్రీపతి పద్ధతి గణితమందు క్లిష్టము. కేశవ పద్ధతియందు గణిత భాగము కొంతవరకు సూక్ష్మీకరింపబడినది. దివాకరుడు దానిని విశదీకరించుటే గాక సులభమార్గమును చెప్పియున్నాడు. పై నుదహరింపబడిన వివిధ మార్గముల ననుసరించి సాధించు బలములు సమానముగా నున్నవి. గాన దివాకర పద్ధతి సులభమైనందున ఆచరణీయము. క్లిష్టమైననూ శ్రీపతి పద్ధతి పెక్కు పండితులచే అనుసరింపబడుచున్నది. ఇందులకు కారణము దివాకర సిద్ధాంతము ఎక్కువగా ప్రచురింపబడకుండుటయే కారణమై యుండవచ్చును. శ్రీపతి పద్ధతి ప్రచురించిన గ్రంథకర్తలు ఇతర పద్ధతుల చెప్పియుండకుండుట మరొక కారణమై యుండవచ్చును. శ్రీపతిచే చెప్పబడిన మూల గ్రంథ అనువాదమందు కేశవ, దివాకరుల పద్ధతుల గూర్చి అనేక మార్లు చెప్పియుండుటే గాక ఈ పద్ధతులు క్రమముగా నున్నవని 1957 సంవత్సరమున పండిత భూషణ శ్రీ సుబ్రహ్మణ్యశాస్త్రిగారు దెలిపియున్నారు. ఈ గ్రంథము బలసాధన క్రమమునకు ప్రధానమని గ్రహింపవలెను. దివాకర సిద్ధాంతము ఇంతవరకు పుస్తకరూపము నొందకుండుట వేరొక కారణము. ఆంధ్రదేశమందు ఈ లోటు పూర్తిచేయుటకు దివాకర సిద్ధాంతమును నేను వ్యాసరూపమున ప్రచురించుచున్నాను. ఈ సిద్ధాంతరీత్యా జ్యోతిషాభిమానులు జాతకముల పరిశీలించి ఫలముల నొందగలరని విశ్వసించుచున్నాను.

ప్రథమమున జాతకుని జననకాలమును శాస్త్రరీత్యా నిర్ధారణ చేయవలెను. అనంతరము గ్రహముల స్ఫుటమును, భావముల స్ఫుటమును సాధింపవలెను. పరాశర శాస్త్రము ననుసరించి భావచక్రమును, షోడశవర్గుల చక్రముల నేర్పరుపవలెను. నవగ్రహములలో ఆయా లగ్నములకు శుభులను, పాపులను, సములను నిర్ణయించి వారల సహజ మిత్రత్వ, శత్రుత్వాదులతో తత్కాల స్థితి సమన్వయము జేసి అధిమిత్ర, మిత్ర, సమ, శత్రు, అధిశత్రుత్వాది సంబంధముల నిర్ణయింపవలెను. అనంతరము గ్రహభావ బలసాధన నొనర్పవలెను. జననకాల నిర్ణయమందు ఆయా స్థలముల సూర్యోదయ, సూర్యాస్తమయాది కాలముల అక్షాంశ, రేఖాంశల ననుసరించి నిర్ణయించుట ముఖ్యము. పై గణితభాగమందు లోపము లుండిన బలసాధనమందు పొరపాట్లు జరుగును గాన సర్వ హంశములు క్రమముగా నిర్ణయింపవలెను.

### షడ్బలములు : వాని భావము

గ్రహముల బలనిర్ణయము ఆరు విధములు. వీని సముదాయక బలమును షడ్బలమందురు. ఇవి స్థానబలము, దిగ్బలము, కాలబలము, చేష్టా బలము, దృష్టిబలము. స్థానబలమందు ఉచ్చబలము, సప్తవర్గజబలము, ఓజయుగ్మరాశ్యంశబలము, కేంద్రాది బలము, ద్రేక్కాణబలము అనునవి 5 విభాగములు. అట్లే కాలబలమందు నతోన్నతబలము, పక్షబలము, త్రిభాగబలము, అబ్ద, మాస, వార, హోరా, ఆయన, యుద్ధబలము అనునవి విభాగములు. ఈ క్రమమున బలసాధన చేయు విధానము బృహత్పరాశర హోరా ఉత్తరకాండయందు చెప్పబడినది. దానిని మరల కాళిదాసు ఉత్తర కాలామృతమందు, కేశవ దైవజ్ఞుడు కేశవ జాతకమందు చెప్పియున్నారు. శ్రీపతి ఈ విధానమును విశదీకరించి శ్రీపతి పద్ధతి యను బలసాధన క్రమమును దెల్పి

యున్నాడు. బలసాధన క్రమము అనేకులు విపులముగా తమ తమ గ్రంథములందు చెప్పియున్నారు గాన ఈ విషయమును గణితభాగమును మరల చెప్పక ఇందలి భావమును విశదీకరించుచున్నాను. శ్రీపతి పద్ధతి రీత్యా బలసాధన మొనరించిన గ్రహముల వాస్తవికశక్తి విశదమగును. జాతకములందలి గ్రహ, భావముల బలమెరిగినగాని ఫలముల తారతమ్యత గమనింప వీలుగాదు. అందుచే బలసాధన ముఖ్యాంశము. ఇట్లు బల సాధన చేయక ఫలముల నరయుటచే వాని పరిమితి తెలియక పోవుటయే గాక ఫలములు అనుభవనీయములగుటకు కూడ ఆటంకము లేర్పడుచున్నవి. గాన బలసాధన ముఖ్యమని గ్రహింపవలెను.

ఖగోళమందలి గ్రహముల చేష్టలు భువి యందు మానవుల చేష్టల ననుసరించి యుండును. వివిధ పరిస్థితులందు మానవులలో ఎట్టి మార్పులు గాన్పించుచున్నవో అదే క్రమమున గ్రహముల చర్యలందు మార్పులున్నవి. స్వస్థానమందు సర్వైశ్వర్య సంపన్నులగు మానవులు ఎట్లు సుఖించుచున్నారో అట్లే గ్రహములు కూడ సుఖావస్థ నొందుచున్నవి. తమ తమ నెలవులు తప్పిన వానికి కూడ కొన్ని మార్పులు ప్రాప్తించును. ఒక గ్రామకరణము మరియొక గ్రామమునకు వెట్టియేసు సామెత ననుసరించి స్థానభ్రష్టులైన గ్రహములు కూడ నీచావస్థ నొందుటయందాశ్చర్యములేదు. మానవుల గృహములు అనేకరీతుల నున్నవి. భాగ్యవంతులు వేసవికాలమందు ఉన్నత ప్రదేశముల నివాసము లేర్పరచుకొనుచున్నారు. లేదా తమ స్వస్థానములందు అనేకవిధములగు కృత్రిమ సాధకముల సహాయ్యమున సుఖముల బడయుచున్నారు. అది లేనివారు విశాలమగు తావుల గృహముల నిర్మించుకొని చల్లనిగాలి కొరకు తోటల పెంచుకొని సుఖించుచున్నారు. ఇదిగాక తమ మిత్రుల స్థానములందు కొంత సుఖము బడయుచున్నారు. అట్లే గ్రహములు కూడ ఉచ్ఛ, మూల త్రికోణ, స్వక్షేత్ర, మిత్ర క్షేత్రములందు సుఖించుచున్నవి. సమక్షేత్రములందు శత్రుబాధలేక ఆదరణ తక్కువైననూ మానవులు కాలము గడుపు రీతి గ్రహములు యున్నవి. కాలవశమున శత్రుస్థానము లందు గాని ఇతర దుఃఖపూరితమగు స్థానములందు గాని మానవులు కాలము గడుపవలసి వచ్చిన ఎట్లు మనోవ్యథ నొందుదురో అట్లే గ్రహములు శత్రు, నీచ, అస్తంగత్వ స్థానములందుండుట సహజము. భాగ్యవంతుల కుటుంబములందు, ఉన్నతాధికారుల కుటుంబములందు, జనన మొందువారు పుట్టుకతో కొంత భోగముల, అధికారముల ననుభవించు రీతి గ్రహములు కూడ జాతకములందు ఉచ్ఛ, మూలత్రికోణ స్థానగతులై నపుడు అనుభవించుచున్నవి. బీదలు కుటుంబములందు, హీన జాతి కుటుంబములందు జనన మొందినవారు బాల్యమునుండి ఎట్లు కష్టములకు గురియగుచున్నారో అట్లే గ్రహములు నీచ అస్తంగత్వములందున్న బాధల నొందుచున్నవి. సర్వైశ్వర్య సంపన్నులు ఇతరులకు సహాయ్యముచేయ సమర్థులు. బీదలకు అట్టి మనోభావము ఉన్ననూ అశక్తులగుచున్నారు. అట్లే గ్రహములు కూడ నున్నవి. మిత్రులయందున్న గాని మిత్ర రక్షణయందున్నగాని మానవులు సుఖింతురు. శత్రువుల బారి నడినవారు ఎంత ఉన్నతాశయములు గలవారైననూ కష్టములకు లోనగుచున్నారు. అట్లే మిత్రయుతి, వీక్షణగల గ్రహములు, శత్రుయుతి వీక్షణగల గ్రహములు క్రమముగా సుఖ దుఃఖముల పాలగుచున్నవి. ఇట్టి సామ్యము అనేకము గలవు. వీని విచక్షణ షడ్బల రూపమున చెప్పబడినది. షడ్బలమందు ఈ అంశములన్నియు విచారించి గ్రహబల నిర్ణయముచేయు విధాన మున్నది. గాన షడ్బల సాధన ముఖ్యమైనది.

నైసర్గిక బలము—గ్రహములు మానవులవలె స్థిరమగు జన్మబలము గలవి. మానవు లందరూ జననకాలమందు ఒకే విధమున జన్మించుచున్నారు. జననానంతరము కాలానుగుణ్యమగు స్థితులకు లోనై వివిధ రకముల అనుభవము పొందుచూ మార్పు నొందుచున్న విధమున ప్రథమమున గ్రహములు తమ సహజస్వభావముల, శక్తుల గోల్పోవుటలేదు. గాన నైసర్గిక బలము ఎల్ల జాతకులకు సమానము. ఇందు గ్రహరాజగు రవి ఇతర గ్రహములకన్న శక్తివంతుడు. తరువాత రాణిగా భావింపబడు చంద్రుడు బలవంతుడు. మంత్రులగు శుక్ర గురులు వాని తర్వాత యువరాజగు బుధుడు, తదుపరి సేనాపతియగు కుజుడు, చివరకు సేవకుడగు శని క్రమమున బలవంతులు. రాజునకు 1 రూపము బలమని నిర్ణయించిన పై జెప్పబడిన క్రమమున శనికి 1/7 రూపము బలము ప్రాప్తించుచున్నది. ఇది సహజస్థితి. ఇందు మార్పులేదు.

స్థాన బలము—జననకాలమందు గ్రహముల స్థితి ననుసరించి ఈ బలముండును. స్థానమనగా గ్రహము జనన కాలమందున్న రాసి. పై జెప్పబడిన విధమున ఉచ్ఛ, మూలత్రికోణ, స్వక్షేత్ర, మిత్రక్షేత్ర, శత్రుక్షేత్ర, నీచ, స్థానములందున్న మానవులవలె గ్రహములు కూడ క్రమమున బలహీనులగుట సహజము. ఉన్నత వంశములందు, ధనికుల కుటుంబములందు ఉన్నతాధికారుల గృహములందు జనన మొందినవారు జన్మతో కొంత శక్తి సామర్థ్యముల గలిగియుండు విధమున గ్రహములు జననకాలమందుండు స్థాన స్థితిచే కొంత శక్తి గలిగి యుండుటయో లేదా శక్తిహీనములగుటయో ప్రాప్తించుచున్నది. ఇందు ఉచ్ఛబలము తెలిసిన విషయము. సప్తబలము అనగా

# షడ్బలానంతరము

రాశిని 7 విధముల పరిశీలించి అందు గ్రహమునకు ప్రాప్తించు సాముదాయకబలము. ఇచ్చట గ్రహముల మిత్రత్వ, శత్రుత్వ, సమత్వము దెలిసినగాని ఈ విధానము తెలియదు. గ్రహముల మిత్ర, శత్రు, సమ సంబంధములు అన్ని జ్యోతిష గ్రంథములందు చెప్పబడి యున్నవి. ఇవి ఎట్లు ప్రాప్తించినవో లేక వీనిని ఎట్లు ఋషులు నిర్ణయించిరో విచారింతము. నైసర్గిక మిత్ర, శత్రు, సమత్వ స్థితులలో మార్పులేదు. ఇందు రవి, చంద్ర, కుజ, గురులు ఒక పక్షమును శుక్ర, బుధ, శనులు రెండవ పక్షమున నున్నారు. గ్రహములు ఉత్తమజాతికి చెందినవని, (Superior) హీనజాతికి (Inferior) చెందినవని రెండు విభాగము లున్నవి. ఇందు బుధ, శుక్రులు హీనజాతివారని, కుజ, గురు, శనులు ఉత్తమజాతి వారని ఋషులు నిర్ణయించినారు. భూమికి రవికి మధ్యనున్న బుధ, శుక్రులు హీనులని, భూమికి బయటనున్న కుజ, గురు, శనులు ఉత్తములని భావన.







రవి దగ్గరగా నుండు గ్రహము బుధుడు, అతని తరువాత శుక్రుడు, అనంతరము భూమి. భూమి ననుసరించియుండు ఉపగ్రహము చంద్రుడు. రవి భూములకు మధ్య శుక్ర, బుధు లున్నారు గాన వారు హీనజాతివారైరి. భూమికి సంబంధించక బయట క్రమముగా కుజ, గురు, శను లున్నారు. వీరు ఉత్తమజాతివారు. ఈ నిర్ణయము గ్రహములు భూమినుండి యున్న దూరములకు పోల్చిన సరిపోవును. భూమి భ్రమణము, పరిభ్రమణము యను రెండు విధములగు చలనములు గలిగి యున్నది. పరిభ్రమణమందు ముందు కుజుని, క్రమముగా గురుని, శనిని, బుధుని, శుక్రుని చేరి తదుపరి తన స్వస్థానమును చేరుచున్నది. భూమితో సంబంధములేక స్వశక్తితో చరించు గ్రహములు ఉత్తములగుట సహజము. భూమి నాధారము చేసుకొని చరించు శుక్ర, బుధులు హీనులగుటయం దాశ్చర్యములేదు. రవి నాధారము చేసికొని కాంతినొందు చంద్రుడు ప్రథమమున కుజ, గురుల చేరి తదుపరి శని, బుధ, శుక్రులను చేరుచున్నాడు. గాన ప్రథమమున చేరు కుజ, గురులు చంద్రునితో కూడి రవికి మిత్రులగుచున్నారు. బుధుడు సముడై, శుక్ర, శనులు శత్రువులగుచున్నారు. ఒక పక్షమునకు చెందినవారు పరస్పర మిత్రులు. రెండవ పక్షమువారు పరస్పర మిత్రులై ప్రథమపక్షము వారికి శత్రువు లగుచున్నారు. ఇది ఒక భావము.

ఖగోళరాసుల విభజన పరిశీలించిన ఈ విభజన కూడ గ్రహదూరములమీద నాధారపడియుండుట విశదము. రవి స్థానమగు సింహమే భూస్థానమని భావించిన భూమికి ఉపగ్రహమగు చంద్రునకు రవికి ప్రక్కనున్న స్థానమేర్పడినది. రవికి అత్యంత సమీప గ్రహమగు బుధుడు ప్రక్కనున్న రెండు స్థానములను, తదుపరి క్రమముగా శుక్ర, కుజ, గురు, శనులు తమ తమ స్థానముల నొందియున్నారు. అత్యంత దూరమున నున్న శనికి రవినుండి దూరమగు మకర, కుంభములు స్థానము లగుట సహజము. ఈ రాసులు స్త్రీపురుష రాసులని, బేసి, సమరాసులని, అగ్నితత్వ, భూతత్వ, వాయుతత్వ, జలతత్వాది అనేక విభాగములకు చెందియున్నవి. రవి అగ్నితత్వ రాసికి అధిపతియగు పురుషగ్రహము. పురుషునకు స్త్రీ సన్నిహితము గాన చంద్రునికి రవి ప్రక్కన యున్నాడు. గాన రవి చంద్రులు మిత్రులైనారు. పురుషులు పురుషస్నేహమును వాంఛించుట సహజము. అందు తమ స్వభావము గలవారిని స్నేహితులుగా కోరుదురు. అట్లే అగ్నితత్వరాసుల కధిపతులకు కుజ, గురులు వీరికి మిత్రులైనారు. అందు కుజుడు అగ్నితత్వ గ్రహమగుట గమనింపవలెను. రవికి మిత్రుడైన చంద్రుడు

జలతత్త్వ సమరాసి కధిపతి. గాన జలతత్త్వ సమరాసుల కధిపతులగు వృశ్చిక, మీన నాథులగు కుజ, గురులు చంద్రునకు సన్నిహితులైనారు. గాన రవి, చంద్ర, కుజ, గురులకు స్నేహమేర్పడినది. అట్లే బుధుడు భూతత్త్వ సమరాసికి, వాయుతత్త్వ బేసి రాసికి అధిపతి. శుక్రుడు భూతత్త్వ సమరాసికి, వాయుతత్త్వ బేసిరాసికి యధిపతి, శని భూతత్త్వ సమరాసికి, వాయుతత్త్వ బేసి రాసికి యధిపతి. గాన వీరల మిత్రత్వము సమంజసము. అగ్ని తత్త్వరాసులు క్షత్రియజాతికి చెందినవి. జలతత్త్వరాసులు బ్రాహ్మణజాతికి చెందినవి. గాన వీరలకు యధిపతులగు రవి, చంద్ర, కుజ, గురులు మిత్రులైనారు. వైశ్య, శూద్ర జాతులకు చెందిన రాశ్యాధిపతులకు శుక్ర, బుధ, శనులు మిత్రులైనారు. రవి, చంద్ర, కుజ, గురులు 6 రాసులకు, బుధ, శుక్ర, శనులు 6 రాసులకు ఆధిపత్యము లవారు గాన భచక్ర విభజనయందు ఏ పక్షమునకు ఆధిక్యత ప్రాప్తింపలేదు. పై హంశముల ననుసరించి వీరల మిత్ర శత్రుత్వములు సహజములు.

గ్రహముల మూల త్రికోణ స్థితిచే మిత్రత్వాది సంబంధము నిర్ణయించవలెనని పరాశరులు చెప్పుతున్నారు. ఏ గ్రహమునకైనను తన మూల త్రికోణమునుండి 2, 4, 5, 8, 9, 12 స్థానాధిపతులు మిత్రులని, 3, 6, 7, 10, 11 స్థానాధిపతులు శత్రులని వారి యభిప్రాయము. ఒకవిధమున మిత్రుడై రెండవ విధమున శత్రుడైన గ్రహమును సమునిగా భావింపవలెనని చెప్పియున్నారు. కుజుడు అగ్నితత్త్వ పురుషరాసియగు మేషమును మూల త్రికోణముగా గ్రహించినాడు. ఇతడు అగ్నితత్త్వ పురుషగ్రహము గాన ఈ స్థితి సహజము. రవి తన స్థానమగు అగ్నితత్త్వ పురుషరాసియగు సింహమును మూల త్రికోణముగా భావించియున్నాడు. రవికి అత్యంత సమీప గ్రహమగు బుధుడు రవి ప్రక్కనయున్న తన భూతత్త్వరాసియగు కన్యను మూల త్రికోణ స్థానముగా స్వీకరించినాడు. శుక్రుడు రవి, బుధులకు అత్యంత సమీప గ్రహమైనందున తుల వానికి మూలత్రికోణ స్థానమైనది. పురుషరాసియగు ధనస్సు పురుషగ్రహమగు గురునకు మూలత్రికోణమైనది. ఆకాశతత్త్వరాసులు భచక్రమందు లేనందున ఇతడు తన మిత్రులగు రవి, కుజుల తత్త్వయుతమగు అగ్నితత్త్వ పురుష రాసిని మూల త్రికోణముగా గ్రహించినాడు. వాయుతత్త్వ గ్రహమగు శని వాయుతత్త్వ బేసిరాసియగు కుంభమును మూల త్రికోణముగా స్వీకరించినాడు. చంద్రుడు, జలతత్త్వ స్త్రీ గ్రహము, భూమికి ఉపగ్రహము, రవికి సన్నిహితుడు గాన ఖగోళమందు రవి ఉచ్ఛ స్థానమునకు సమీపమందున్న జలతత్త్వ గ్రహ శుక్రరాసియగు భూతత్త్వముగల వృషభమును మూల త్రికోణమే గాక ఉచ్ఛ క్షేత్రముగా కూడ గ్రహించినాడు. గ్రహముల ఉచ్ఛక్షేత్రముల నిర్ణయమందు క్రమ విధానము తెలియుటలేదు. రవి, పురుష గ్రహము, అగ్నితత్త్వము గలవాడు, పురుష క్షత్రియరాసి కధిపతిగాన పురుషక్షత్రియ అగ్నితత్త్వరాసియగు మిత్ర కుజ క్షేత్రమున ఉచ్ఛనొందుట సహజము. అట్లే చంద్రుడు స్త్రీ గ్రహము, స్త్రీ రాసి కధిపతిగాన స్త్రీ రాసి, స్త్రీగ్రహ క్షేత్రము, భూమి స్థానము, రవి ఉచ్ఛక్షేత్రమునకు సమీపమందున్న వృషభము నుచ్ఛగా స్వీకరించినాడు. బుధుడు తన మూల త్రికోణమగు కన్యయందు ఉచ్ఛ నొందుచున్నాడు. శని వాయుతత్త్వ పురుషరాసి కధిపతిగాన, వాయుతత్త్వ పురుష రాసియైన తన మిత్ర క్షేత్రమగు తులయందుచ్ఛ నొందుట సహేతుకముగ నున్నది. కుజ, గురు, శుక్రుల విషయమందు మార్పు గలుగుచున్నది. గురుడు పురుష గ్రహమై ఆకాశ తత్త్వము గలిగి అగ్ని తత్త్వ పురుష రాసి కధిపతియై, జలతత్త్వ స్త్రీ రాసియగు చంద్ర నక్షత్రమును ఉచ్ఛగా స్వీకరించుట విశేషము. అట్లే శుక్రుడు శత్రువగు గురుక్షేత్రమును, కుజుడు శత్రువగు శనిక్షేత్రమును ఉచ్ఛస్థానములుగా నేర్పరచుకొనుట మరియొక విశేషము. ఇందు కుజ మూలత్రికోణ స్థానము లన్నియు బుధ చంద్రులను తప్ప బేసిరాసులు. ఉచ్ఛ స్థానములు రవి శనులకు తప్ప సమ రాసులు. ఇందలి విశేషముల నక్షత్ర రూపముల తెలుపు వ్యాసమందు విశదీకరింపగలను.

రవికి మూలత్రికోణ స్థానమగు సింహము నుండి 2, 4, 5, 8, 9, 12 స్థానాధిపతులగు బుధ, కుజ, గురు, చంద్రులు మిత్రులని భావింపవలెను. అందు 11వ స్థానాధిపతి బుధుడైనందున శత్రువైనాడు. ఒక పక్షమున మిత్రుడై రెండవ పక్షమున శత్రువగుటచే ఇతడు రవికి సముడు. ఈ విధముగ విచారించిన పరస్పర మిత్రత్వము గానరాదు. చంద్రునకు బుధుడు మిత్రుడు గాని బుధునకు చంద్రుడు శత్రువైనాడు. ఇట్లనేక భేదములు గాన నగును. గాన ఈ విధముల గ్రహించుట ముఖ్యము.

నైసర్గిక మిత్రత్వాది సంబంధమే గాక తత్కాల సంబంధముచే గ్రహములు తమ తమ సంబంధమందు మార్పు నొందు చున్నది. మానవులు మిత్రులైననూ కాలవశమున శత్రువులుగా ప్రవర్తింప వలసి వచ్చిన వేళలందు, వారి మిత్రులకు వారు చేయగల సహాయము చేయలేకుండుటయే గాక ఒక్కొక్క సమయములందు అపకారము గూడ చేయవలసి వచ్చుచుండుట అనుభవము. అట్లె గ్రహములు గూడ సంబంధమందు మార్పు నొంది మిత్రులకే శత్రువులగుచున్నారు. నైసర్గిక, తాత్కాలిక మిత్రత్వాది సంబంధముల జేర్చి అధిమిత్రులని, మిత్రులని, సములని, శత్రువులని, అధిశత్రువులను

విభాగము తేర్పడినవి. ఈ విధమున గ్రహము రాశి, హోర, ద్రేక్కాణ, సప్తాంశ, నవాంశ, ద్వాదశాంశ, త్రింశాంశలను 7 విభాగములందు ఏ స్థితి నొందుచున్నదో పరిశీలించి ఆ గ్రహ బలము నిర్ణయించుట క్రమమార్గమని సప్తవర్గజ బల మేర్పడినది.

తరుపరి యున్న ఓజోయుగ్మ రాశ్యంశల బలము పురుష స్త్రీ గ్రహ విభాగముల మీదను, స్త్రీ పురుష రాసుల విభాగముల మీద నాధారపడి యున్నది. పురుషులు పురుష స్థానములందు, స్త్రీలు స్త్రీ స్థానములందు బలవంతులగుట సహజము. కేంద్రబలము జాతకుడు తన స్వశక్తితో నొంద గలుగు స్థానమును సూచించును. జనన కాలమందు కడు బీద కుటుంబములందు జన్మించిననూ, జాతకములు స్వశక్తితో ఉన్నత స్థానముల నాక్రమించుట చూచుచున్నాము. ఈ స్థితిని చూపు కేంద్రబలము ముఖ్యము. గ్రహములు కేంద్రములందు బలము గలవి. క్రమముగా పణపరములందు, ఆపోక్లీబము లందు బలహీనము లగుచున్నవి. ఇందు ఉదయ మధ్యాహ్నములు బలీయములు, సాయంకాల అస్తమయములు బలహీనములు. అట్లే 1, 10 కేంద్రములు బలము గలవై 4, 7 కేంద్రములు బలహీనములైనవి. ద్రేక్కాణ బలవిభజన యందు పురుష, స్త్రీ, నపుంసకత్వము గ్రహములకు చెప్పబడిన విధమున బల నిర్ణయము చేయవలెను. పురుషులు ప్రథమ ద్రేక్కాణమందు, నపుంసకులు, మధ్యమ ద్రేక్కాణమందు స్త్రీలు చివరి ద్రేక్కాణమందు బలవంతులు. గృహాధిపతులగు పురుషులకు ప్రథమమున, స్త్రీ స్థానమగు ఆఖరు భాగమున పడమట భాగమందు (వంట ఇండ్లయందు) స్త్రీలు, మిగిలిన మధ్య భాగమున నపుంసకులగు వారు పురుషులకు స్త్రీలకు సేవచేయుటకై వేచియుండుట గమనించిన వారికి ఈ క్రమము సహజమని స్పష్టమగును. ఈ క్రమమున సాధించిన బలము స్థానమందున్న గ్రహ బలము సూచించును. ఈ స్థానబలము మరల కాలబలమునకు సంబంధించి గ్రహముల స్థితులు మానవుల స్థితులవలె మార్పు నొందుచున్నవి.

కాల బలము—ఈ బలము 9 విభాగములు గలది. స్థానము కాలము అనుకూలించ కుండిన మానవులు అభివృద్ధి నొందుట లేదు. అట్లే గ్రహములున్నవి. ఇందు నతోన్నత బలము అనగా దివారాత్రబలము ప్రథమము. పగటి యందు బలము గల గ్రహములని రాత్రులందు బలముగల గ్రహములని చెప్పబడి యున్నవి. గాన పగటి యందు బలముగల గ్రహములు పగలు జన్మించిన వారలకు రాత్రులందు బలముగల గ్రహములు రాత్రులందు జనన మొందిన వారలకు సహాయ్య పడును. రెండవది పక్షబలము. శుక్లపక్ష, కృష్ణపక్షములందు శుభులు పాపులు క్రమముగా బలవంతు లగుచున్నారు. మంచివారు వారి కర్తవ్యముల పగటివేళలందు దుష్టులు వారి కర్తవ్యముల రాత్రులందు సలుపుట ఎరిగిన విషయము. ఏలన మంచివారికి పగలు, చెడువారికి రాత్రి అనుకూలము. ఇదే స్థితి గ్రహములకున్నది. మూడవ విభాగము త్రిభాగ బలము. పగలు రాత్రి క్రమముగా 3 భాగములు చేయవలెను. ఉదయకాలమందు బుధుడు, మధ్యాహ్నమందు రవి, సాయంకాలమందు శని క్రమముగా బలవంతులు. రాత్రులందు ప్రథమ భాగమున చంద్రుడు, ద్వితీయ భాగమున శుక్రుడు చివరి భాగమున కుజుడు బలవంతులు. గురుడు సర్వదా బలవంతుడు. చతుర్థము సంవత్సరాధిపతి బలము, మాసాధిపతి బలము, వారాధిపతి బలము, హోరాధిపతి బలము, దక్షిణ లేక ఉత్తరాయనాది బలము క్రమముగా నున్నది. దీని ననుసరించి జనన కాలమునకు అధిపత్యము గల సర్వగ్రహముల బలముల సాధింప నగును. ఈ విభాగము లన్నియు చేరి కాలబల నిర్ణయ మొసగును.

దిగ్బలము : తూర్పు, దక్షిణము, పడమర, ఉత్తరము నాల్గు దిక్కులు. ఈ దిక్కుల కధిపతులున్నారు. ఆ యధిపతులు వారి దిక్కులందున్న బలవంతులు. లేక తమ స్థానముల నుండి వేరు స్థానములందున్న బలహీనులు. అట్లే మానవులున్నారు. గాన ఈ స్థితి బలము ప్రధానమైనది. ప్రతికూల స్థానములు శత్రు స్థానములైన అందున్న మానవులు కష్టముల నొందు విధమున గ్రహములు యనుభవించుచున్నవి. ఏలన శత్రు స్థానములందు ఎంత బలవంతులైననూ బలహీనులగుచున్నారు.

చేష్టా బలము : మానవులు జన్మతః నొందు శక్తులు గల వారైననూ, స్థితిచే శక్తివంతులైననూ అక్రమ మార్గమున సంచరించిన రాజదండనకు గురియగుచున్నారు. చేష్ట యనగా ప్రవర్తించు విధానము. చేష్టలు క్రమగతి, వక్ర గతి, స్తంభనలను రూపము నొంది యున్నది. క్రమ మార్గమున సంచరించు వారలు అభివృద్ధి నొందుట, వక్ర మార్గమున సంచరించు వారు కష్టముల పాలగుట, ఎటూ సంచరించక స్థిమితముగా నుండు వారలకు లాభ నష్టములు లేకుండుట అనుభవము. ఈ విధముగా గ్రహములు శుభాశుభముల నొసగుటకు కారకులగుచున్నారు. క్రమగతి యందు అతి శీఘ్రముగా సంచరించు వారు విచక్షణాశక్తి లేక కష్టముల పాలగునట్లు గ్రహములు కూడ అతిశీఘ్ర గతి నొంది కష్టముల నొసగుచున్నవి. గాన ఎన్ని విధముల సిరి, సంపద, అధికారము

లున్ననూ క్రమ నడవడి మానవుల అభివృద్ధికి హేతువగునట్లు గ్రహములు ఎంత బలాఢ్యములైననూ క్రమగతి లేక శుభముల ననుభవించుట లేదు. ఇట్టి స్థితి వక్రగతి గల కుజ, బుధ, గురు, శుక్ర, శనులకు మాత్రమే వర్తించును. రవి చంద్రులు సదా క్రమగతి గల వారు గాన వారికి వర్తింపదు.

దృష్టి బలము : పై విధముగ సర్వ శక్తులు గల మానవులు చెడువారు వెంబడించి వారిని బాధించిన సుఖింప లేకున్నారు. శక్తి వంతులగు మానవులకు శుభులు సహాయులైన వారి సుఖ సంపదలు ఇనుమడించును. మనో వ్యాకులత నొందక సర్వ యత్నములందు కార్యసిద్ధి నొందగలరు. అట్లే గ్రహములు కూడ శుభపాపుల దృష్టులకు లోనై శుభాశుభముల నొందుచున్నవి. పాపుల వీక్షణలకు తోడైన వారు బలహీనులగుట, శుభవీక్షణ నొందిన వారు బలవంతులగుట సహజము.

పై హంశముల ననుసరించి మానవులకు నిత్య జీవిత మందు ఎన్ని రకముల అనుభవములు ప్రాప్తించుచున్నవో ఆయా అనుభవములకు లోనై వారు తమ కర్తవ్యముల ఎంత వరకు నెరవేర్చ గలుగుచున్నారో ఆలోచించిన ఈ షడ్బల క్రమమున గ్రహములు సర్వ విషయ సంబంధముచే పొందు శక్తి విశదమగుచున్నది. ఇట్టి శక్తిని క్రమ మార్గమున గ్రహింపక ఫలనిర్ణయము చేయుట మానవుల గుణగణముల విచారింపక స్నేహము చేసి కష్టముల పాలగురీతి నుండును. గాన షడ్బల సాధన యవసరమని ఋషులు చెప్పుట అనుభవ సిద్ధమని నిరూపింపనగును.

## ఆ యు ర్భా వ ము

జాతకులు యోగావయోగముల ఫలముల నెరుగవలెనని కుతూహల పడుట సామాన్యము. అన్ని యోగములు ఆయుర్భావము మీద నాధారపడి యుండును. ఆయుర్భాగ్యము లేని జాతకునకు యోగములు నిష్ఫలములు. గాన ఆయుర్దాయము ప్రధానము. ఆయుర్దాయము రెండు భాగములు. యోగజము, గణితజము. యోగజము యోగముల మీదను, గణితము గణితభాగము మీదను ఆధారపడి యుండును. యోగజము నందు నాల్గు విభాగములున్నవి. రిష్టజము, పరమ, నియత, అమిత. రిష్టజమును గూర్చి—

సింహోని కుంభాస్థిత స్సింహికేయో విలోకితః క్రూర ఖగైర్యది స్యాత్
వర్షాణి సప్తైవ తదీయమాయుః ప్రకీర్తితం జాతక శాస్త్రవిద్భిః॥

దీనినే సారావళి యందు కళ్యాణవర్మ :

ఘట సింహ వృశ్చికోదయ కృత స్థితిర్జీవితం హరతి రాహుః
పాపైర్నిరీక్ష్యమాణః సప్తమితైర్నిశ్చితం వర్షైః॥

యని చెప్పియున్నారు.

సింహ, వృశ్చిక, కుంభములలో నొకటి లగ్నమై అందు రాహు వుండి పాపులచే వీక్షింప బడెనేని అట్టి జాతకుడు 7 సంవత్సరములు మాత్రము జీవించును.

పరమాయుర్యోగమును గూర్చి :

అనిమిష పరమాంశకే లగ్నే శశితనయే గతి పంచవర్గ లిప్తే
భవతిహి పరమాయుష్యః ప్రమాణం ఇది సకలాః సహితాః స్వతుఙ్గ భేషు॥

దీనినే సిద్ధసేనుడు :

మీనో పరమాంశ గతే సౌమ్యే గతిసంజ్ఞ వర్గ లిప్తాస్థే
శేషైః పరమోచ్చగతైర్జాతిః పరమాయురాప్నోతి॥

కళ్యాణ వర్మ :

మీనోదయోంశే నవమే పంచ వింశతి లిప్తకే
గతిసౌమ్యేస్థ తుంగస్థైః శేషైరాయుః పరం భవేత్॥

మీనరాశి అంత్యము నవాంశ లగ్నమై బుధుడు వృషభమున 25 లిప్తల దాటి యుండగా. ఇతర గ్రహములు తమ పరమోచ్ఛల నొందిన జాతకుడు పరమాయువగు 120 సంవత్సరములు జీవించును.

నియతాయుర్దాయమును గూర్చి :—

లగ్నాష్టమారిం ద్వ్యయుతోన బేసుత్యైః క్రూరాః స్వభస్యా యది గేవరౌద్వా।
బావాంతి భవవ్వర గావేతాం జాతఃశతాయుః కథితో మునీంద్రః॥

అమితాయువును గూర్చి :—

గురు శశి సహితే కుళీర లగ్నే శశితనయే భృగుజే చ కేంద్రయాతే।
భవరిపు సహజోపగైశ్చ శేషైరమిత మిహాయు రనుక్రమాద్వినాస్యాత్॥

కళ్యాణవర్మ :—

కర్కి లగ్నే గురుస్సేందుః కేంద్రగౌ బుధ భార్గవౌ
శేషైస్త్రిలాభ షష్ఠస్థై రమితాయుర్భవేన్నరః।

లగ్నము కర్కటమై అందు చంద్ర గురులు, కేంద్రమ్ములందు బుధ శుక్రులు, ఉపచయములందు రవి, కుజు లుండగా

పుట్టిన జాతకులు అమితాయుర్దాయము గలవారు. ఇతర వివరములు అన్ని ఉత్తమ జ్యోతిష గ్రంథములందున్నందున ఎక్కువగా చెప్పతలచలేదు.

గణిత గతాయుర్దాయము 5 భాగములు. అంశజ, పిండజ, నైసర్గిక, జీవశర్మోదిత, మిశ్ర. మిశ్రమాయుర్దాయమందు నాల్గు విభాగములున్నవి. గాన ఆయుర్దాయ నిర్ణయము 12 విధములని తెలియవలెను.

శ్రీపతి పద్ధతియందు చెప్పబడిన గణితాయుర్దాయము నిర్ణయమునందు భిన్నాభిప్రాయములున్నవి. ఈ పద్ధతి ననుసరించి ఆయుర్దాయ నిర్ణయము చేయు క్రమము ఎవ్వరునూ తెలుపనందున ఈ వ్యాసమందు తెలుపుచున్నాను.

అంశాయుర్దాయ నిర్ణయమునకు జేష్ఠ గుణక, ఉచ్ఛ గుణక, స్ఫుట గుణకములు ప్రధానము. గ్రహముల చేష్టా రశ్మలను, ఉచ్ఛరశ్మలను ప్రథమమున నిర్ణయింపవలెను. ఇందు శ్రీపతి పద్ధతి కష్టము గాన సులభమార్గమున సాధించు క్రమమును నెరుగవలెను.

గ్రహముల ఉచ్ఛబలమును, చేష్టాబలమును 6 చే హెచ్చించి ప్రాప్తించిన లబ్ధమునకు 1 ని కూడిన చేష్టారశ్మి, ఉచ్ఛరశ్మి గ్రహములకు ప్రాప్తించును.

ఈ గణిత భాగము సులభగ్రాహ్య మగుటకు ఉదాహరణ జాతకము ద్వారా జూపుచున్నాను :—

జననం 1910 సంవత్సరం జనవరి 14 వ తేదీ శుక్రవారం తెల్లవారుఝామున గం. 4 ని. 44. 28 సెకనులకు.

గ్రహస్ఫుటం—రవి—9.1.20; చంద్ర—10. 15. 52; కుజ—0.2.49; బుధ—9.18.52; గురు—5.21. 34; శుక్ర—10.7.1; శని—11.24.24; రాహు—1.12. 25; కేతు—7.12.25.

| శని | కుజ | రాహు | |
|---|---|---|---|
| చంద్ర<br>శుక్ర | రాశి చక్రము | | |
| రవి<br>బుధ | | | |
| లగ్నము | కేతు | | గురు |

| | లగ్నము<br>కుజ<br>రాహు | | బుధ |
|---|---|---|---|
| చంద్ర<br>శని | నవాంశ | | గురు |
| రవి | | | |
| శుక్ర | | కేతు | |

జననకాల రాహు మహర్దశా శేషం 5 సంవత్సరముల 6 నెలల 29 రోజులు.

భావ స్ఫుటం—1—243.15;2—275.34;3—3C7.54; 4—340.14; 5—7.54; 6—35.34; 7—63.15; 8—95.34; 9—127.54; 10—160. 14; 11—187.54; 12—215.34.

షడ్బల విచారణ.

ఉచ్ఛబలం—రవి—27.04; చంద్ర—34.00; కుజ—38.66; బుధ—18.80; గురు—34 67; శుక్ర—43.19; శని—8.76 విరూపములు.

# ఎనిమిదేండ్ల తరువాత....

## "అష్ట వర్షా భవేత్ కన్యా"....

**అంత చిన్నతనంలోనే పెండ్లిచేసే బాల్య వివాహ సంప్రదాయము యిప్పుడు లేదు.**
**అది యిప్పుడు ప్రాథమిక విద్య పూర్తిచేసే యీడు.**

ఆంధ్రప్రదేశ్ ఏర్పడి ఎనిమిదేండ్లు నిండినది. ప్రణాళికలద్వారా అభివృద్ధి సాధించే కృషిలో ప్రాథమిక దశ గడిచి మాధ్యమిక దశ ప్రవేశించినది. రాబోయే ప్రణాళికలలో యితోధికమైన అభివృద్ధి సాధనకై ప్రయత్నము ప్రారంభమైనది.

**ఈ ఎనిమిదేండ్లలో మన రాష్ట్రము ఏమి సాధించినది?**

| | **1956 నవంబరు 1 వ తేదీన** | **ఎనిమిదేండ్ల తరువాత......** |
|---|---|---|
| రాష్ట్ర ఆదాయము | రు. 857.61 కోట్లు | రు. 1323.30 కోట్లు |
| తలసరి సగటు ఆదాయము | రు. 255.85 | రు. 354.31 |
| ప్రణాళిక పెట్టుబడి | రు. 180.59 కోట్లు | రు. 312.66 కోట్లు |
| రాష్ట్ర బడ్జెటు | రు. 61.08 కోట్లు | రు. 136.00 కోట్లు |
| ఆహారధాన్యాల ఉత్పత్తి | 54.21 లక్షల టన్నులు | 76 లక్షల టన్నులు |
| విద్యుచ్ఛక్తి లభించిన గ్రామాలు,పట్టణాలు | 685 | 4429 |
| విద్యా సంస్థలు (సాధారణ విద్య, వృత్తి విద్య) | 30,005 | 38,047 |
| కళాశాలలు | 98 | 132 |
| ప్రాథమిక ఆరోగ్య కేంద్రాలు | 36 | 285 |
| సమాజ వికాస కేంద్రాలు | 55 | 321 |
| గ్రామాలలోని కమ్యూనిటీ రేడియో సెట్లు | 1,762 | 10,649 |



1964–65 సంవత్సరములో వ్యవసాయ విశ్వవిద్యాలయము స్థాపించబడినది.

పరిపాలనా సామర్థ్యం సడలకుండానే, పొదుపు చర్యగా బ్లాకుల పునర్నిర్మాణము జరిగినది.

15,223 గ్రామ పంచాయతీలలో, 7,177 పంచాయతీలకు— సుమారు 47 శాతం — ఏకగ్రీవ ఎన్నికలు జరిగినవి. పంచాయతీ రాజ్య ప్రగతికి ఇదొక శుభ సూచన. అంతా మహిళా సభ్యులేగల పంచాయతీలు 11 ఏర్పడినవి. వీటిలో కూడా ఎన్నిక ఏకగ్రీవముగా జరిగినది.

రు. 139 కోట్లు ఖర్చుకాగల నాగార్జున సాగర్ ప్రాజెక్టు కార్యక్రమము వేగంగా జరుగుతున్నది. ఆనకట్ట నిర్మాణపు పని సుమారు 62 శాతం పూర్తి అయినది.

పరిశ్రమల రంగంలో — భారీ విద్యుత్పరికరాల ఫ్యాక్టరీ, సింథెటిక్ మందుల ఫ్యాక్టరీకాక, హైదరాబాదువద్ద డిఫెన్సు ఎలెక్ట్రానిక్సు ఫ్యాక్టరీ, హిందూస్థాన్ యంత్ర పరికరాల ఫ్యాక్టరీ ఐదవ విభాగంకూడా ప్రారంభింపబడినవి.



"భేష్" అనిపిస్తుంది యిది చూడగానే.

నిజానికి ఇది ప్రగతికి ప్రారంభము మాత్రమే...

**ఇంకా ఎక్కువ అభివృద్ధికీ, ఉన్నత లక్ష్యాల సాధనకూ అందరం తీవ్రంగా కృషిచేద్దాం.**

**ఈ ప్రణాళికా యుగంలో సర్వసమృద్ధికి పాటుపడదాం.**

సమాచార, పౌర సంబంధ శాఖ, ఆంధ్రప్రదేశ్

# షడ్బలానంతరము

సప్తవర్గజ బలం—రవి—97.50; చంద్ర—112.50; కుజ—209.50; బుధ—99.25; గురు—31.85; శుక్ర—97.50; శని—116.25.

చేష్టా గుణకము:—పై పద్ధతి ననుసరించి నిర్ణయింప వలెను.

రవి—0.69; చంద్ర 0.87: కుజ 2.73; బుధ

| | రవి | చంద్ర | కుజ | బుధ | గురు | శుక్ర | శని |
|---|---|---|---|---|---|---|---|
| యుగ్మాయుగ్మ బలం | – | – | 30 | 15 | – | – | 15 |
| కేంద్ర బలం | 30 | 15 | 60 | 30 | 60 | 15 | 60 |
| ద్రేక్కాణ బలం | 15 | – | 15 | 15 | – | – | – |
| స్థాన బలం | 169.54 | 161.50 | 323.16 | 179.05 | 126.52 | 155.69 | 200.01 |
| దిగ్బలం | 12.84 | 51.46 | 7.45 | 44.74 | 36.06 | 48.82 | 37.06 |
| కాల బలం | 89.13 | 166.97 | 184.69 | 126.70 | 120.65 | 97.95 | 133.73 |
| చేష్టాబలం | 7.96 | 14.85 | 54.77 | 35.06 | 3.84 | 42.52 | 0.64 |
| ద్రిగ్బలం | +0.68 | +7.16 | +14.91 | −5.86 | −0.53 | +3.01 | +13.45 |
| షడ్బలం | 332.19 | 438.52 | 602.12 | 405.39 | 320.82 | 391.84 | 415.46 |

భావ బలం

1—370.87; 2—415.82; 3—498.07; 4—422.75; 5—694.07; 6—493.62; 7—417.73; 8—454.98; 9—425.55; 10—450.40; 11—296.60; 12—580.74.

| | రవి | చంద్ర | కుజ | బుధ | గురు | శుక్ర | శని |
|---|---|---|---|---|---|---|---|
| ఇష్ట బలం | 14.67 | 22.45 | 14.74 | 25.67 | 11.41 | 42.85 | 2.36 |
| కష్ట బలం | 41.03 | 34.26 | 10.56 | 31.79 | 38.23 | 17.14 | 55.15 |

ఉదాహరణ జాతకునకు ఉచ్ఛరశ్మి క్రమం:—

రవి—ఉచ్ఛబలం 27.04 విరూపములు లేక 0.45 రూపములు. $0.45 \times 6 = 2.70 + 1 = 3.70$.

చంద్ర—4.48; కుజ—4.86; బుధ—2.86; గురు—4.46; శుక్ర—5.32; శని—1.87.

చేష్టారశ్మి క్రమం :—

రవి—1.79; చంద్ర—2.48; కుజ—6.47; బుధ—4.50; గురు—1.38; శుక్ర—5.25; శని—1.06.

ఉచ్ఛగుణకము—ఉచ్ఛరశ్మి 3 కన్న తక్కువైన 1 టి కలిపి 4 చే భాగింపవలెను. 3 కన్న ఎక్కువైన 1 తీసివేసి 2 చే భాగింపవలెను.

రవి. ఉచ్ఛ రశ్మి 3.70 గనుక $\frac{(3.70-1)}{2} = \frac{2.70}{2} = 1.35$

బుధుని ఉచ్ఛ రశ్మి 2.88 గనుక $\frac{2.88+1}{4} = \frac{3.88}{4} = 0.97$

చంద్ర—1.74; కుజ 1.93; బుధ 0.97; గురు 1.73; శుక్ర 2.16; శని 0.72.

1.75; గురు 0.59; శుక్రుడు 1.06; శని 0.51.

స్ఫుట గుణకము:—$\sqrt{\text{ఉచ్ఛ గుణక} \times \text{చేష్టా గుణక}}$=స్ఫుట గుణకము.

| | | |
|---|---|---|
| రవి | $\sqrt{1.35 \times 0.69}$ = | 0.96 |
| చంద్ర | $\sqrt{1.74 \times 0.87}$ = | 1.23 |
| కుజ | $\sqrt{1.93 \times 2.73}$ = | 2.28 |
| బుధ | $\sqrt{0.97 \times 1.75}$ = | 1.30 |
| గురు | $\sqrt{1.73 \times 0.59}$ = | 1.01 |
| శుక్ర | $\sqrt{2.16 \times 1.06}$ = | 1.51 |
| శని | $\sqrt{0.72 \times 0.51}$ = | 0.60 |

గ్రహములకు తామున్న స్థానములమీద నాధారపడి బహు గుణములున్నవి. అధిమిత్రగృహమందు 11/7; మిత్రస్థానమందు 29/21; సమక్షేత్రమందు 1; శత్రుస్థానమందు 13/21; అధిశత్రుస్థానమందు 3/7. నిజరాశి యందున్న గ్రహమునకు ఈ గుణక ముండదు.

వర్గోత్తమే స్వభవనే స్వనవాంశకేచ
స్వక్షేత్రయంశ కే చ గుణకో ద్వితీయం నిరుక్తం॥

గ్రహములు వర్గోత్తమముగాని, స్వక్షేత్రమును గాని, స్వనవాంశను గాని, స్వద్రేక్కాణమును గాని పొందిన వాని గుణకము 2. అధిమిత్రస్థానమందున్న 1½. మిత్ర క్షేత్రమందున్న 11/3. సమ క్షేత్రమందున్న 1 శతృ క్షేత్రమందున్న 2/3 అధిశత్రు క్షేత్రమందున్న ½ వీనిని 4 చే భాగించి రాశి ఫలములను, 8 చే భాగించి హోరాది షడ్వర్గాల ఫలములను నరయవలెను. అనగా వర్గోతమ, స్వక్షేత్ర, స్వనవాంశ, స్వద్రేక్కాణ గ్రహములను రాశివర్గమందు ½ చేతను ఇతర వర్గాలందు ¼ చేతను హెచ్చింపవలెను.

అనంతర తాడకములు—ఏ గ్రహమైననూ సప్తవర్గాలందు తన స్వక్షేత్రమును పొందిన ఆగ్రహ అంతర్తాడకము 2. అధి మిత్ర గృహమందు—5/3. మిత్రగృహమందు 13/9; సమ గృహమందు 1; శత్రు గృహమందు 5/9; అధి శత్రు గృహమందు 1/3. ఈ మూడు విభాగముల సముదాయమును ఆశ్రయ గుణకమందురు. స్ఫుటగుణకమును ఆశ్రయ గుణకముచే హెచ్చించి ప్రాప్తించిన లబ్దవర్గ మూలము కర్మయోగ్య గుణక మనబడును. శ్రీపతి పద్ధతిరీత్యా పై చెప్పబడిన కర్మయోగ్య గుణక సాధన కష్టము గాన సులభమార్గమును సూచించుచున్నాను.

గ్రహములకు స్వవర్గనందు 18; అధిమిత్రవర్గనందు 15; మిత్రవర్గ నందు 13; సమవర్గ నందు 9: శత్రువర్గ నందు 5; అధిశత్రు వర్గనందు 3 గుణకము అగుచున్నవి. ఈ క్రమమును రాశి యందు మాత్రము ద్విగుణింపవలెను. అనగా రాశి యందు 36, 30, 26, 18, 10, 6 యగుచున్నవి. ఈ ప్రకారము సప్తవర్గాల గుణకముల కూడి వానిని రాశి చక్రమందున్న గ్రహము స్వక్షేత్రమందున్న 36 తోను, అధి మిత్ర క్షేత్రమందున్న 48 చేతను, మిత్రక్షేత్రమందున్న 54 చేతను, సమక్షేత్రమందున్న 72 చేతను, శత్రుక్షేత్రమందున్న 108 చేతను, అధిశత్రుక్షేత్రమందున్న 144 చేతను భాగింపవలెను. కాని, గ్రహములు వర్గోత్తమము గాని, స్వద్రేక్కాణగతులైననూ స్వనవాంశ యందున్న 36 చేతనే భాగింపవలెను. ఇట్లు చేయుగా ప్రాప్తించిన ఫలము ఆశ్రయ గుణక మగును.

రవి, చంద్ర, కుజులు వర్గోత్తమ గ్రహములు. బుధ, శనులు స్వనవాంశ యందున్నారు.

శుక్రుడు అధిమిత్ర క్షేత్రమందున్నాడు. గాన వారి భాజకములు 36 అయినవి.

గురుడు అధిశత్రు క్షేత్ర మందున్నందుననూ వర్గోత్తమముగాని, స్వద్రేక్కాణముగాని స్వనవాంశయందు గాని లేనందున ఈ గ్రహభాజకము 144.

వర్గోత్తమాంశ గాని, స్వద్రేక్కాణము గాని, స్వనావాంశను గాని పొందిన గ్రహము రాశియందు అధిశత్రు క్షేత్రగతుడైన ఆతని గుణకము 1/63 వలనను తగ్గించి; అధిమిత్రక్షేత్రమైన 1/63 వలన హెచ్చింపవలెను. అట్టి గృహములు శత్రు క్షేత్రములైన 1/94 చేత తగ్గించి మిత్రక్షేత్రమైన 1/94 వలన హెచ్చింపవలెను. రాశి సమ లేక స్వక్షేత్రమైన మార్పులేదు.

పై సూత్ర ప్రకారము ఉదాహరణ జాతక ఆశ్రయ గుణక స్థితి :—

రవి రాశి యందు సమక్షేత్రమందున్నందున 9 × 2= 18. వర్గోత్త మాంశ యందున్నందున, ఆ స్థానము సమక్షేత్రమైనందున ఈతని గుణకమందు మార్పులేదు. లేక 2.3

చంద్రుడు వర్గోత్తమ మొంది మిత్రక్షేత్ర మందున్నందున 1/94 చంద్ర గుణకమగు 2 25/36 కు కలుపవలెను. గాన ఈతని గుణము 2.645.

కుజుడు స్వక్షేత్రమందు వర్గోత్తమము నొందినందువ మార్పు లేదు. 3.50.

బుధుడు స్వనవాంశగతుడై రాశి యందు మిత్రక్షేత్ర వర్తియైనందున 1/94 కలుపవలెను.

$$\text{అనగా } 2\ \frac{23}{36}+\frac{1}{94}=2.64.$$

గురుడు ఎట్టి మార్పు నొందుట లేదు. = 0.30

శుక్రుడు ఎట్టి మార్పు నొందుటలేదు. = 2.55

## ఉదాహరణ జాతక వివరములు

| గ్రహము | రాశి | హోర | ద్రేక్కాణ | సప్తాంశ | నవాంశ | ద్వాదశ | త్రింశ | మొత్తము | భాజకము | గుణకము. |
|---|---|---|---|---|---|---|---|---|---|---|
| రవి — | 9 × 2=18, | 15, | 9, | 15, | 9, | 9, | 15 | 89 | 36 | 2 11/36 |
| చంద్ర— | 13 × 2=26, | 18, | 15, | 5, | 13, | 15, | 5 | 97, | 36 | 2 25/36 |
| కుజ— | 18 × 2=36, | 15, | 18, | 18, | 18, | 13, | 18 | 126 | 36 | 3 9/18 |
| బుధ— | 13 × 2=26, | 9, | 15, | 13, | 18, | 9, | 5 | 95 | 36 | 2 23/36 |
| గురు— | 3 × 2= 6, | 9, | 3, | 9, | 9, | 3, | 5 | 44 | 144 | 11/36 |
| శుక్ర— | 15 × 2=30, | 9, | 15, | 5, | 5, | 13, | 15 | 92 | 36 | 2 5/9 |
| శని — | 9 × 2=18, | 9, | 9, | 18, | 18, | 5, | 18 | 95 | 36 | 2 23/36 |

# షడ్బలానంతరము

శని స్వనవాంశను పొంది రాశి యందు సమక్షేత్ర వర్తిత్వమైనందున మార్పు లేదు =2.64

కర్మయోగ్య గణకము : $\sqrt{\text{స్ఫుట గుణక} \times \text{ఆశ్రయ గుణక}}$.

రవి— $\sqrt{2.208}=1.48$

చంద్ర— $\sqrt{3.247}=1.80$

కుజ— $\sqrt{7.980}=2.\ 2$

బుధ— $\sqrt{3.432}=1.83$

గురు— $\sqrt{0.303}=0.55$

శుక్ర— $\sqrt{3.850}=1.94$

శని — $\sqrt{1.584}=1.25$

ఆయుష్కళలు : లగ్న భావము, గ్రహముల స్ఫుటములను నిమిషముల లోనికి మార్చి ఆ మొత్తమును 2400 చే భాగించిన ప్రాప్తించు శేషము జీవిత ప్రమాణము యొక్క ఆయుష్కళలను తెల్పును. లేక గ్రహభాగలను 40చే భాగించి శేషమును నిమిషములలోనికి మార్చును.

రవి $\frac{271.20}{40}=6\frac{31.20}{40}=31 \times 60=1860+20=$ 1880.

చంద్ర 2152, కుజ 169, బుధ 532, గురు 694, శుక్ర 1621, శని 2064.

చక్రార్ధ హాని : లగ్న భాగల నుండి గ్రహభాగలను తీసివేయగా శేషము 180 భాగలకు తక్కువైన భాజకముండును. 180 భాగల కెక్కువైన భాజకముండదు.

పాప గ్రహములు లగ్నాత్తు 12, 11, 10, 9, 8, 7 భావములందున్న, వారి వారి ఆయుర్భావములందు పూర్తిగాను, సగము, మూడవ వంతు, నాల్గవ వంతు, అయిదవ వంతు, ఆరవ వంతు క్రమమున తీసివేయవలెను. అవి శుభగ్రహములైన పై భాగమందు సగము మాత్రమే తీసివేయవలెను.

ఉదాహరణ జాతకమునందు :

రవి : లగ్నము 8—3—15, రవి 9—1—20 అనగా 20—3—15 — 9.1.20=11—1—55.

ఇది 180 భాగలు అనగా 6 రాసుల కన్న అధికము గాన చక్రార్ధ హాని లేదు. ఇట్లే ఈ జాతకమునందు చంద్ర, కుజ, బుధ, శుక్ర, శనులకు చక్రార్ధహాని లేదు.

లగ్నము 8—3—15 గురువు 5—21—34= 2—11—41 లేక 4301 నిమిషములు.

దీనిని 1800చే భాగించగా 2.388 భాగ ఫలము. గురుడు శుభుడు గాన దీనిని 2చే హెచ్చింపవలెను 2.388 × 2=4.776

గురు ఆయుష్కళయగు 694 నుండి 1/4.776 తీసివేయగా694 × 0.791=548.954(1000 /4776= 0.209; 1–0.209=0.791) గాన గురుని ఆయుష్కళ 548.954.

సవరణానంతరము గ్రహములకు ప్రాప్తించిన ఆయుష్కళలు :

రవి— 1880; చంద్ర—2152; కుజ— 169; బుధ—532; గురు—548.954; శుక్ర— 1621; శని— 2064.

ఆయుః ప్రమాణము

సవరణానంతర ఆయుష్కళలను కర్మయోగ్య గుణకములచే హెచ్చించి ప్రాప్తించిన లబ్ధమును 200చే భాగింపగా ఆయుర్భావము గ్రహములకు, లగ్నమునకు ప్రాప్తించును.

రవి—1880 × 1.48 ÷ 200=13.91

చంద్ర—2152 × 1.80 ÷ 200=19.?6

కుజ—169 × 2.82 ÷ 200=2.38

బుధ—532 × 1.83 ÷ 200=4.86

గురు—548.954 × 0.55 ÷ 200=1.51

శుక్ర—1621 × 1.94 ÷ 200=15.72

శని—2064 × 1.25 ÷ 200=12.90

లగ్న— 8.?—15 అనగా 14595 నిముషములను 2400 చే భాగింపగా ప్రాప్తించు శేషమును 200 చే భాగింపవలెను. =0.975

షడ్బలమందు గ్రహముల కన్న లగ్నము బలీయమైన లగ్న భాగలను 30చే భాగించి లోగడ ప్రాప్తించిన లగ్నాయుర్దాయమునకు కలుపవలెను.

ఉదాహరణ జాతక మందు లగ్నము 270 విరూపముల కలిగి యున్నది. గ్రహములలో అధిక బలగ్రహమైన కుజుడు 602 విరూపముల బలము కలిగి యున్నాడు. గాన లగ్న ఆయుర్దాయము ఇచట పెంపు చేయ నక్కరలేదు.

పైన ప్రాప్తించిన ఆయుర్దాయములను కలుపగా 71.615 సంవత్సరముల ఆయుర్దాయము ఈ జాతకునకు ప్రాప్తించినది. అనగా 71 సంవత్సరముల 7 నెలల 11 రోజులు ఈతని ఆయుర్దాయమని అంశాయుర్దాయ గణన రీత్యా నిర్ణయింపవలెను. జననం 14—1—1910 + ఆయుర్దాయము 11—7—71. గాన ఈ జాతకుడు 25—8—1981న పరమపదము నొందును.

గణిత గతాయుర్దాయమునందు పూర్వ ఋషులచే ఆమోదింప బడినది అంశాయుర్దాయము. అనుభవములో కూడ సరిగా నున్నది. పిండాయుర్దాయ విషయమున కేశవ పద్ధతిని

దివాకర దైవజ్ఞుడు మార్చి సులభ మార్గమును చూపినచో అనుభవములో సరిగా నుండుట లేదు. ఈ విషయమందు జీవ శర్మ, శ్రీధరులు దివాకర దైవజ్ఞునితో ఏకీభవించినారు.

నైసర్గికాయుర్దాయము కేశవ పద్ధతి ననుసరించి చెప్పబడిననూ అనుభవమునకు సరిగా లేదు. లగ్న, రవి, చంద్రు లలో లగ్నము బలముగలిగి యున్న అంశాయుర్దాయమును, రవి బలవంతుడైన పిండాయుర్దాయమును, చంద్రుడు బలవంతుడైన నైసర్గికాయుర్దాయమును ప్రమాణములుగా చూడవలెనని శ్రీపతి చెప్పియున్నాడు. ఈ పద్ధతికి కేశవుడు, కళ్యాణవర్మ తమ ఆమోదమును తెలిపియున్నారు. లగ్న, రవి, చంద్రులు సమాన బలము కలవారు కాగా ఆయుర్దాయ నిర్ణయ విధానమును నీలకంఠులు చెప్పియున్నారు. లగ్న, రవి, చంద్రుల బలములు 3 రూపములకు తగ్గినపుడు ఆయుర్దాయ నిర్ణయ విధానమును జీవశర్మ చెప్పియున్నాడు. కేశవ పద్ధతి, మహ లుగి పద్ధతి, దామోదర పద్ధతులందు క్రమములు భేదించి యున్నందున ఏ పద్ధతి ననుసరింపవలెనో నిర్ణయింప జాల కుండుటలో ఆశ్చర్యము లేదు. వరాహమిహిరుల మతాను సారము, పరాశర సూత్రముల నాధారముగా దివాకర దైవ జ్ఞులు నిర్ణయించిన అంశాయుర్దాయ క్రమము పాటింప దగినదని ఎరుగవలెను.

యో ధర్మ కర్మ నిరతో విజితేంద్రియో యో
యో పథ్య భోజనజుషో ద్విజదేవ భక్తాః
లోకేనరా దధతి యే కులశీల లీలాం
తేషామిదం కథిత మాయు రుదార ధీభిః॥

కళ్యాణ వర్మ :

పథ్యాశినాం శీలవతాం నరాణాం
సద్వృత్త భాజాం విజితేంద్రియాణాం
ఏవం విధానో మిదమాయు రత్ర
చింత్యం సదో వృద్ధమని ప్రణీతం॥

మంత్రేశ్వరుడు :

అహింసకస్య దాన్తస్య ధర్మార్జిత ధనస్యాచ
సర్వదా నియమ స్తస్య సదా సానుగ్రహో గ్రహః॥
యో పాప లుబ్ధాశ్చోరో మేపీవ బ్రాహ్మణ నిన్దకాః
బ్రహ్మశినశ్చ యో తేషా మకాలమరణం ధ్రువం॥

కాల చక్ర దశాక్రమమున ఆయుర్భావ నిర్ణయ విధా నము కూడ ముఖ్యముగా పరిగణింపబడుచున్నది. నవాంశ చక్రమందు చంద్ర స్థిత రాశినాథుడు బలవంతుడైన ఈక్రమము నాచరింపవలెనని చెప్పబడి యున్నది. ఇది నక్షత్ర క్రమదశ.

"సదా నక్షత్ర మార్గేణ దశా బలవతీ స్మృతా" యని మంత్రేశ్వర వచనము. గాన కాలచక్ర దశాక్రమము రాబోవు వ్యాస మందు వివరింపగలను.

ఈ జాతకునకు అంశాయుర్దాయ రీత్యా ప్రాప్తించిన ఆయుర్దాయము ఇతర మార్గముల రీత్యా సరిచూచిన ఈ క్రమ మెంతవరకు ఫలప్రదమో నిర్ణయింప వచ్చును.

జైమిని సిద్ధాంత రీత్యా ఆయుర్దాయ నిర్ణయమునకు (a) లగ్న అష్టమాధి పతులు, (b) లగ్న చంద్రులు, (c) లగ్న హోరాలగ్నాధిపతుల నిర్ణయించ వలెను. వీరలలో ఒకరు చరరాసియందు రెండవ వారు ద్విస్వభావరాసియందు లేక ఉభయులా స్థిరరాసి యందు లేక ఒకరు ద్విస్వభావరాసి యందు రెండవ వారు చరరాసి యందున్న అల్పాయుర్దాయమని; ఒకరు చరరాసి యందు రెండవవారు స్థిరరాసి యందు లేక ఒకరు స్థిరరాసియందు రెండవవారు చరరాసియందు లేక ఉభయులూ ద్విస్వభావ రాసియందున్న మధ్యమాయుర్దాయమని; ఉభయులా చరరాసియందు లేక ఒకరు స్థిరరాశి యందు రెండవవారు ద్విస్వభావ రాసియందు లేక ఒకరు ద్విస్వభావ రాసి యందు రెండవవారు స్థిరరాసియందున్న పూర్ణా యుర్దాయమని చెప్పబడి యున్నది. ఉదాహరణ జాతక మందు లగ్నాధిపతి ద్విస్వభావ రాసియందు అష్టమాధిపతి స్థిరరాసి యందున్నారు. గాన పూర్ణాయుర్దాయము ప్రాప్తించి నది. ఇందు లగ్న చంద్రులు ద్విస్వభావ, స్థిరరాసులందున్నారు గాన పూర్ణాయుర్దాయము. హోరాలగ్నాధిపతి శని. మూడవ సూత్ర ప్రకారము లగ్న హోరాలగ్నాధిపతులు ద్విస్వభావ రాసు లందున్నారు గాన మధ్యమాయుర్దాయము ప్రాప్తించినది. మూడింటను రెండు పూర్ణాయుర్దాయములు సూచించుచున్నం దున ఈ జాతకుడు పూర్ణాయుర్దాయవంతుడని నిర్ణయింప వలెను.

లగ్నాత్తు అష్టమాధిపతి, సప్తమాత్తు అష్టమాధి పతులగు చంద్ర శనులలో శని బలవంతుడు. ఈ శని కేంద్ర మందున్నందున పూర్ణాయుర్దాయము.

ఆత్మకారకుని నుండి అష్టమాధిపతి, ఆత్మకారక సప్తమము నుండి అష్టమాధిపతులగు శుక్ర, కుజులలో కుజుడు బలవంతుడు గాన మధ్యమాయుర్దాయము. పై జెప్ప బడిన మూడింట రెండు పూర్ణాయుర్దాయమును సూచించు చున్నందున ఈ జాతకుడు పూర్ణాయుర్దాయవంతుడు.

సప్తమ అష్టమాధిపతులగు బుధ, చంద్రులలో చం ద్రుడు బలవంతుడు. ఇతడు శుక్రునితో కలసి యున్నందున చంద్ర, శుక్రులు మారకాధిపతులు. ఈ జాతకునకు చంద్ర

దశ శుక్రాంతరము 2009న గాని ప్రాప్తింపదు. ఈ జాతకుడు పూర్ణాయుర్దాయమందు అల్పాయుర్దాయము గలవాడు గాన చంద్రదశా శుక్రాంతరము మారక కాలము కాజాలదు. శుక్ర దశా చంద్రాంతరము ఈతని 70వ సంవత్సర ప్రాయమందు ప్రాప్తించుచున్నది. గాన శుక్ర దశ చంద్రాంతర మందు మారకము సూచింపబడుచున్నది.

శతభిషము పూర్ణాయుర్దాయ నక్షత్రము. గురుడు కన్య యందున్న అది కేంద్రమైన పూర్ణాయుర్దాయము. బుధుడు మకర మందున్న పూర్ణాయుర్దాయము. శని మీన మందుండుట పూర్ణాయుర్దాయమునకు సహాయ్యపడును. ఇది బలీయమగు స్థితి. రాహువు 6 యందున్న అష్టమము గ్రహ వర్జితమైన పూర్ణాయువు. గాన ఈ జాతకుడు పూర్ణాయుర్దాయవంతుడు.

మారక సూత్రములు :

1. షష్ట, అష్టమ, వ్యయాధిపతుల దశాంతర్దశా విదశలలో మారకము ప్రాప్తించును.

2. అష్టమాధిపతి దశగాని, అష్టమమందున్న గ్రహ దశ యందు గాని, షష్టాధిపతి దశా భుక్తులలో గాని మారకను.

3. ధనుర్లగ్నమునకు బుధ, శుక్ర, రాహులు ప్రబల మారకులు. చంద్ర, గురు, శనులు సామాన్య మారకులు.

4. శుక్రదశ మారకదశ కాగా శుక్ర అంతరము లేదా రాహ్వాంతరము, లేదా చంద్రాంతరము లేదా బుధాంతరము లందు మారకము గల్గును.

5. శుక్రదశ యందు చంద్రాంతరమందు మారకము సూచింపబడిన రవి విదశ యందు మారకము గలుగును.

6. చంద్రాత్తు కేంద్రాధిపతులు జన్మలగ్నాత్తు 2, 6, 8, 12 స్థానాధిపతులైన వారి దశలందు మారకము.

పై సూత్రముల ననుసరించి షష్టాధిపతి దశలో అష్టమాధిపతి అంతరమందు అనగా శుక్రదశా చంద్రాంతర మందు మారకము సూచింపబడుచున్నది. రెండవ సూత్ర ప్రకారము షష్టాధిపతి దశ మారకదశ. మూడవ సూత్ర ప్రకారము ప్రబల మారకుడైన శుక్రదశయందు సామాన్య మారకుడగు చంద్రాంతరమున మారకము సూచించును. ఈ స్థితి నాల్గవ సూత్ర ప్రకారము గూడ సరిపోవుచున్నది. గాన శుక్రదశ, చంద్రాంతర, రవి విదశయందు మారకమని నిర్ణయింపవలెను. రవి మారక స్థానమగు ద్వితీయమందు భావగతుడై యుండుట విశదము. చంద్రాత్తు కేంద్రాధిపతి యగు శుక్రుడు జన్మలగ్నాత్తు షష్టాధిపతిగాన మారకుడు.

ఉదాహరణ జాతకుని అష్టమాంశ చక్రము ఈ క్రింది విధముగా నున్నది.

| | | | |
|---|---|---|---|
| రాహు | కుజ రవి చంద్ర | | |
| శని | | | లగ్నము |
| గురు శుక్ర | అష్టమాంశ | | |
| | | | కేతు బాధ |

అక్టోబరు నెలయందు ప్రచురింపబడిన దివాకర సిద్ధాంతరీత్యా అష్టమాంశ చక్రమందు 2, 7, 3, 12 స్థానములందున్న గ్రహములు సామాన్య మారకులని, దశమ మందున్న గ్రహము ప్రబల మారకుడని చెప్పియున్నాను. దశమమందు కుజ, రవి, చంద్రులు సప్తమందు గురు, శుక్రులున్నారు. చతుర్థ లాభాధిపతియై సప్తమ కేంద్రమందున్న శుక్రుడు మారకుడగుట విశదము. దశమ మందున్న రవి, చంద్ర, కుజులలో జన్మలగ్నమునకు అష్టమాధిపతియగు చంద్రుడు రాహు నక్షత్రగతుడైనాడు. జననకాల లగ్నమునకు 22 వ ద్రేక్కాణాధిపతి చంద్రుడు. ఈ చంద్రుడే 64 వ నవాంశాధిపతి గూడ అయి ఉన్నాడు. గాన ప్రబల మారకుడని గ్రహింపవలెను. చంద్ర, రాహులకు నక్షత్ర పరివర్తన గలిగినది. శుక్రుడు కూడ రాహు నక్షత్రగతుడైనందున, శుక్ర, చంద్ర, రాహు, రవుల సంబంధమేర్పడినది. జన్మలగ్నమునకు ఉభయ కేంద్రాధిపతియగు బుధుడు చంద్ర నక్షత్ర గతుడై మారకస్థానమగు ద్వితీయమందున్నాడు. గాన ఈ జాతకుని మారకము శుక్ర మహర్దశ, చంద్రాంతర, రాహు విదశ, రవి కేతు బుధుల ప్రాణ, సూక్ష్మ దశలందు జరుగునని చెప్పవలెను. తత్కాల గ్రహములు సంచరించు నక్షత్ర బలముల మీద నాధారపడి మరణము ఏనాడు ఏ లగ్నమందు జరుగునది నిర్ణయింపవలెను. మరణము సహజముగా- లగ్నాధిపతికి నైధన తార యందు అందు సంచరించుచుండు గ్రహ సంబంధమగు రాసులందు ప్రాప్తింపగలదు.

ఈ క్రమమున విచారింపగా ప్రాప్తించిన ఆయుర్దాయము, అంశాయుర్దాయమునకు సరిపోవుచున్నది. గాన అంశాయుర్దాయమును ప్రమాణముగా తీసికొని, ఇతర విధముల గూడ విచారించి ఆయుర్దాయము నిర్ణయించుట క్రమమార్గము. షడ్బలానంతరము ఆయుర్దాయము నిర్ణయించుట క్రమమార్గము. షడ్బలానంతరము ఆయుర్దాయము నిర్ణయించుక్రమమును చెప్పియున్నాను. జాతకునకు ఆయుర్భాగ్యము కలిగినదని నిర్ణయించిన పిమ్మట యోగభావములను షడ్బలము ననుసరించి విచారించు క్రమము రానున్న వ్యాసములలో చెప్ప గలను.

## దివాకర సిద్ధాంతము

అక్టోబరు నెల భారతియందు ప్రచురించిన దివాకర సిద్ధాంతమను వ్యాసమందు క్రింది మార్పులను పాఠకులు గమ వించ గోరుతున్నారు.

పేజి 38. కాలం (2) ఆఖరున (1)

కేంద్ర, కోణ, లాభ, స్వక్షేత్ర, మిత్రక్షేత్ర, ఉచ్ఛ క్షేత్ర గ్రహములు శుభులు. (ఉభయ—తప్పు)

పేజి 39. కాలం (1) (4) నీచనొంది వక్రింపనున్న గ్రహములు. (వక్రించిన—తప్పు)

పేజి 39. కాలం (1) (11) అష్టమాంశ చక్రమందు దశమమందున్న గ్రహము మారకుడు. 2, 7, 3, 8, 12 స్థానములందున్న గ్రహములు కూడ మారకము చేయగలరు. (8 లోపించినది.)

పేజీ 41. కాలం (1) పేరా (3) 9 పంక్తి—మిశ్రమ లక్షణయుక్తులైన (లక్షణ—లోపించినది)

పేజి 41. కాలం (2) పంక్తి—26—మిత్రులకు సహకరించు విధమున శుభగ్రహములు సహకరించుటలేదని తెలియుచున్నది. (మిత్రులకు సహకరించుటలేదని—తప్పు) ఆ వాక్యం తరువాత "పూర్ణ శుభుడైన గురునికన్న తక్కువ శుభుడగు శుక్రుడు స్నేహపాత్రుడగుట విశదము."(ఈ వాక్యం లోపించినది)

పేజి 44. కాలం (1) పేరా (2) పంక్తి—7 "స్వ నక్షత్ర మగు పూర్వాభాద్రయందు" (పూర్వాషాఢ—తప్పు).

పేజి 44. కాలం (2) పంక్తి 10—"ఇందు నైసర్గిక పాపుల చారలు (బాధలు కాదు) ఎక్కువ పాప ఫలముల నీయ గలవు" అని ఉండవలెను.

పంక్తి—15 "ధనుర్లగ్న జాతకులకు పాప ఫలముల నీయుడు."



# సరదారు

## శ్రీ కర్ణపాలెము కుటుంబశాస్త్రి

వాసవ వజ్రసన్నిభము, "వల్ల,భాయిపటేలు" వాక్కు, లే
డా "సరదారు" వంటి ఘనుడైన సమర్థుఁడు, శాసనుండు, వి
శ్వాసము తోడ, సత్యపరిపాలనకై, మితభాషణమ్ము న
భ్యాసము చేసినాడు, రఘువంశపు రాజులరీతి, నీతిగా.

మొదటి "యసహాయ" కదనంపు టుదయసీమ
యైన "బార్డోలి" నాయకుఁడా పటేలు
ఆ యయోధ్య రామున కాంజనేయుడెటులో
అటులె "గాంధి" మహాత్మున కా పటేలు.

పరశురాముని వలె నరపతులఁ జంప
నైదువందల యేబది కధికమైన
ఆ స్వదేశసంస్థానము లీ స్వతంత్ర
భారతావనిఁ గలిపిన శూరుఁడతఁడు.

అర్క తేజుండతండు, "బిస్మార్కు"వలెనె
కఠినవాక్కును గల కార్యకర్త, కాని
హృదయ మా నాయకునిది "శిరీష కుసుమ
పేశల"మ్మని, మెఱిగిన పెద్దలనిరి.

భారతీయుల మొదటి యుపప్రధాని,
స్థైర్య, గాంభీర్యముల, శైల, శరధి, సముఁడు
అమిత మితభాషి, సుస్వరాజ్యాభిలాషి,
యగు "పటేలు"న కనుదిన మంజలింతు.

---

* సర్దారు పటేలు జన్మదినోత్సవము 31–10–64

# ఆ గాజుబొమ్మ

శ్రీ వాకాటి పాండురంగరావ్

"అభ్యుదయ చిత్రకారుడు అన్నమాట ఒట్టి అబద్ధం—"

—అందరూ ఉలిక్కిపడి చూచారు ఈ మాటలన్న వ్యక్తిని. దీపపుకాంతి ప్రశాంతంగా ఉంది. పంకాలు చప్పుడు మానేసి తిరుగుతున్నాయి. హెడ్‌మేష్టరుగారు పాఠం చెబుతున్న తరగతిలా ఉంది వాతావరణం.

అది ఢిల్లీనగరంలో ఒక పెద్ద హాలు.

అవి సాయంకాలపు ఆఖరి నిముషాలు.

ఒకళ్లిద్దరు మంత్రులు, కొందరు కళాకారులు, ఫకీరానా మనుష్యులు, కాళ్లలో తిరుగుతూ సంఘసేవచేసే తెల్లటి లావుపాటి ఆడవాళ్లు, పత్రికా విలేఖర్లు— మొత్తం మోక్షరమైనుంది, అప్పుడే రాయబారిగారు తెరచిన ఆ చిత్రకళా ప్రదర్శనాన్ని తిలకిస్తున్నారు.

విశాలమయిన ఆ హాల్లో అందంగా అక్కడొకటి, అక్కడొకటిగా అమర్చబడి ఉన్నాయి చిత్రాలు. వాటిని చూస్తూ ఆ చిత్రంమీద ఒక మాటా, ఈ చిత్రంమీద ఒక అభిప్రాయమూ పెద్దవారెవరో ప్రకటిస్తే, మిగతవాళ్లు నియాన్ దీపాలకాంతిలా నిశ్శబ్దంగా నవ్వుతూ, మెత్తటి తివాసీలమీద క్రేప్— సోల్‌ల బూట్లతో నడుస్తూ ఉన్నారు.

అదంతా ఒక సంస్కృతి, ఒక ప్రత్యేక ప్రపంచం. అక్కడ గొంతెత్తి పలకడం నేరం. హాయిగా నవ్వడం అనాగరికం. నిజం చెప్పడం అపరాధం. అర్థమైనా కాకపోయినా స్టయిల్‌గా తలవూచి— "ఆహ్! ఇందులో చిత్రకారుడు తన ఆత్మనంతా పిండిపోశాడండి......పిండి పోశాడు...... ఏమి లైను, ఏమి డెప్తు.... ఆహాహ్!—" అన్న డైలాగులు పలకవచ్చు. ఇట్లాంటి వాక్యాలురాని వాళ్లంతా ఇట్లాంటి వాక్యాలన్న మనస్సులో రాసిపెట్టుకుంటారు. మరోచోట వాడడానికి.... ఇదంతా మన దేశంలోనే!

"ఇక్కడ గమనించండి— ఆ నల్లగీత! అది మానవుడి నిరాశకి గుర్తు. అదిగో ఆ తెల్లటి చుక్క అది శాంతి, అది సుఖం ఈ రెంటినీ కలిపాడు ఆర్టిస్ట్.....అంటే ఆశ నిరాశలు రెండు అవిభాజ్యమని తాత్పర్యం. చూడండి మరి......ఇతడు ఎంత ఆశావాదియో— ఎంత అభ్యుదయ చిత్రకారుడో—" అన్నారు డిప్యూటీ మంత్రిగారు ఇంగ్లీషులో. ఈయనకు ఇంగ్లీషు వ్యాకరణంమీద ఇంత కోపం ఎందుకోననుకున్న రాయబారి పెదవులమీద చిరునవ్వు వెలిగింది. కళమీద నిజంగానే తనేదో గొప్ప వాక్యాన్ని అనేశాననుకుని ఆ మంత్రి ఇకిలించగా సదస్యులు ప్రతిబింబించారు. పరివారమంతా మరో చిత్రం దగ్గర చేరింది.

ఇటువంటి మెత్త మెత్తటి, సన సన్నటి, చల చల్లటి, నియాన్ లైట్ల— తివాసీల— క్రేప్ బూట్ల వాతావరణంలో— బాంబులాగా పేలింది ఆ వాక్యం. ఆ గొంతు ఇంకా మాట్లాడింది.

"కవి, గాయకుడు, చిత్రకారుడు— ఎవడయినా సరే తను ఉపాసించే కళలో లీనమయిపోయి, ఆ కళలోకి మరణించి మళ్లీ జన్మిస్తే అతడి పునర్జన్మలోని ప్రతిక్షణమూ సత్యం, శివం, సుందరం అయిన కళగా రూపొందుతుంది. కాని అందరికీ అది సిద్ధించదు. అందువలన కళకు తన్ను అర్పించుకున్న ప్రతి వ్యక్తీ తదేకమయిన అన్వేషణాపథంలో తప్పటడుగులు వేస్తుంటాడు. ఈ తపస్సులో, ఈ కఠోర సాధనలో— మనిషిని మరింత పిచ్చివాడిగా, మరింత మోహితుడుగా చెయ్యడానికా అన్నట్లు కొన్ని రవ్వలు చిమ్ముతాయి, కొన్ని తారలు తళుక్కుమంటాయి. కళాకారుడికి దారి చూపించడానికా అన్నట్లు— అతడు తననుండి తాను వేరుగా తీసి చూడలేనిది, విడమరచి చెప్పలేనిది— ఏదో ఒకానొక క్షణంలో బయటికి మెరుస్తుంది. హారంలోని ఆ కైరటం, జ్వాలలోని ఆ శిఖ, ఆవేదనలోని ఆ కిరణం— అది పాటకావచ్చు, చిత్రం కావచ్చు, రచన కావచ్చు— అది ఏదయినా సరే అది అదిగానే ఉంటుందిగాని, దాని ఇంకోదానితో పోల్చి దీనిలో అభ్యుదయం ఉంది అని కెలకడం సరికాదు. ఏ కాలపు కళాఖండమైనా ఆయా కాలపు పరిస్థితులకు ప్రతినిధి, ఆయా కాలపు ప్రభావాలకు ప్రతిబింబం. ఒక చిత్రకారుడి చిత్రం

ఉంది అంటే అది వ్యక్తిగా అతడి సంఘర్షణల, ఆవేదనల ఆలోచనల ఫలితం. అట్లాంటి దానిని ఇంకొక దానితో పోల్చి— ఇది అభ్యుదయం అనడం— మౌంట్‌బేటిన్ ముక్కు, కృష్ణదేవ రాయల ముక్కుకన్న అభ్యుదయంగలది— అన్నట్లు ఉంటుంది. ఆ మాటకువస్తే అభ్యుదయం అంటే ఏమిటి? మనిషిని మనిషి లాగా గీస్తే అది పాత చింతకాయ పచ్చడియా, మొహంమీద ముక్కోణం గీచి తొడకి రెండున్నర చెవులతికిస్తే అది అభ్యుదయమా ? ఎనిమిదో కార్బన్ కాపీలాగా కనపడక, అర్థమవక ఉంటే అది అభ్యుదయమా—అతడు అభ్యుదయ చిత్రకారుడా?

''అందుచేత ఒక మనిషి అభ్యుదయ భావాలు కలవాడవవచ్చును. అతడే మంచి చిత్రకారుడూ అవవచ్చును. కాని అతడిని అభ్యుదయ చిత్రకారుడు అనడం కేవలం దుష్ట సమాసం అవుతుంది. రాజకీయాలు, రూపాయలు కళచేత చాకిరీ చేయించుకోవడానికి ఈ పదాలు పనికి వస్తాయి కాని అవి నిజం కావు. అభ్యుదయం, గోమయం— అంటూ పరుగెత్తడం మొదలెట్టిన క్షణాన, నిజమైన కళాకారుడు చచ్చి పోవడం తథ్యం అని నా అభిప్రాయం— ''

— అని తపతపమని పేలింది ఆ క్రొత్త గొంతు.

మంత్రుల గుండెలదిరిపోయాయి. 'అవ్వ !

ఎవడీ దుర్మార్గుడు, ఎవ్వడు ఈ అనాగరకుడు ? ఆ ! గులాబీ రేకుల్లాంటి వాతావరణంలో ఇనపమేకుల్లా వచ్చాడు, ఏమిటి ఈ దారుణం ! వీడి కెవడిచ్చాడు ఈ స్వాతంత్ర్యం ?—'' అని పెద్దవాళ్లంతా లోలోపల గుండెలు బాదుకున్నారు. వీడి నెవరన్నా చెవులు మెలేస్తే బాగుండును— అనుకున్నారు— ఆ పని తమలో ఒకరు చేసితీరుతారని ఎదురు చూచారొక నిముషం.

కాని అట్లాంటిదేమీ జరగలేదు.

క్రొత్త వ్యక్తి మాటలన్నీ శ్రద్ధగా విన్న రాయబారిగారు ''నా పేరు లుకర్ని.......మిమ్మల్ని కలుసుకోవడం సంతోషంగా ఉంది—'' అని చెయ్యి జాచారు.

ఆ చేతినందుకుని— ''నా పేరు ముకుందం''— అన్నాడే గాని ఎందుకో భయం అల్పించింది యూనివర్సిటీ విద్యార్థి— ఇరవై ఏడేళ్ల ముకుందానికి.

* * * *

ఇది జరిగి రెండేళ్లయింది. ఈ వ్యవధిలో లుకర్ని— ముకుందాల పరిచయం ఓ మోస్తరుగా పెంపొందింది.

యూరపు రాజ్యాలలో ఒకదానికి మనదేశంలో ప్రతినిధిగా ఉన్న లుకర్ని, కేవలం— సాయంకాలం వేళల్లో కళమీద అభిప్రాయాలు ప్రకటించి భోంచేసి నిద్రపోయే కులం మనిషి కారు. నిజంగా కళలంటే ఆయనకు ప్రేమ మెండు. ఈ సత్యానికి ఆయన ఇల్లే ఆధారం. ఆయన నివాసమంతా ఆయన కళాభిరుచికి అద్దంగా ఉంటుంది. సుప్రసిద్ధ చిత్రకారుల వర్ణచిత్రాలయితేనేమి, అమూల్యమైన శిల్పాలయితేనేమి, ఇతర కళాత్మకమైన వస్తువులయితేనేమి— మంచి అభిరుచితో ఎన్నుకున్నవి.—ఆయన ఇంటినిండా ఉన్నాయి. ఉద్యోగరీత్యా వెళ్లిన ప్రతిదేశంనుండి ఆ దేశపు ఉత్తమ కళా చిహ్నాలని ఆయన ఎంతో డబ్బుపెట్టి కొని ప్రాణానికన్న అధికంగా పదిలపరుచుకునే వాడు వాటి గురించి మాట్లాడటం మొదలుపెడితే— ఇక రాజకీయ చాతుర్యమంతా, మరిచిపోయి పసిపిల్లవాడిలా మాట్లాడే వారు. లుకర్ని. ఇంత అందమైన వస్తువు తనదికదా అన్న ఉత్సాహం, గర్వం నినిపించేవి ఆయన మాటలలో.

ఇటువంటి వ్యక్తితో తనకు పరిచయం ఏర్పడడం తన అదృష్టం అనుకునే వాడు ముకుందం. అయినా అనేక దేశాలలో ఎందరో పెద్దవాళ్లతో మెలిగిన ఆయనెక్కడ, తానెక్కడ అన్పించేది అపుడపుడూ.........మరీ ఆ రోజయితే అంతమంది ఉన్న హాల్లో తానేదో తెలిసినవాడిలా అభ్యుదయ చిత్రకళ మీద లెక్చరివ్వడం ఏమిటి— అని సిగ్గు, నవ్వు వచ్చేవి. అసలు తమాషా ఏమిటంటే ఆ రోజు తను వాగినదానిలో చాలనుటుకు తాను ఏకీభవిస్తున్నానని లుకర్నివంటి వ్యక్తి అనడం.....!!

ఇటువంటి పరిస్థితులలో యూనివర్సిటీ విద్యార్థుల సంఘం ఒక ఎగ్జిబిషన్ ఏర్పాటుచేయ నిశ్చయించింది. ఆ నిర్వహణ సంఘంలో ముకుందం ఒక సభ్యుడు. ఎగ్జిబిషన్‌లోని అనేక భాగాలలో కళా విభాగం ఒకటి. అక్కడ విద్యార్థుల కళాకృష్ణను ప్రదర్శించే వివిధ వస్తువులు, చిత్రాలేకాక— నగరంలోని పెద్ద పెద్దవారినుండి కొన్ని గొప్ప చిత్రాలను, శిల్పాలను ఎరువుగా తీసుకొచ్చికూడా జన సామాన్యానికి చూపించాలని నిర్ణయించారు.

సరిగ్గా ఈ నిశ్చయంలోనే— ముకుందం జీవితంలో చిత్రమయిన సంఘటన ఒకటి పుట్టింది.

లుకర్నిగారి కళాఖండ - సముదాయంనుండి ఒకటి రెండింటిని ఆయున్నడిగి తెచ్చేపని ముకుందానికి అప్పగించారు. ఆ బాధ్యత తనమీద పడటం గర్వకారణంగా ఉన్నప్పటికీ, ముకుందానికి లోలోపల ఏదో బెరుకుగానే ఉంది.

లుకర్ని వద్ద వున్న 'ఆర్ట్ పీసెస్' అన్నిటిలోకి ఆయనక్కడుంగడు ప్రీతిపాత్రమైనది. గాజుతో చేయబడిన బ్యాండు వాయిద్యగాళ్ల బొమ్మల బృందం. ఆయన జర్మనీలో, దానిని ఒక జమీందారునుండి కొన్నారు. దాదాపు వంద ఏండ్లు వయస్సు

గల ఆ బృందంలో వివిధ వాద్యాలు వాయించేవారి బొమ్మలు ఇరవైనాలుగున్నాయి. ఒక్కొక్క బొమ్మా రెండంగుళాల ఎత్తు మాత్రమే ఉన్నప్పటికీ— ఆ రెండంగుళాల మేరలోనే వాటిని తయారుచేసిన కళాకారుడి గొప్పదనం గోచరిస్తుంది. కండ్లు, ముక్కు తీరుగాదిద్దిన మొహాలు, రంగు రంగుల దుస్తులు ఆయా వాద్యాలను వాయిస్తున్న భంగిమలు— ఈ అంశాలన్నీ ఎంతో వివరంగా, స్పష్టంగా, చైతన్యవంతంగా కనిపిస్తాయి వాటిలో. ఆ రంగు రంగుల బొమ్మలన్నిటినీ అందమైన వెడల్పాటి గాజు 'ట్రేలో' అమర్చి— ఆ ట్రేని తమ భవనపు ముందు వైపులో— గుమ్మానికి ఎదురుగా ఉంచారు లుకర్ని. వారి ఇంట్లోకి అడుగు పెడుతూండగానే— ఎట్ట ఎదురుగా జీసస్ క్రైస్ట్ తైలవర్ణ చిత్రం, నాలుగడుగుల పొడవుది, గోడ మీద ఉంటుంది. దానిక్రిందుగా టేబిల్‌మీద 'ట్రేలో' గాజు బొమ్మల బృందం ఎంతో ముచ్చటగా ఆకర్షణీయంగా— ఆ వాద్యగాళ్లందరూ ఎవరికీ వినరాని ఇంపైన సంగీతాన్ని విన్పిస్తున్నట్లుంది. ఏ క్షణాన్నయినా వాళ్లందరూ పాటలు వాయిస్తూ— ఆ 'ట్రే' నుండి 'లిల్లిపుట్'ల లాగా ముందుకు వచ్చేస్తారేమోనన్పిస్తుంది.

అటువంటి ఆ బొమ్మలని తమ ఎగ్జిబిషన్‌లో పదిరోజులపాటు ప్రదర్శించుకోవడానికి ఎరువుగా ఇస్తారా అని ఒకరోజు ఉదయం అరఘంట పీక్కు నమిలి నమిలి ఆఖరికి అడిగాడు ముకుందం.

లుకర్ని మాట్లాడలేదు. ఆ రెండు నిముషాలూ, హాల్లోని గడియారమూ, తన గుండెయూ, ఏది చప్పుడు చేస్తున్నదో తెలియలేదు ముకుందానికి.

"ఆ బ్యాండు మాస్టర్స్ సెట్టు నా ప్రాణానికన్న ముఖ్యం మిస్టర్ ముకుందం ! నా దగ్గర ఉన్న వస్తువులలో ఇంక దేని మీదలేని అభిమానం నాకు దానిమీద ఉంది. దాని ఖరీదు ఆరువేల రూపాయలవి మాత్రమేగాదు, అరవై వేలు పోసినా ఆ "డ్రెస్‌డెన్ ఫిగరిన్స్" తయారుచేయగల హస్తాలు ఈనాడు లేవు.........అందుకని."

అయితే ఇక లేద్దామనుకున్నాడు ముకుందం. ఆయన ఆ బొమ్మల్ని ఇవ్వననడం పెద్ద 'రిలీఫ్'గా అన్పించింది ఎందు చేతనో— !

"కాని మీరడిగారు గనుక ఇస్తాను. దానిని అతి జాగ్రత్తగా తీసుకెళ్లి, భద్రంగా ఉంచుకుని క్షేమంగా ఇవ్వండి.... అంతే—" అని ముందు హాల్లో టేబిల్‌వైపు నడిచారు లుకర్ని

ముకుందం గుండె లోపలికి రాయిలా పడింది—సంతోషం.

ఎగ్జిబిషన్ పదిరోజులపాటు జయప్రదంగా జరిగింది. ప్రజలు తండోప తండాలుగా వచ్చారు. పత్రికలు ప్రదర్శనాన్ని మెచ్చుకుంటూ, ఆ గాజుబొమ్మల బృందం ఫోటోలని ప్రచురించాయి. విద్యార్థులు ఉప్పొంగిపోయారు.

పదిరోజులూ ఆ గాజు బొమ్మల్ని కంటిని రెప్పల్లా కాపాడాడు ముకుందం. ప్రదర్శన అంతా ముగిసి ఆ బొమ్మలన్నీ క్షేమంగా ఉన్న సందర్భంలో కృతజ్ఞతా సూచకంగా తిరుపతి వెంకటేశ్వరుడికి నూట ఎనిమిది కొబ్బరికాయలు కొడతానని మొక్కుకున్నాడు. కూడా ! పది రోజుల తరువాత ఆప్రదర్శన ముగిసిన రోజు రాత్రి హాయిగా పీడ కలలు లేకుండా నిద్రపోయాడు ముకుందం.

మరుసటి రోజు ఉదయం— మొట్ట మొదటి పని ఆ బొమ్మల్ని లుకర్ని గారింటికి చేర్చటం— అని పదే పదే అనుకున్నాడు— ఆ ప్రకారమే ప్రొద్దున్న ఎనిమిదింటికల్లా జాగ్రత్తగా ఆ బొమ్మలన్నిటిని ,ట్రే'లో పెట్టుకుని ఒక ట్సీలో కూచుని, ఆ బొమ్మలున్న 'ట్రే'ని తన ఒడిలో పెట్టుకుని కూర్చున్నాడు.

ాక్సీ బయలుదేరింది

అమ్మయ్య ! ఇంకో అరగంటలో పెద్ద బాధ్యత తీరిపోతుంది— అని నిట్టూర్చాడు ముకుందం. యూనివర్సిటీలో ఆఖరి పరీక్ష రోజునకూడా మనసు ఇంత తేలిక పడలేదతనికి.

ఆ టాక్సీ డ్రైవర్ జగజిత్‌సింగ్ చాలామంచివాడే. ఎటొచ్చి పంజాబీ డ్రైవర్లందరిలాగే— అతడుకూడా రోడ్లన్నీ తన కోసమే ప్రత్యేకించి వేశారన్న విశాల హృదయంతో కారు నడుపుతాడు. అందుచేత ఈ వేళ నగరం నడిబొడ్డుమీద నాలుగు రోడ్ల కూడలిలో అతడు అల్లంత దూరంనుండి ఆకుపచ్చ దీపాన్ని అదియే శాశ్వతమనుకుని, కరికి లంఘించు సింహంబు కరణి రాబోవడం, ఈ లోపుగా ఆ మాయదారి ఆటోమేటిక్ సిగ్నల్‌లోని ఎర్రదీపం తగుదునమ్మా అని వెలగడం, పాతికమైళ్ల వేగంలో వెళ్తున్న కారుని నాలుగు గజాల దూరంలో జగజిత్‌సింగ్ ఆపడం, ఆ వూపులో ముకుంద ఒడిలో ఉన్న 'ట్రే' ముందుకు ఒలకడం— టక టక జరిపోయాయి.

అయిదు ప్రాణాలలో నాలుగు ఎగిరిపోయిన ముకుందం అవే యూనివర్సిటీ విద్యార్థి—గాజుబొమ్మలన్నిటినీ ఏరి మళ్ళా అమర్చి లెక్కపెడితే— అన్నీ ఉన్నాయి. అంతేకాదు. ఒకటికి పదిసార్లు తరచి తరచి చూచిన తర్వాత ఆ బ్యాండు బృందపు సభ్యులందరూ ఆరోగ్యంగా ఉన్నారనికూడా తేలింది !

# ఆ గా జు బొ మ్మ

''హెయిల్ ఫాదర్లాండ్'' అని ఆనందోద్రేకంలో అరిచాడు ముకుందం. వెంకటేశ్వరస్వామికి నూట ఇరవై కొబ్బరికాయలు కొడదామని ప్రతిపాదించుకున్నాడు. ఇంకా ఆ సంతోషంలో—, జగత్‌సింగ్‌ని కష్టపడడం మాట అట్లావుంచి ఆ వెధవ గడ్డమే గనుక లేకపోతే వాడిని ముద్దెట్టుకుందామనిపించింది.

ఇంకో అయిదు నిముషాలలో, సవ్యంగా ఎర్రదీపాలన్నిటినీ దాటి టాక్సీ రయ్‌మని బారాకంబారోడ్‌మీద ఉన్న లుకర్నిగారి ఇంటి కాంపౌండ్‌లోకి ప్రవేశించింది. పెద్ద తోటను దాటి పోర్టికోలో ఆగింది టాక్సీ.

ఆ పోర్టికోలోనే లుకర్నిగారి దేశపు జెండాను అలంకరించుకుని నిలబడి ఉంది పొడుగాటి నల్లటి కారు. ఆ కారు డ్రైవర్— ఇంకొక గడ్డాలసింగు, తెల్లటి యూనిఫారం ధరించి ఆ కారు తలుపు తీసి పట్టుకుని నిల్చుని ఉన్నాడు.

ముకుందం జగత్‌సింగ్‌కు డబ్బులిచ్చి, జాగ్రత్తగా 'ట్రే'ని తిరుపతిలో మొక్కుబడి వున్న వాళ్ళ హుండీ, ప్రసాదమూ ఉన్న పళ్ళాన్ని పట్టుకున్నట్లుగా— పట్టుకొని బయటికి దిగాడు. వెడల్పాటి మెట్లను సమీపించాడు. మెట్ల చివర వరండా, దాని వెనక హాలు, హాల్లో ఎట్ట ఎదుట గోడమీద జీసస్ చిత్రం, దానిక్రింద టేబిల్ కనపడుతున్నాయి పోర్టికోనుండి.

ఇరవైనాలుగు వేడివేడి టీ కప్పులని శ్రీమహావిష్ణువు వగైరాలున్న టేబిల్ దగ్గరకు తీసుకువెళ్తున్న 'బేరర్'లా మొదటి మెట్టుమీదికి ముకుందం అడుగు పెడుతుండగా— పై మెట్టుమీద ప్రత్యక్షమయ్యాడు లుకర్ని.

''హాల్లో మిస్టర్ ముకుంద్ ! మీ ఎగ్జిబిషన్ అయిపోయిందా—గుడ్..... ఆ! జాగ్రత్త, జాగ్రత్త—'' అనిఅపాటికి సగం మెట్లెక్కి వచ్చిన ముకుందాన్ని సమీపించి ఆ ట్రేలోని బొమ్మలవైపుచూచి వాటిలో 'క్లేరినెట్' వాద్యగాణ్ణి ఎడమ చేతి వేళ్ళతో పైకెత్తిపట్టుకుని-''బాగున్నాడుకదూ వీడు-ఆ మొహం మీద 'ఎక్స్‌ప్రెషన్' చూడండి....... ఎంత సహజంగా ఉందో—'' అని వాడిని ట్రేలో ఉంచేసి—'' వోకే......ఆ టేబుల్‌మీద పెట్టెయ్యండి— నేను బయటికి వెడుతున్నా—' అని మెట్లుదిగి పోర్టికోలో ఉన్న కారుదగ్గరికి నడిచారు.

ఇందాకా టాక్సీలో 'ట్రే' ఒలికినప్పుడు తాను సరిగా చూడలేదేమో, సరిగ్గా లుకర్ని ముట్టుకునేసరికి ఏదో ఒక బొమ్మ విరుగుతుందేమో అని ప్రాణాలన్నీ, 'ట్రే'లో పెట్టుకున్న ముకుందం పెదవులమీద తడిసిన అగ్గిపుల్ల వెలిగినట్లు, ఒక నవ్వులాటిది వెలిగింది. ''థాంక్యూ'' అని మిగత మెట్లు దాటి వరండా చేరాడు.

— 'ఆ జీసస్ బొమ్మ, ఆ క్షణాన తన, అంతరంగానికి అచ్చం వ్యతిరేకంగా, ఎంత ప్రశాంతంగా ఉంది !' అనుకుంటూ ముకుందం వరండా దాటుతున్న ఆ నిముషాన్నే— ఆ సౌధంబులో నొక మూలగా జార్జి అనే డాఘ్‌హౌండ్ శునకము గొంతెత్తి తన ఆకలిని తెలుపగా, సింహానికన్న గ్రామసింహాలమీద భయభక్తులుగల ముకుందం భయంతో పిడచగట్టుకుపోయి, తూలి పడపోయి, తట్టుకుని నిలబడ్డాడు. భీత నేత్రుడై పరికిస్తే ఆ పరిసరాలలో క్రూర మృగాలేమీ కనపడలేదు. కాని అతడి చేతిలోని 'ట్రే'లో నలుగురైదుగురు అలిసి పడుకున్నట్టు కనపడింది.

కారెక్కబోతూ సిగరెటు వెల్గించుకునే నిమిత్తం క్రింద పోర్టికోలో నిల్చున్న లుకర్ని అదే క్షణానికి ఇటు చూచారు.

ఆయన చూశాడేమో తన నృత్య విలాసం, అని తల వెనక్కుతిప్పి, ఆయన నిజంగానే చూస్తున్నాడు బాబోయ్ అని తెలుసుకుని అబ్బే నేను పోర్టికో చూడడం కేవలం మెడ పొరపాటు అన్నట్లుగా మెడనిటూ అటూ త్రిప్పి, అది ఆపి, గడప జాగ్రత్తగా దాటి హాల్లోని తివాసీమీద పన్నెండడుగులూ వేసి ఆ టేబిల్ దగ్గరకు చేరాడు ముకుందం. గోవర్ధనగిరిని క్రిందకు దింపుతున్న గోపాల కృష్ణుడిలా, పురిటికోసం పుట్టింటికొచ్చిన అమ్మాయిని అత్తవారింట క్షేమంగా దిగబెడుతున్న తండ్రిలా— ఆ 'ట్రే'ని టేబుల్‌మీద ఉంచాడు. ముకుందం. ఇందాక వరండాదాటి హాల్లోకి వస్తుండగా 'ట్రే' లో ముందు కొరిగిన నాలుగు బొమ్మలలోను మూడింటిని జయప్రదంగా నిల్చోబెట్టాడు. నాళ్గనశాస్త్రి— పెద్ద డ్రమ్ వాయిస్తున్న వాడిని— నిల్చోబెట్టబోతే, వాడి తలకాయ మాత్రం ముకుందం చేతిలోకి వచ్చినదాయెను !!

రెండుసార్లు 'లైటర్' సరిగా వెలగకపోతే, దానిని కోటు జేబులో పడేసుకుని డ్రైవర్ నడిగి అగ్గిపెట్టె తీసుకుని, అగ్గిపుల్ల వెలిగించి దానితో సిగరెట్టు ముట్టించబోతూ హాల్లో టేబిల్‌మీద 'ట్రే'ని అమర్చిన ముకుందాన్ని గమనించి, తృప్తికరంగా ఇటు తిరిగి సిగరెట్టు ముట్టించి అగ్గిపుల్లను పారేసిదానిమీద బూటుపాదం ఉంచారు లుకర్ని.,

పంచప్రాణాలు ఎగిరిపోగా, నవనాడులూ క్రుంగిపోగా తిరుపతి దేవుడికి కొట్టవలసిన కొబ్బరికాయల సంఖ్యను అర్జెంటుగా అయిదింటికి తగ్గించేసి— నడి సముద్రంలో మునిగిపోతున్న ఈతరాని వాడిలా— కేవలం మానవాతీతమైన శక్తి ప్రేరేపిస్తుండగా— ఒక్క క్షణం పోర్టికోవైపు చూసి, లుకర్ని వంగి సిగరెట్టు దగ్గరకు వెళ్తున్న అగ్గిపుల్లను చేరు

స్తున్న ఆ లిప్తలో డ్రమ్‌మాస్టర్ తలనూ, డ్రమ్‌తోకూడిన దేహాన్ని ఒక్క వూపుతో ఎడమ పిడికిలిలోకి తీసుకుని, పంట్లాంయొక్క ఎడమ జేబులోకి తోసేసి నిల్చున్నాడు ముకుందం.

ఇతడొచ్చిన టాక్సీ ఇందాకనే వెళ్లిపోయింది, వచ్చేట్లయితే, ఓ నిముషం ఆగి, కుర్రవాడిని మన కారులో తీసుకెళ్లి దిగబెడదాం. అనుకుని లుకర్నీ మొదటిసారిగా సిగరెట్టు పీల్చి హాలువైపు చూచాడు.

అనేక యుగాల క్రిందనగా ఈ లుకర్నీ అన్న మానవుడు కారులో ఎక్కుతానని మాటఇచ్చి మెట్లు దిగినవాడు, ఆ డ్రైవర్ అట్లా కారు తలుపు తెరచి పట్టుకుని ఉన్నా, ఆ కారుసీటు అంత మెత్తగా విశాలంగా హాయిగా ఆహ్వానిస్తున్నా— వెళ్లి లోపల కూచోడేం అని టేబిలు ప్రక్కనే నిల్చున్న ముకుందం మథనపడ్డాడు.

ఇందాకనగా 'ట్రే'ని టేబిల్‌మీద పెట్టిన ఈ అబ్బాయి ఇంకా అక్కడే నిల్చున్నాడేం— పాపం అందమైన ఆ బొమ్మల్ని విడవలేక పోతున్నాడు కాబోలు— నిజంగా ఆ కళాతృష్ణ అనేది ఉంటే అంతే— అనుకుని ఇంకోసారి సిగరెట్టు పీల్చారు లుకర్నీ.

చరణ్ సింగ్ అన్న చాకలివాడు, ముకుందానికి మూడేళ్లుగా బట్టలుతికినవాడు, బటన్లమీద ఇట్లమీద అంతగా దయలేనివాడు, అంతకుముందు వెళ్లిన ఆదివారం పొద్దున్న ఉతికి తెచ్చిన తెల్ల డ్రిల్ పంట్లాములో ఎడమ జేబుని కొంచెం బలహీనమైన దశలో ఇచ్చి వెళ్లాడు. ఇటువంటి పరిస్థితి ఒకటి, ఒకటి, వంద ఏళ్ల తర్వాత ఒకానొక ప్రాచ్య దేశంలో ఏర్పడుతుందని ఎరగని జర్మన్ కళాకారుడు తాను చేసిన ఇరవై నాలుగు బ్యాండు వాయిద్యగాళ్ల గాజు బొమ్మలలో ఏ ఒక్కటి కూడా సగటున రెండు వందల గ్రాముల బరువుకు తగ్గకుండా ఉండేటట్లు చేశాడు. ఆ జర్మన్ కళాకారుడు ఇక్కడ ఈ చరణ్ సింగ్‌డు, వీళ్లిద్దరి కుట్ర ఫలితంగా— సరే ఇక లాభం లేదు అనుకుని అనాదిగా భారతీయులలో రక్తనాళాలలో ప్రవహిస్తున్న ధైర్య శౌర్య సాహసాది గుణాలను క్రోడీకరించుకుని కాళ్లల్లోకి తెచ్చుకుని ముకుందం ఒక్కడుగు ముందుకువేసిన క్షణాన్నే అతడి పంట్లాంయొక్క ఎడమ జేబు కొద్దిగా చిరగగా తద్వారా డ్రమ్ మాస్టరుగారి తలభాగం బావిలోకి దిగుతున్న బొక్కెనలాగా రంయ్‌మని ముకుందంయొక్క ఎడమ మోకాలిమీద ఉన్న కుక్క కాటు మచ్చమీదుగా, పంట్లాం లోపలి వైపునే జారి, అతడి పాదం దగ్గర పంట్లాం మడతకూ బూటుయొక్క ఒక వేపు తోలుకీ మధ్య అదో మాస్తరు అస్థిర నిశ్చలతతో నిలబడింది.

''హా ! ఏసునాథా ! ఇంక నీవేగతి— అని పైకి చూశాడు ముకుందం. ఎడమ పాదాన్ని తేలుకుట్టినా ఆ క్షణాన అతడు దానిని కదిల్చి ఉండడని పందెం కాయవచ్చు !

సిగరెట్టు నాలుగో దమ్ములాగి, ఇటుచూసి సరే— ఆ జీసస్ చిత్రంలో పడ్డాడు. ఇతడు నిజంగానే కళాభిమాని ! అందుకు సందేహంలేదు, అని నిర్ణయించుకున్న లుకర్నీ కారు లోకి అడుగు పెట్టారు.

''మేరీ మాతా ! రామచంద్ర ప్రభో ! సిద్ధార్థా— ఫల్గుణా—'' అని నోటికొచ్చినట్లెల్లా దేవుడిని పిలుస్తూ ఈసారి అటు చూచేసరికి ఆ నల్లటి, దెయ్యంలాంటి కారు అక్కడి కనిపించరాదని హృదయపూర్వకంగా నమ్మి పోర్టికో వైపు చూసిన క్షణాన, కారు అక్కడ ఉండడమేకాదు, అందులో కూర్చుని ఉన్న లుకర్నీ తన్నుకూడా రమ్మంటూ చెయ్యి వూపడం కనిపించింది ముకుందానికి.

ఈ రోజుతో అయిపోయింది ముకుందం అనే చిన్నవాడి పని. ఇంక హరిహర బ్రహ్మాదులు కట్టకట్టుకొచ్చినా చేసేదిలేదు— అని కనుమూసి తెగిచేటంతలో గభుక్కున వంగి, అత్యవసరం మీద ఎడమ పాదాన్ని గోక్కుని — ఆ డ్రమ్ మాష్టరు పరమ దుర్మార్గుడు— వాడి తలను గభుక్కున పట్టుకుని, ఆ చేతిని పైకి గోడమీదకు పాకుతున్న నల్లిలా లాక్కుని, ఉరి కంబంవైపు అడుగులు వేస్తున్న శిక్షితుడిలా పోర్టికోవైపు తిరిగాడు ముకుందం.

సరిగ్గా ఆ క్షణాన్నే ముందుకు కదిలింది నల్లకారు !

తను వంగి ఏదో తీయడం ఆయన చూచాడా ?

ఇంతసేపు ఇట్లా నిల్చోవడం గురించి ఏమనుకున్నాడు?

—అన్న ప్రశ్నలు ముకుందం మెదడు మీద సమ్మెట పోటులై కొడుతుండగా, ఆ రాయబార కార్యాలయంలోని ఒక కార్యదర్శి— అటువచ్చిన వాడు— అడిగాడు— ''అరె ! మీరు వర్షంలో తడిసి వచ్చినట్లున్నారే—'

''హిహిహి. . . అవును. . . మరే. . . తడిశా. . . మరే. అవును—'' అంది ముకుందం గొంతు.

''మరిటువైపు మంచి ఎండ కాస్తోంది, బొట్టు వర్షం లేదు !—'' అని ఆశ్చర్య పోయాడు కార్యదర్శి.

''. . . కాని మా యూనివర్సిటీ వైపు వారం నుండి ఒకటే వర్షం. . . ధారాపాతం. . . కుంభోపాతం. . . జలపాతం''

''అబ్బా ! పత్రికల్లో ఎక్కడా చూడలేదుస్మండీ—''

''పత్రికలా ! హాహా ! వాన దేవుడినీ పత్రికల వాళ్ళనూ డబ్బా వాయించే వాళ్ళనీ ఎప్పుడూ నమ్మకండి. . . వస్తా—'' అని ఎడమ పిడికిలిని బిగించి పంట్లాం జేబులో నుంచి, ఆ జేబు చిరుగు మధ్య ఇరుక్కుని ఉన్న డ్రమ్ మాస్టర్ మొండెం క్రిందికి జారకుండా ఎడమ చేత్తోనే నొక్కిపట్టుకుని, ద్రౌపతమ్మ తిరునాళ్ళలో నిప్పులు తొక్కుతున్న వాడిలా— స్పానిష్ డాన్సర్‌లా—అలా అలా నడవ బోతుండగా—''మిస్టర్ ముకుందం? అని ఎవరో పిలుస్తున్నట్లుంటే— అది తన అంతరాత్మయే ననుకుని మరింత జోరుగా వడివడిగా అడుగులు గజాలు వేసుకుంటూ హాలు, వరండా, తోట అన్నీ దాటి రోడ్డు మీద కొచ్చి నిలిచాడు ముకుందం. అరవై యేళ్ళు కారాగారంలో ఉండి స్వేచ్ఛలోకి వచ్చినట్లు— హాయి అన్పించింది.

అది అర నిముషం మాత్రమే.

మరుక్షణం చేతిలో ఉన్న డ్రమ్ మాస్టర్ తల గుర్తొచ్చింది. జేబులో మొండెం బరువెక్కసాగింది. శవాలు బరువెక్కుతాయట. నిజమే !

హా ! తను చచ్చిపో గలిగితే బ్రతుకెంత బాగుండేది !

ఎదలో పదిలక్షల అమావాస్యలు ఆవరించగా హాస్టల్‌లో తన గది చేరాడు ముకుందం. ఆ రోజల్లా ఎవరి మొహమూ చూడ దలచుకోక గదిలోపల గడియ పెట్టుకున్నాడు.

కాని సాయంకాలం అదే పనిగా ఎవరో బాదితే తలుపు తెరిచాడు. ఫోన్ మీద ఎవరో ఇప్పటికి రెండుసార్లు పిలిచారు, ఇది మూడవసారి అని ప్యూన్ చెబితే వార్డెన్ గదిలోని ఫోన్ వద్దకు పరుగెత్తాడు ముకుందం.

''హల్లో ముకుందం ! నేను మిసెస్ లుకర్ని—''

అయ్య బాబోయ్— ఫోన్ మీద. . . ?

''మిస్టర్ ముకుందం— నిద్దన్నే చెబుదామని మిమ్మల్ని పిలుస్తుంటే మీరు వినిపించుకోకుండా వెళ్ళిపోయారు— ఎల్లుండి మా దేశ స్వాతంత్ర్యోత్సవ దిన సందర్భంగా రాత్రి ఎనిమిదింటికి డిన్నర్ పార్టీ ఉంది. మీకు పోస్టులో ఆహ్వానం అందుతుంది. తప్పక ఉండి.''

హమ్మయ్య. . . నిజంగా దేవుడున్నాడు !

''ఆ తర్వాత మిస్టర్ ముకుందం ! ఆ డ్రమ్ మాస్టర్ విషయం—''

అయింది. . అయిపోయింది. . . జనం గశే ! రండి, ముకుందం నరకబడుతున్నాడు— చూడండి—

''ఆ బ్యాండ్ సెట్‌లో డ్రమ్మర్ బొమ్మ మెడదగ్గర ఇదివరకు ఒక్కసారి క్రిస్మస్‌లో విరిగితే 'సొల్యూషన్' పెట్టి అతికించాము. మొదట మీకా బొమ్మలు ఇచ్చినప్పుడే చెపుదామనుకుని లుకర్ని మరిచి పోయారట— అదీ సంగతి ! తప్పక ఎల్లుండి రండి— ఆ గాజు బొమ్మతో—''

—''వ్హాట్ !'' అని టార్జాన్‌లా పొలికేక పెట్టి టెలిఫోన్ పారేసి, ఎగిరి టేబిల్ దాటి అవతల ఉన్న వార్డెనును తన బిగి కౌగిలిలో వోలలాడిస్తూ—

''రెండు వందల కాయిలూ— ఆ !. . కొట్టేయవలసిందే'' అన్నాడు ముకుందం.

''ఈ కుర్రవాడు తాగివచ్చాడు — ప్రిన్సిపాలుతో చెప్పాలి''—అనుకుని ఆ కౌగిలి బయటికి వచ్చాడు వార్డెనుడు?



**కలగూరగంప :**

# జవహర్ లాల్ నెహ్రూ

## శ్రీ ఆర్నాల్డ్ టోయన్‌బీ

నేను శ్రీ నెహ్రూను బాగా ఎరిగి ఉన్న వాళ్లలో ఒకడిని కాదు. ఆయన్ను అట్టేసార్లుకూడా నేను కలుసుకోలేదు. కాని ఒక్కసారి ఆయన్ను కలుసుకున్న వాళ్లెవ్వరు ఆయన్ను మరచిపోరు. ఆయనలో ఉన్న ప్రభావం అటువంటిది. కలుసుకున్న వాళ్లమీద అది అటువంటి ముద్రవేస్తుంది. ఏళ్లు జరిగిపోవచ్చు, ఆ ముద్రమాత్రం చెరగదు. దాన్ని నిజానికి ముద్ర అంటే చాలదు. అది మామూలు ముద్రకాదు. ఆ ప్రభావాన్ని చెప్పడానికి ఆ మాట చాలదు. ఆ చెప్పే శక్తి ఆ మాటకు లేదు. బలంలేనిదిగా ఉంటుంది. నెత్తురు చచ్చిన విధంగా ఉంటుంది. 'సమ్మోహం' అన్నమాట ఉంది. అది ఆ ప్రభావంలోని నిజాన్ని కొంతవరకు పట్టి ఇస్తుంది. ఇక్కడ ఒక మనిషి ఉన్నాడు. ఆ మనిషి నిన్ను ఇట్టే ఆకర్షించగలడు. నీ హృదయాన్ని వశం చేసుకోగలడు. దీన్ని అట్లా అట్టిపెట్టుకోగలడు.

జీవితంలో బహు మార్గాలు ఉన్నాయి. అందులో ఏ మార్గంలోనైనాసరే ఇట్లా జరగడం అన్నది కొంచెం విషయం కాదు. పెద్ద విషయం. అయితే ఆ మనిషి అంత ఉన్నతుడు కాదనుకోండి ; ఎవరికి తెలియని వాడనుకోండి ; అతని స్థితి, హోదాగూడా అటువంటివే అనుకోండి ; అప్పుడు అందులో పెద్దగా ఆశ్చర్యం చెందవలసిందిలేదు. చెప్పుకోవలసిందీ లేదు. కాని ఆ మనిషి ప్రపంచం అంతా ఎరిగిన, కీర్తిచేత సుప్రతిష్ఠితుడైనవాడైనపుడు, ప్రపంచాన్ని తన గొప్పతనంచేత అమితంగా ప్రభావితంచేసిన వాడైనప్పుడు, తన ఒక్కదేశంలోనే గాక, సకల ప్రపంచం అంతటా ఆ వ్యక్తి అట్టిడు అయినప్పుడు అప్పుడు అది ఆశ్చర్యానికీ కారణం అవుతుంది; దాన్నిగూర్చి చెప్పుకోనువలసి వస్తుంది.

ఇప్పుడు శ్రీ నెహ్రూ ఉన్నాడు. ఆయన పెద్ద రాజకీయవేత్త. నయశాస్త్రధిషణా విచక్షణుడు. గొప్పవాడు. ఆయనలోఉన్న ఉదాత్తవ్యక్తి ఉన్నతమైంది. ఈ రాజకీయ వేతృత్వము ఆయనలోని ఆ ఉదాత్త వ్యక్తిని ఏమీచేయలేకపోయింది. నేను ఇక్కడ ఒక్కమాట చెప్పి తీరాలి. నెహ్రూలో ఆడంబరత్వంలేదు. వికత్థనంలేదు. ఆత్మప్రత్యయ బుద్ధి లేదు. తాను గొప్పవాడినన్న అహంభావంలేదు. ఆయన అధికారంలో ఉన్నాడు. ఆ అధికారంలో ఉన్న సంవత్సరాలు బరువుతో కూడిన సంవత్సరాలు. ఆ బరువు అత్యంతము భారమైంది. మోయడానికి వీలులేనంత బరువు అది. ఆ బరువును మోస్తూ గూడా నెహ్రూ నిసర్గంచేత సాధువు, ఉత్సాహంచేత బాధ్యము అయిన యౌవత లక్షణాన్ని, శక్తిని పోగొట్టుకోలేదు. నిల్పుకున్నాడు. చివరి రోజుల్లో, అనుకోకుండా చైనాతో పొరపొచ్చాలు వచ్చిన అనంతరం, ఆ బరువు అతనికి బరువైంది. ఆ భారం ఆయన్ను వంచివేసింది.

అవి యుద్ధం జరుగుతున్న రోజులు. నెహ్రూను అప్పుడే ఖైదునుంచి వదిలిపెట్టారు. బ్రిటిష్ ప్రభుత్వం విధించిన ఒక విడత జైలుశిక్షను అప్పుడే పూర్తిచేశాడు. బయటికి వచ్చాడు. విశ్రాంతికోసం ఇంగ్లండుకు వచ్చాడు. ఒక ఇంగ్లీషు ఆవిడకు నేను నెహ్రూను చూస్తే బాగుంటుందనిపించింది. ఆయన్ను కలుసుకునేందుకు నన్ను తన ఇంటికి భోజనానికి పిలిచింది. ఆ మొదటిసారి నేను నెహ్రూను అట్లా కలుసుకున్నాను. ప్రథమమైన ఆ సమావేశంలోనే ఆయన సత్తా ఏమిటో నాకు తెలిసిపోయింది. ఆయన వ్యక్తిత్వంలోని ప్రధాన తత్వము, సారము ఏమిటో అప్పుడు నాకు గోచరించాయి. ఆ సమావేశం వాటిని పైకి తెచ్చింది. ఒకవిధంగా వాటిని పెల్లుబకచేసింది. ఆత్మకు అది సంతోషం కల్గించింది. వెల్గను ఇచ్చింది, నైతికంగా మనస్సుకు హత్తుకుపోయింది.

అప్పుడు జరిగింది చెబుతాను. నేను ఆ ఇంటికి భోజనానికి వెళ్లాను. అప్పటికే నెహ్రూ అక్కడికి వచ్చాడు. ఇంతలో ఇంకో అతిథి వచ్చాడు. ఆయనకోసం తలుపు తెరిచారు. ఆ వచ్చినాయన ఒక బ్రిటిష్ సేనాని. యూనిఫారంలో ఉన్నాడు. ఆ సేనాని నెహ్రూను చూచాడు. అంతే. పెదిమ విరిచాడు. ఆయన ముఖం పాలిపోయింది. నెహ్రూ అనుభవించి వచ్చిన జైలుశిక్షతో ఈ సేనానికి బహుశా ఏదో సంబంధం ఉండి ఉంటుంది. ఇంతకీ ఈ గేస్తురాలు నెహ్రూను, ఆ సేనానిని ఇట్లా భోజనానికి ఆహ్వానించడం ఎట్లా జరిగిందో నాకు ఇఌతవరకూ అంతుపట్టలేదు. ఆమె చెయ్యాలనే ఇట్లా చేసిందా ? లేక తెలియక ఇట్లాచేసిందా ? నేను తెలియకే చేసిందనుకుంటున్నాను. ఆమె భర్తగారికుటుంబానికి భారతదేశంతో ఎంతో కాలంగా సంబంధం ఉంది. ఇప్పుడు ఈ వ్యక్తులకు ఇద్దరికి కూడా భారతదేశంతో ఏదో విధమైన సంబంధం ఉండి ఉన్నది గనుక, ఇట్లా వారిని భోజనానికి ఆహ్వానిస్తే బాగుంటుందని,

అందులో తప్పులేదని ఆమె అనుకుని ఉంటుంది. స్పష్టంకాని ఆలోచన చేసి ఉంటుంది.

ఇది విచిత్రమైన పరిస్థితి. ఇప్పుడు నెహ్రూ ఏమి చేస్తాడా అని నేను అనుకున్నాను. ఎట్లా ప్రవర్తిస్తాడో చూద్దామనుకొన్నాను. ఆ సేనాని రాకముందు కొద్ది నిమిషాలసేపు ఏవో కబుర్లు చెప్పుకున్నాను. కాస్త సేపట్లోనే నెహ్రూ ఉగ్రస్వభావం ఏమిటో తెలిసిపోయింది. ఆయన ఏమీదాచుకోలేదు. దాపరికం లేకుండా మాట్లాడాడు. బ్రిటన్‌నుంచి భారతదేశానికి స్వాతంత్ర్యం సంపాయించి తీరాలి. అందుకు తాను చేయ వలసినదంతా చేస్తాడు. అదో యుద్ధం. ఆ యుద్ధంలో ఆయన కంఠందాకా ఉన్నాడు. ఇప్పుడు ఈయన ఈ బ్రిటిష్ సేనానిని ఎట్లా చూస్తాడు ? పెడసరంగా ఉంటాడా? పెళుసుగా వ్యవహరిస్తాడా ? ఇప్పుడిదేమన్నా అభాసైపోతుందా? ఇందుకు అప్పుడే సమాధానం వచ్చింది. నెహ్రూ కళ్లు మందంగా, మృదువుగా హసించాయి. ఇక్కడి పరిస్థితి ఆయనకు ఏదో విచిత్రంగా ఉన్నట్లనిపించినట్లుంది. ఆయనమాకు ఉల్లాసాన్నిసమకూరుస్తూ, ఆ సేనానిని మధురంగా ఏడిపించాడు. మర్యాదగా వేపుకుతిన్నాడు. ఒక్కొక్క విసురు తగులుతూ ఉంటే, ఆ సేనాని ఒక్కక్కొ మెట్టుగా దిగివచ్చి, కొంచెం ఇరుకున ఉండే అనుకోండి, సమాధానపడుతూ వచ్చాడు.

ఈ సంఘటన పెద్ద విశేషమైనదేమీకాదు. కాని ఇందువల్ల నాకు నెహ్రూ అంటే ఏమిటో తెలిసింది. నేను ఒక ఉదాత్తమైన ప్రకృతిగల మానవుని సమక్షంలో ఉన్నాను. ఆ మానవుడు ఎటువంటి వాడు ? పోరాటం సాగించగలవాడు. ఎట్లా పోరాటం సాగించగలవాడు ? విరోధియందు, మానవుడైన ప్రత్యర్థియందు ద్వేషం పెంచుకోకుండా పోరాటం సాగించ గలవాడు. అటువంటి మానవుని సమక్షంలో నేను అప్పుడు ఉన్నాననిపించింది. బ్రిటిష్ వాళ్లంటే ద్వేషించడానికి తగినంత కారణం నెహ్రూకు ఉంది. ఆయన వారి చేతులలో పొందిన అనుభవంయొక్క లక్షణం అటువంటిది. మనుష్యుని జీవిత కాలమే అల్పమైంది. అందులో పరంపరగా ఖైదుల్లో పడి మగ్గడం అంటే, అది ఆ జీవిత కాలాన్ని ముక్కముక్కలుగా, బాధాకరంగా తినివేస్తుంది. బ్రిటిష్‌వారే ఉన్నారు. వాళ్లు తమ దేశంలో కొన్ని ఆదర్శాలను సిద్ధాంతాలను పెట్టుకున్నారు. వాటిని గాఢంగా విశ్వసించారు. వాటియందు వారికి తేలిక భావం లేదు. ఈ ఆదర్శాలనే, ఆ సిద్ధాంతాలనే పెట్టుకొని, గట్టిగా పట్టుకొని భారతీయులుకూడా తమ స్వాతంత్ర్యం కోసం పోరాటం సాగిస్తున్నారు. అందుకు వారిని, ఆ స్వాతంత్ర్య వీరులను బ్రిటిష్‌వారు జైళ్లకు పంపిస్తున్నారు. పరిస్థితి ఇది. ఇక్కడ నెహ్రూకు ద్వేషం ఉండటానికి కారణం ఉంది. నెహ్రూ ఆ ద్వేషాన్ని ఏమాత్రం చూపించలేదు. అసలు ఆ ద్వేషమే ఆయనలో లేదు. ద్వేషంపెట్టుకోకుండా పోరాటంసాగించడం అన్నది మహాత్మా గాంధీ సిద్ధాంతాలలో ఒకటి అని నేను విన్నాను. ఇప్పుడు ఇక్కడ ఆయన సహచరులలో అతి ప్రధానులలో ఒకరైన నెహ్రూలో దాన్ని దర్శించాను. యదార్థ జీవితంలో బైబిలులో చెప్పబడి ఉన్న పార్వతీయ సూక్తం (సెర్మన్ ఆన్ ది మౌంట్) ఆచరింపబడుతూ ఉండటం ప్రత్యక్షంగా చూచాను. అది ఏదో చెయ్యాలని ఆయన చేస్తున్నట్లుగా లేదు. అతిలేదు. ప్రయత్నంలేదు. ఇవి ఏవీలేని, అచ్చమైనతనం మాత్రమే అందులో గోచరించింది. నేను తల్లక్రిందులైపోయినాను. ఇప్పటికీ ఆ సంఘటన నా మనస్సులో అట్లా నిల్చిపోయింది; ఎప్పుడో ముప్ఫయి ఏళ్లక్రింద జరిగినట్లుకాదు; ఇవ్వాళ్లనో నిన్ననో జరిగినట్లు.

నెహ్రూను గురించిన ఇంకో సంగతికూడా నా స్మృతిపథంలో నిల్చి ఉంది. అది ఈ చెప్పిన దానికన్నా అల్పిష్టమైంది. అయితే ఇదికూడా నెహ్రూ వ్యక్తి లక్షణం ఏమిటో స్పష్టంగా చెబుతుంది. 1956. ఢిల్లీ విశ్వవిద్యాలయంవారు నన్ను గౌరవిస్తున్నారు. నాకు ఒక గౌరవ పట్టా ఇస్తున్నారు. ఆ పట్టా ప్రదాన ముహూర్తం సమీపించింది. నేను ఇంకా ఆ విశ్వ విద్యాలయం ఆవరణకే ఎంతో దూరంలో ఉన్నాను. విశ్వవిద్యాలయం ''ఏడు దేహాళీలకు'' (లేక అవి పదునాల్గు దేహళీలా?) ఎదురుగా చివరను పాత సివిల్ లైన్సులో ఉంది. అశోకా హోటల్‌కు ఎంతో దూరం. షాజహానాబాద్ వీధులు జనంతో కిటకిటలాడుతూ ఉంటాయి. బళ్ల రాకపోకలు మిక్కుటంగా జరుగుతూ ఉంటాయి. మేము అక్కడ ఇరుక్కుపోయాము. ఎట్టకేలకు ఎట్లాగో అట్లా విశ్వవిద్యాలయానికి రెండు ఫర్లాంగుల దూరంలో పడ్డాను. (అప్పటికే ముప్పావు గంట ఆలస్యం అయిపోయింది). అక్కడికి చేరుకునేసరికి నన్ను నేను నమ్మలేకపోయినాను. నెహ్రూ మా వైపుకు పరుగు పెట్టుకుంటూ వస్తున్నాడు. ఇదియేమో ఒక విశ్వవిద్యాలయం నాకు చేస్తున్న మర్యాద. ఇందులో నన్ను తాను స్వయంగా సంతోష పెట్టడానికి, నాయందు మర్యాద నెరపడానికి ప్రధాన మంత్రియైన ఆ వ్యక్తికి ఎక్కడ వ్యవధి చిక్కింది ? ఎట్లా ఆ వ్యవధిని ఆయన చిక్కించుకోగల్గాడు ? అంతమంది జనం ఉండగా, ఆ అందరిలోను, ఆయనే నన్ను వెతుక్కుంటూ ఎందుకు బయలు దేరాలి ? నా మూలంగా ఆయన కాలంలో ఒక మూడు పావుగంటలు వృథా అయిపోయింది. అయినా ఆయన నాయందు కోపం చెయ్యలేదు. విసుక్కోలేదు. బాధ పడలేదు. ఆ బాధ పడినవాళ్లు ఆయన అంగరక్షకులు. ఆయన్ను వేయి కళ్లతో కాపాడటం కోసం నియమితులైవున్న రక్షక భటులు. మేము ఇద్దరం కలిసి విశ్వవిద్యాలయాన్ని చేరుకునే వేళకు వాళ్లు ప్రధాన మంత్రి తమ్ము దాటిపోకుండా ఆపలేక పోయినందుకు ఇరుకున పడిన పక్షుల్లాగా కొట్టుకున్నారు. వాళ్లు అట్లా ఆందోళన చెందడం సహజమే. మహాత్మా గాంధీని ఏమి చేశారు; హత్య చేశారు. ఇప్పుడు ప్రధాని ఎవరు ? ఆ మహాత్మాగాంధీ వారసుడు; ఆయన అప్పగించిన భారాన్ని వహిస్తున్న వాడు; కాదా ?

1960లో నేను నెహ్రూను ఆఖరిసారి కలుసుకున్నాను. అప్పుడు ఆయన్ను చూచినప్పుడు నాకే దుఃఖం వేసింది. ఆయన

ఆత్మ తత్వంలో మార్పులేదు. కాని మోస్తున్న బరువుక్రింద ఆయన బాధపడుతున్నాడు. నలిగిపోతున్నాడు. నన్ను వచ్చి తన్ను చూచి పోవలసిందన్నాడు. నేను ఆయన్ను చూడ్డానికి వెళ్లాను. మేము మా ప్లీడుకునేప్పుడు చైనా సంగతి రాకుండా ఉండేందుకు ఎంతో ప్రయత్నం చేశాను. నాకు తెలుసు. ఈ చైనా ఆయన్ను ఆ క్షణంలో మహా వేపుకు తింటోంది. కాని నా ప్రయత్నం ఫలించలేదు. నేను ఏమి చేసినా లాభం లేకపోయింది. ఆయనే ఆ సంగతి ఎత్తాడు. చూస్తే ఆయన వికలుడైనట్లనిపించింది. ఆ చైనా బాధ ఆయన్ను పట్టుకొని వదులుతున్నట్లు లేదు. అదో మానసిక గ్రంధిలాగా తయారైపోయింది. పూర్వం నేను ఆయన్ను కలుసుకున్నప్పటికి, ఇప్పుడు ఈ కలుసుకోడానికి ఏమి సంబంధం ? వాటికి, దీనికి పోలిక లేదు. అయినా నాకు ఆశ్చర్యాన్ని కూర్చిన విషయం అప్పుడు ఇప్పుడు ఒక్కటిగా ఉంది. ఇప్పుడు గూడా నెహ్రూలోని ఉదాత్త మర్యాదయైన వ్యక్తి లక్షణం అట్లాగే ఉంది. అందులో మార్పులేదు. ఇది నాకే కాదు. ఎవరికైనా సరే అద్భుతమనిపిస్తుంది.

నేను ఆజాద్ ఉపన్యాసాలు ఇవ్వడానికి ఢిల్లీ వెళ్లాను (ఈ ఉపన్యాసాలలో మొదటి వరస ఉపన్యాసాలు నెహ్రూయే ఇచ్చారు). నేను లేచి, ఉపన్యాసం ఇవ్వడానికి ఉపక్రమిస్తున్నాను. ఇంకా సరిగా ఉపక్రమించక ముందే ప్రధానమంత్రి ఆ హాలులోకి వచ్చారు. నేను అతిథిని. నాకు సంతోషం కల్గేట్లు చెయ్యాలి. నేను సంతోషించాలి. ఇప్పుడు నేను వచ్చిన పనితో ఆయనకు పెద్దగా సంబంధం లేదు. అయినా ఆయన నా కోసం తీరిక చేసుకు వచ్చాడు. ఇది ఆ ప్రధాన మంత్రి మహానుభావతకు, ఔదార్యానికి తార్కాణ. అందులో ఆ రోజు ఎటువంటిది? నెహ్రూకు పెద్ద కష్టాన్ని, విచారాన్ని తెచ్చిపెట్టిన రోజు. ఆ రోజునే లేడీ మౌంట్‌బాటన్ అస్తమించారు. లేడీ మౌంట్‌బాటన్‌కు, నెహ్రూకు ఉన్న స్నేహం, అన్యోన్యత, అత్యంతము సన్నిహితమైనటువంటిది. నెహ్రూ హృదయం స్నిగ్ధమైంది. అక్కడ స్నేహానుబంధాలు తక్కువ విషయాలు. ఆ స్నేహం సన్నిహితమైనది, గాఢమైనది అయినప్పుడు చెప్పవలసిన పనిలేదు. మనబోటి వాళ్లలోనే ఇటువంటి స్నిగ్ధ లక్షణాలు ప్రచురంగ ఉంటాయి. నెహ్రూలో అది మరీ ఎక్కువ. అటువంటి స్థితిలో నెహ్రూ వచ్చారు. నా హృదయం అందుకు ద్రవించక ఏమి చేస్తుంది ? నా హృదయం కరిగింది.

నెహ్రూ చారిత్రక పురుషుడు. ప్రపంచం యుగయుగాలు ఆయన్ను స్మరిస్తూ ఉంటుంది. మరిచిపోదు. మరిచిపోలేదు. కాని ఆయన్ను గూర్చి ముందు కాలములోని వాళ్లు ఏమనుకుంటారు ? ఆయనను గూర్చి ఎటువంటి స్మృతులు వారికి అందుతాయి ? కాలభిత్తికపై ఆయన్ను గూర్చిన ఎటువంటి 'చిత్రం' ప్రసారితం మవుతుంది ? ఆయన్ను నాకన్నా బాగా తెలిసినవాళ్లు వున్నారు. ఆయన ఎంతటి ప్రియతముడైన మానవుడో, ఉదాత్త మనస్వియో వారికి నాకన్నా ఎక్కువగా సన్నిహితంగా తెలుసు. ఒక్కసారి ఆయన్ను కలుసుకుంటే, మరిచిపోలేని ఆయన ముద్ర మనలో మిగిలి పోతుంది. అయితే వినుకలిమీద ఈ ముద్ర మసకమసకగా మందగిస్తుంది. కాలం గడుస్తున్నకొద్దీ రూపరి కూడా పోనువచ్చు.

నెహ్రూ మహా రాజకీయవేత్త. ప్రపంచం ఆయన్ను అట్లా గుర్తుపెట్టుకుంటుందా ? అందులో ప్రశ్నే లేదు. ఆయన మహా రాజకీయవేత్త అవును. అంతేనా. నేను చెప్పాను. సూచనగా పేర్కొన్నాను. నేను చెప్పింది సరియైన మాట అనుకుంటాను. అట్లా అని నమ్ముతున్నాను. రాజకీయాలలో ఆయన చాలా గొప్పవాడు. కాని అది ఆయన గురించిన విశిష్టత అని నేను అనుకోవడంలేదు. గొప్ప ఆత్మ లక్షణం గల ఒక మహా వ్యక్తి రాజకీయనాయకత్వం వహించడానికి ముందుకు వచ్చినందుకే మనం సంతోషించాలి. కృతజ్ఞులమై ఉండాలి. రాజకీయాలు పాపంలాంటివి. అవి నిత్య క్షాళనను వాంఛిస్తూ ఉంటాయి. ఆ క్షాళన, ఆ విముక్తి వాటికి అవసరం. మానవుని యొక్క కార్యక్షేత్రంలో రాజకీయాలు వట్టి మురుగుదొడ్లు. అక్కడ మనం కుటుంబంలో చూపించిన నీతిని గాని, లేక ఉద్యోగ వృత్తుల్లో చూపించిన నీతిని గాని చూపించము. మన ప్రవర్తన, మన నీతి రాజకీయాలలో వట్టి మట్టమైన స్థితిలో పడిపోతాయి. అక్కడ నైతిక ప్రమాణం తగ్గిపోతుంది. ప్రవర్తన దోషభూయిష్టం అవుతుంది. ఒక మహాత్ముడు రాజకీయాలలో తలదూరుస్తున్నాడు అంటే, తన కొరివితో తనే తన తలను గోక్కుంటున్నాడని అనవలసి ఉంటుంది. ఉదాత్తశీలురకు అందులో ప్రమాదం ఎదురవుతుంది. రాజకీయాలను పాపపంకిలం కాకుండా చేయడం అవసరమే. అది అతికష్టమైన పని. ఈ అవసరం ఎంతటిదో, ఆ కష్టం అంతటిది. రాజకీయాలు వట్టి ముకురు లక్షణం కలవి. పెంకిఘటాల వంటివి. వాటితో వ్యవహరించడం కష్టమైన అల్పమైన ఒక్క జీవితకాలంలో, ఒక్క తరంలో వాటిని ఉద్ధరించడం సాధ్యం అయ్యే పనికాదు. సాధ్యం కాదు. కార్యాచరణశీలమూ, దక్షత కల ప్రతిభావంతులైన వారు, ఆ ప్రతిభతో మహానుభావాలైనా ఆత్మ లక్షణాలను మేళవించి ఆచరణ ఉన్ముఖులయ్యే వాళ్లు కొందరు ఉంటారు. అరుదుగా ఉంటారు. వాటిలో మేటి అని చెప్పదగిన వ్యక్తికి గూడా ఒక్క జీవిత కాలంలో ఈ ఉద్ధరణ కార్యాన్ని నిర్వహించడం, సాధించడం అందివచ్చే సంగతి కాదు. పరిస్థితులు నిరంకుశంగా ఉన్నప్పుడు, ఎంతటి మహానుభావుడైన రాజకీయవేత్త అయినా, ఆ పరిస్థితులకు బానిస కాకుండా తప్పించుకోలేక పోవడం ఉంటుంది. విషాద జటిలమైన ఈ విషచక్రంలో ఇరుక్కు పోవడం, ఉదాత్త మనీషియైన రాజకీయవేత్త, మహానుభావుడైన రాజకీయవేత్త, మహాత్ముడైన రాజకీయవేత్త, తప్పక పడవలసిన యమబాధల్లో ప్రధానమైంది. ఒకరు తాము నమ్మిన సిద్ధాంతాల కోసం, ఆదర్శాల కోసం నిర్బంధితులు కావడం, నిర్బంధాన్ని అనుభవించడం— అంతకన్నా అదృష్టం, అంతకన్నా పవిత్రమైన విషయం ఇంకోటి లేదు. కాని అవే సిద్ధాంతాల పేర, అవే ఆదర్శాల పేర, ఇతరులను నిర్బంధించ వలసి వచ్చినప్పుడు, —దాన్ని మరి ఏమనాలి? ఇది ఒక విధంగా పొంతన లేని విషయం

నెహ్రూకు ఈ రెండు రకాల అనుభవాలు తటస్థపడ్డాయి. తన జీవితంలో ఆయన ఈ రెండు అనుభవాలను అనుభవించాడు. ఒక పెద్దదేశాన్ని, ఒక గొప్ప దేశాన్ని పాలించే బాధ్యతను నెత్తి మీద వేసుకున్నప్పుడు ఇటువంటి పరిస్థితే ఏర్పడుతుంది. ఇటువంటి బాధనే పడవలసి వస్తుంది.

నెహ్రూ రాజకీయ జీవితం ఉన్నతమైనదే; కాదనను. కాని ఆయనే ఆ జీవితం తనకు ప్రధానమైనదని, ముఖ్యమైనదని అనుకొని ఉండడు. అనుకొని ఉండడని నమ్మకం ఎందుచేత? ఆయనకు అదే పరమలక్ష్యం కాదు. తన తోటి మానవలోకాన్ని సేవించడానికి ఆయనకు అది ఒక మార్గం. అంతే. ముందు భారతీయులకు సేవచేయడం; వారు ఆయన స్వదేశస్థులు. వారి ఒక్కరికి సేవచేయడమే ఆయన కేవల లక్ష్యము కాదు. ఆయన మానవలోకం అంతటిని తనవారని భావించాడు. ఇట్లా అని ఆయనే చాలాసార్లు స్వయంగా చెప్పుకున్నాడు. బహిరంగంగా చెప్పుకున్నాడు. బాహాటంగా చెప్పుకున్నాడు. మానవలోకం శ్రేయస్సుతో, మానవజాతియొక్క భాగధేయంతో ఆయన ముడిపెట్టుకున్నాడు. వారి శ్రేయస్సుకోసం, ఉత్తమ స్థితికోసం ఆయన అటమటించాడు. గాఢంగా పట్టించుకున్నాడు. ఆయన దృష్టి ఇటువంటిది. ఇంతటిది. ఇందుకోసం ముందు తరాలవారు, ముందు కాలాల వారు ఆయన్ను గుర్తుపెట్టుకుంటారు. సంస్మరిస్తారు. ఇక్కడ ఒక్క విషయం ఉంది. చరిత్ర ఆయన్ను గూర్చి యదార్థాన్ని ఉన్న దానిని ఉన్నట్లు చెప్పాలి. ఆయన్నుగూర్చిన ఉన్న సత్యాన్ని ఉన్నట్లు తేల్చాలి. ఆయనను గూర్చిన తన మదింపులో, తన తీర్పులో చరిత్ర ఈ సత్యాన్ని ప్రతిబింబించేట్లు చెయ్యాలి. అప్పుడే ఆయన ఇట్టివాడని ముందు కాలాలవారికి గుర్తు తెలుస్తుంది.

చరిత్రకారులు వ్యక్తిని కట్టకుండా, వ్యక్తి నిష్ఠము చేయకుండా కొన్ని వర్గాలుగా చరిత్ర రచన సాగిస్తారు. ఆ పద్ధతి చందుకాయ పెట్టెలో సొరుగులు ఏర్పాటుచేసినట్లు ఉంటుంది. నెహ్రూను అట్లా వర్గీకరించడం కుదరదు. కష్టం అని నా అభిప్రాయం. నేనే గనుక నెహ్రూను గురించి వ్రాయవలసివస్తే ఇట్లా వ్రాస్తాను. నెహ్రూ తన సోదర మానవలోకానికి ఫలప్రదమైన సేవ చేశాడు. తన విశిష్ట వ్యక్తిత్వాన్ని ప్రదర్శిస్తూ మానవ ప్రపంచాన్ని సేవించాడు. పాశ్చాత్య సభ్యతను సంస్కృతిని ఇతర సభ్యతలకు, సంస్కృతులకు వివరించడంలో, ఆ ఇతర సభ్యతలను సంస్కృతులను పాశ్చాత్య సభ్యతకు సంస్కృతికి విడమరచి చెప్పడం, ఇందుకోసం చరిత్రలో పరంపరగా వ్యాఖ్యాతలు, భాష్యకారులు, మధ్యవర్తులు రావడం ఉంది. అటువంటి వారిలో నెహ్రూ ఒకడు. ఆయనకు సింహాసనం వారిలో. వర్తమాన కాలంలో పాశ్చాత్య ప్రపంచం, తదితర ప్రపంచంమీద తన ముద్రను గాఢంగా వేస్తున్నది. ఆ ముద్ర విప్లవాత్మకమైంది. ఈ ముద్ర, ఈ ప్రభావము ఎటువంటిదంటే, పాశ్చాత్యులు కానివారు దానిప్రకారం తమ్ము దిద్దుకోనన్నా దిద్దుకోవాలి. లేదా ఆ తాకిడికి తట్టుకోలేక నోరు వెళ్లకిల పెట్టనన్నా పెట్టాలి. అట్లా సాగుతోంది ఇది. మరి పాశ్చాత్య ప్రపంచం సంగతి ఏమిటి? ప్రపంచంలో అధిక సంఖ్యాకులు పాశ్చాత్యేతరులు. వారితో సర్దుబాట్లు చేసుకోక తప్పని పరిస్థితి ఈ పాశ్చాత్యులకు ఏర్పడిపోయింది. ఇప్పుడు సకల మానవలోకమున్నా ఒక నూతన సమాజంలో కాలుపెట్టడానికి అయిన సంధి కాలంలో ఉన్నట్లు అనిపిస్తున్నది. ఆ నూతన ప్రపంచంలో పడటానికి అయిన ప్రసవ వేదనను పడుతున్నది. ఇది సమాహారంమీద, మానవలోకం అంతటికి సంబంధించినదివలె సాగుతున్నది. ఇందులో బహుసంప్రదాయములు, బహు ఆచారాలు, పరస్పర విరుద్ధమైనవి, ఇంతవరకు మూలలకు నెట్టబడి ఉన్న బహుజాతులకు సంబంధించినవి గగ్గోలు చెందుతున్నాయి. ఈ వేదన, ఈ స్థితి ప్రారంభమై నాల్గు, ఐదువందల సంవత్సరాలు కావస్తున్నది. ఇన్ని సంవత్సరాలు ప్రపంచ చరిత్ర ఇటువంటి లక్ష్యంతో మానవలోకాన్ని నడిపించుకు పోతున్నది. నేను చేసిన నిదానం సరియైనదే అయితే, ఈ యుగంలో వ్యాఖ్యానము, భాష్యకర్తృత్వము, మధ్యవర్తిత్వము చాలా ప్రధానమైనవి కాకతప్పదు. వాటికి భూమిక చాలా ముఖ్యమైనది. అవి కీలకమైనటువంటివి. పట్టి రాజకీయ నేతృత్వమాత్రుని పనికన్నా, ఈపని గొప్పది. ముఖ్యమైనది. నిజం ఆలోచిస్తే, ఇటువంటి వ్యాఖ్యాతలు, ఇటువంటి భాష్యకారులు, మధ్యవర్తులు, వీరిలో శక్తిమంతులైనవారు, సమర్థులైనవారు రాజకీయాలకు దూరంగా ఉండి, రాజకీయపు గోదాలో అడుగుపెట్టకనే తమ పనిని సాగించుకుపోయారు. వారు పండితులై కవులై, శిల్పులై, రచయితలై, ప్రవక్తలై ఈ పనిచేశారు. నెహ్రూ ఇదేపనిని రాజకీయరంగాన్ని కార్యక్షేత్రంగా చేసుకుని నిర్వహించారు. రాజకీయరంగస్థలంపై ఈ భూమికను పోషించారు. రాజకీయవేత్తలై భాష్యకారులుగా చరించిన వారితో ఒక తెగకన్నా ఎక్కువ తెగ వ్యక్తులు గోచరిస్తారు. వీరిలో సేనానులు ఉన్నారు. ద్రష్టలున్నారు. వీరిలో మొదటి తెగకు చెందిన వారు పీటర్, మహమ్మదాలీ, కమాల్‌అటాటర్క్‌లు. జపానులో 'మీయిజి' విప్లవాన్ని తెచ్చిన వారినికూడా ఈ తెగలో చేర్చవచ్చు.

జవహర్‌లాల్ నెహ్రూ ఈ తెగకు చెందినవాడుకాదు. మానవలోకాన్ని హింసచేత కాక, నిర్బంధంచేత కాక, బలవంతంచేత కాక, ప్రతిమాలుట చేత, నచ్చ చెప్పడముచేత, చెప్పి ఒప్పించడముచేత కదిలించేవాళ్లు, కదిలించి ముందుకు తీసుకుపోయేవాళ్లు కొందరు ఉన్నారు. జవహర్‌లాల్ ఈ తెగకు చెందినవాడు. ఈ మార్గానికి ప్రవర్తకులని మనము చెప్పుకోవలసినవాడు—వారు అందరు భారతీయులే. నెహ్రూకు వలెనే వారును భారతీయులు. వారిలో ఒకడు అశోకుడు. చక్రవర్తి. జీవితంలో అనుభూతమైన అనుభవంచేత ఆయనలో మార్పువచ్చింది. హింసావాది కాస్తా, దేవానాం ప్రియదర్శి అయినాడు. మిషనరీ అయినాడు. ఇది అంతా రాజకీయ క్షేత్రపు పరిధులలో కొనసాగింది. ఇట్టివారు ఇంకో ఇద్దరున్నారు. వారిని గూర్చిన తలపు రాగానే ముందు రామ్‌మోహన్ రాయ్

నా కన్నులముందు ప్రత్యక్షమౌతాడు. ఆయన బ్రహ్మసమాజ ప్రవర్తకుడు. స్థాపకుడు. మూడవ వ్యక్తి పరే, ఆయన మహాత్మా గాంధి. జవహర్‌లాల్ నెహ్రూకు గురువు. తీర్పరి.

నెహ్రూ ఈ కోవకు చెందినవాడు. ఆ కోవలో పంప్ర రింపతగినవాడు ఆయన. ఆ కోవలో శాశ్వతుడు చేయబడ వలసినవాడు జవహర్‌లాల్.

# కాంతి వేగమా? సూర్యుని వేగమా?

## శ్రీపాద గోపాలకృష్ణమూర్తి

పోయిన (అక్టోబరు) నెల భారతిలో కలగూరగంపలో 'నిడుదవోలువారి నివేషము' ను విమర్శిస్తూ ''రెండు వేలును నిన్నూట రెండు యోజనంబు లర్ధనిమేష మాత్రంబులోన నంబరంబున బారు తీవ్రాంశు రథము'' అన్న పద్యాన్ని ఉదహరిస్తూ శ్రీ వి. రాజగోపాలరావుగారు ''రథము'' నకు 'రశ్మి' అన్న అర్థము తీసినారు. ఇంకొక గ్రంథమునుండి కూడ ఆ అర్థాన్నే పట్టిన సందర్భాన్ని వివరించారు. సూర్యుని రథములో సూర్యుడు ఉంటాడు కదా ? మరి సూర్యుడి వేగము కాంతి వేగమని ఎందుకన్నారో నాకు తెలియలేదు. ఏడు గుర్రాలూ కాంతిలోని Vibgxor రంగులు అనుకుని, అవి వెలుతురు వేగంతో లాగుతాయి అని అంచనా వేశారేమో ! ఈ ఏడు రంగులూ పూర్వులెవరూ చెప్పినట్లు లేదు. 'అవి యేడూ ఇవి యేడూ కనక అవే యివి' అని ఎలాగంటామూ ? ప్రాచీన గ్రంథాలలో కపోత వర్ణము, శంఖవర్ణము అంటూ ఇంకో రంగులు ఏవో చెప్పేరు ? అవైనా ఏడు ఉండవు ?

దాని సంగతి అలా ఉంచండి. సూర్యుడు పోగే వేగము సెకనుకు సుమారు 18½ మైళ్ళు; వెలుతురు వేగము 186000 మైళ్ళు. ''మరి తీవ్రాంశురథము'' అన్నమాటలు ఏవేగంతో అన్వయము ? సూర్యుణ్ణి రథాన్ని వెనక విడిచి; రథ్యాలు పరుగెత్తిపోయినవన్న అర్థము కాదుగదా ? ఇదీ కుదరదే ! 'ఎక్కడ నుండి—ఎక్కడకూ ?'' రచయితల అర్థ మేమై యుండునో !



# గ్రంథ విమర్శలు

## శ్రీ శాలివాహన గాథా సప్త శతీసారము

(తెలిగించినది : రాళ్ళపల్లి అనంతకృష్ణ శర్మ, వెల: 4—00. ప్రాప్తి స్థానము : ఆంధ్ర సారస్వత పరిషత్తు, తిలక్ రోడ్డు, హైదరాబాదు)

భారతీయ సాహితీ ప్రపంచములో ప్రాకృత భాషలగాథ యొక మధుర ఘట్టము. వాని పుట్టుక తెలిసికొనుట యనగా భారతీయ భాషల పరిణామమును పరిశోధించుటయే యగును. ప్రాకృత భాషలనగా నేమి ? పరిశీలింతము. "ప్రాకృతము" అనుపదమునకు నిఘంటువులు భాషాపరముగా "దేశీయము" అను నర్థము నిచ్చును. అమరకోశము క్షుద్ర జనులను గూర్చి చెప్పుచు "వివర్ణః పామరో నీచః ప్రాకృశ్చ పృథగ్జనః" అని యున్నది. ప్రాకృత శబ్దమునకు వ్యుత్పత్తి విశేష జ్ఞానము లేక పుట్టినప్పటి వలెనే యుండువాడు (ప్రకృతే యున్నది. "ప్రాకృతుడు" అను పదమునకు నిఘంటువులు సంస్కారము లేని వాడు, పామరుడు, నీచుడు అను అర్థము లిచ్చుచున్నవి. వీనిని బట్టియే కాబోలు పామరులు మాటాడు భాష ప్రాకృత భాషయని లోకము వారు— పండితులు— అనుచుందురు. ఈ యర్థముల మాట యెట్లున్నను సామాన్య ప్రజలు మాటాడు భాష ప్రాకృత భాష యయినది యని చెప్ప వచ్చును. మరి ఈ ప్రాకృతముల జన్మ వృత్తాంతమేమి ? "ప్రాకృతస్య తు సర్వమేవ సంస్కృతం యోనిః" అని అన్న ప్రాచీనులు కొందరు కలరు. "జనని సంస్కృతంబు సకల భాషలకు"ను అని శ్రీనాథుడన్నాడు గదా ! సంస్కృతము నుండి ప్రాకృతభాష లేర్పడినవని కొందరు తలంచిరన్న మాట. కాని ఆ మాటనే త్రిప్పికొట్టి, ప్రాకృతముల నుండియే సంస్కృత మేర్పడినదని యన్న ప్రాచీనులు కొందరు లేక పోలేదు. అట్టి మహాత్ములలో రాజశేఖరుడొకడు. సంస్కృత ప్రాకృతములలో ఏది దేని నుండి పుట్టిన దన్న వాదమీ నాటిది గాదనియే మనము తెలిసికొన వలయును.

ప్రాకృతము భారత దేశములో పలు తెగల యందు పలు నాడుల యందు ప్రాకి విరివిగా పెరిగినది. ఈ ప్రాకృతులో మూల మొకే భాష యయినను, అనేక మాండలికములు లేర్పడినవి. ఈ భిన్న ప్రాకృత మాండలికములను సూచింప వలసినప్పుడు "ప్రాకృత భాషలు" అను బహువచనమును వాడుదురు. అట్లుగాక ఆ యొకే మూల భాషను సూచింప వలసినప్పుడు "ప్రాకృత భాష" యని ఏకవచనమును వాడుదురు. మొదట భిన్న ప్రాకృత మాండలికములలో భేదమంతగా కానరాదు. కాని నానాడు వ్యవహార బలమున ఈ మాండలికములొక దాని నుండి మరియొకటి వేరయినవి. ప్రజలు మాటాడు భాష ప్రాకృతమని యనుకొన్నారము. ఈ ప్రజ లెవరు ? భాషా శాస్త్రజ్ఞులచే, చరిత్రకారులచే "ఆర్యులు" అని నిర్దేశింప బడిన వారు, వారిచే జయింపబడిన "అనార్యులు" "ప్రజలు" అని మనము చరిత్ర పరముగా వ్యాఖ్యానము చేసికొన వలయును.

ఆర్యులు విదేశీయులు. వారు క్రీస్తునకు పూర్వమే కొన్ని వేల యేండ్ల నాడు ఇరాను భూముల నుండి భారత దేశమునకు వచ్చిరి. ఆర్యులు వచ్చునరికి ఈ జంబూ ద్వీప ఖండములో మూడు తెగల వారు కలరు. మొదటి తెగవారు నిషాదులు వారు ఆస్ట్రిక్ జాతివారు. రెండవ తెగవారు కిరాతులు. వారు మంగోలాయిడ్ జాతివారు. మూడవ తెగవారు దస్యులు (దాసులు) వారు ద్రావిడ జాతివారు. ఆర్యులీ ఆదిమ జాతులను జయించిరి. కాలము గడచిన కొలది ఆర్యానార్య జాతుల భాషా పద్ధతులు ఏకమయినవి. ఇరాను గడ్డ నుండి గుంపులు గుంపులుగా వచ్చునాటికే ఆర్యభాషలో మార్పులు చూపట్టినవి. అనార్య భాషా సంపర్కముతో ఆర్యభాష మినుమిక్కిలిగా మార్పు పొందినది. ఆర్యుల గ్రంథము ఋగ్వేదము. అందలి భాష సుపరిష్కృత మయిన సారస్వత భాష. ఆ భాష ఆర్యానార్య భాషల కలయిక నుండి ఏర్పడిన గ్రాంథిక భాష. ఋగ్వేద భాషకు సమకాలికముగా ఆర్యానార్య ప్రజలు మాటాడుకొన్న భాషలే ప్రాథమిక ప్రాకృతములు. ఋగ్వేద భాష యందలి యొక కొన్ని రూపములు పాళీ భాష యందలి రూపములతో— కొలది మార్పును తొలగింపవలె— సరిపోలుచున్నవి సుత్త పిటకమందలి పాళీభాష వైదిక భాషకు దగ్గరగా నున్నది. గ్రంథస్థ మయిన ఋగ్వేదభాష క్రీ. పూ. 20వ శతాబ్దము నకే రూపొందినదని స్థూలముగా నిర్ణయింప వచ్చును.

ఆర్యులు సింధు ప్రాంతము నుండి బీహారుదాక వ్యాపించుటకు దాదాపు వేయి యేండ్లు పట్టినది. ఈ లోపల బ్రాహ్మ

ణోపనిషత్తు రచితము లయినవి. వేదభాష క్లిష్టము. బ్రాహ్మణోపనిషత్తుల భాష సరళము. వేద వాఙ్మయ భాష మారుటయే గాక ఆ వేయి యేండ్లలో ప్రాథమిక ప్రాకృతములు కూడ పరిణమించినవి. అందుచే ఆదిమ కాలమున వైదిక భాషకు, ప్రాకృతములకు మధ్య కన్పించు దగ్గరి చుట్టరికము రానురాను లోపించినా వేనిత్రోవ వానిదే యయినది. బ్రాహ్మణముల కాలము నాటికే ప్రాథమిక ప్రాకృతములు మూడు రీతులుగా నున్నవని చెప్పుటకు ఆధారములు కలవు. ఆ త్రివిధ మాండలికములివి. ఒకటి వాయవ్య భాష. రెండవది మధ్య దేశస్థ భాష. మూడవది ప్రాచ్య భాష. ఈ మూడిటిలో వాయవ్య భాష వేద భాషకు దగ్గరగా నున్నది. ప్రాచ్య భాష మిక్కిలి దవ్వయినది. మధ్య దేశస్థ భాష మధ్యే మార్గమున నున్నది. వేదభాషకు, ప్రాథమిక ప్రాకృతములకు మధ్యగల అంతరమును తొలగింపగా ఆ నాటి వారు పాటుపడిరి. ఆ పాటులకు ఫలముగా ఒక నూతన శిష్ట గ్రాంథిక భాష ఏర్పడినది. అదే లౌకిక సంస్కృతము. దానిని రూపొందించుటకు వాయవ్య మధ్య దేశస్థ ప్రాకృతములే ఆధారములు. సారాంశ మేమనగా ప్రాకృతములను సంస్కరింపగా సంస్కృత భాష యేర్పడినది. లౌకిక సంస్కృతము శిష్ట వ్యవహారము నందుండుట చేతనే పాణిని (క్రీ. పూ. 5 శ) దానిని ప్రజలలో (లోక) వాడుకయందుండిన (వ్యవహార) భాషయని చెప్పెను. లౌకిక సంస్కృత మిట్లుండగా ప్రాథమిక ప్రాకృతములు కాలక్రమమున మారుచునే యున్నవి. ఆర్యులు బ్రహ్మావర్తమున స్థిరపడిన నాటి నుండి జైన బౌద్ధ మతములు తలయెత్తు నాటికి ఆర్యావర్త భాషలిట్లున్నవి. వేదభాష ప్రాచీనమయినది. లౌకిక సంస్కృత మేర్పడినది. పాణినికి ముందే ఆ భాషకు వ్యాకరణములు వెలసినవి. ప్రాథమిక ప్రాకృతములు పరిణమించి ద్వితీయ ప్రాకృతము లేర్పడు చున్నవి. పాణిని వ్యాకరనము వచ్చిన పిదప సంస్కృత భాషా నిర్మాణములో మార్పేమియు లేదు. ఏ మార్పయిన కేవలము పద సంపదలో కలిగినదేమో. అనగా లౌకిక సంస్కృతము విద్వద్భాషయై పరిణమించుట మాని బిగిసి పోయినది. ప్రాకృతములు వ్యావహారిక భాష లగుటచే బహుముఖములుగా మారిపోయినవి. దాదాపు క్రీ. పూ. 500 నాటికే ఈ దశ పట్టినట్లు షుమారుగా చెప్ప వచ్చును.

క్రీ. పూ. 5 వ శతాబ్దమునుండి గుప్త వంశ ప్రారంభముదాక ద్వితీయ ప్రాకృతములే రాజ్యము చేసినవి. ఈ ద్వితీయ ప్రాకృతము లెన్నియో మనము చెప్పలేము. మహారాష్ట్రి, శౌరసేని, మాగధి, పైశాచి ఈ నాలుగే ప్రధాన ప్రాకృతములని వరరుచి పేర్కొనెను. జైనులు ధర్మ ప్రచారార్థము అర్ధమాగధిని సృష్టించికొనిరి. వారి సాహిత్యభాష జైన మహారాష్ట్రి. ఈవిధముగా ప్రాకృతముల సంఖ్య పెరిగినది. తెగలనుబట్టి, నాడులను బట్టి ఎన్నో ప్రాకృత మాండలికము లేర్పడినవి. విశ్వనాథుని సాహిత్యదర్పణము పదునాలుగు ప్రాకృత భేదములను పేర్కొనుచున్నది. ప్రజాభాషలగు ప్రాకృతములకు ధర్మ ప్రవచన గౌరవమును, సాహిత్య గౌరవమును కల్గించిన యుదారులు జైన బౌద్ధులు. మహావీరుడు (బుద్ధుడు గూడ ?) అర్ధమాగధిలో ధర్మప్రచారము చేసెను. బౌద్ధమతము ప్రచార పాళీ భాషలో సాగినది. ఈ పాళీభాష ప్రాకృత భేదమా ? ప్రాకృత భిన్నమా ? అను వాదము తెగనిది. మాగధీ ప్రాకృతమే పాళీభాషయని కొందరి తలంపు. కాని యీ వాదము నిలువదు. పాళీభాషకు అవంతీ కౌశాంబీ ప్రాంతముల ప్రాకృతములకు గాఢ సంబంధ మున్నది. ఈ పాళీ భాష అశ్వఘోషుని సంస్కృత నాటకములలోని శౌరసేనీ ప్రాకృతమునకు చాల దగ్గరగా నున్నది. సంస్కరింపబడిన లౌకిక సంస్కృతమే వ్యవహారమున పాళీభాష యయినదని కొందరి వాదము. ఏమో ! ఈవాదముల కేమి ? లౌకిక సంస్కృతమునకు ద్వితీయ ప్రాకృతములకు మధ్య కాలములో పాళీభాష బయలుదేరి ప్రజలలో కలయ బ్రాకినది. బుద్ధుని కాలమున లిఖితరూపమందిన ప్రప్రథమ భాష పాళీభాష యని నిర్ధారణ చేయు అవకాశము కలదని కొందరు చెప్పుచున్నారు.

సౌలభ్యము కొరకు ఈ ద్వితీయ ప్రాకృతముల కాలమును మూడు యుగములుగా విభజింపవచ్చును. అశోకుని శిలాశాసనములలోని భాషలు, పాళి మొదటి యుగము నాటివి. జైనమత వాఙ్మయములో, సంస్కృత రూపకములలో ప్రయుక్తమయినవి రెండవ యుగము నాటివి. శిలాశాసనము లందలి ప్రాకృతముల కంటె రూపకములలోని ప్రాకృతములు నవీనములు. సంస్కృతరూపకములలో నాయకుడు సంస్కృతమున మాటాడును. రాజాంతఃపురములోని జనులు మాగధిని, చేట రాజపుత్రశ్రేష్ఠులు అర్ధమాగధిని, విదూషకాదులు ప్రాచ్యను, ధూర్తులు అవంతిని, నాయికయు ఆమె పరివారము శౌరసేనిని, యోధనాగర కితవాదులు దాక్షిణాత్యను, ఉదీచ్యులు బాహ్లికను ప్రయోగింపవలయునని భరతముని అనుశాసించెను. రూపకకర్తలు వచనమునకు శౌరసేనిని, శ్లోకములకు మహారాష్ట్రిని వాడుదురు. ఈ రెండవ యుగమందలి ప్రాకృతము వ్యాకరణ శాస్త్రకర్తలచే లక్షణబద్ధములయి స్థిరపడినవి. కాని వ్యవహారమున ప్రాకృతము లింకను మారుచునే యున్నవి. మూడవ యుగములో ఈ వ్యావహారిక ప్రాకృతములు అపభ్రంశ

# గ్రంథ విమర్శలు

భాషలుగా మారినవి. ఒక్కొక్క ప్రాకృత మాండలికమునకు దానినుండి మారిన యొక్కొక్క అపభ్రంశ భాషకలదు. ఈ అపభ్రంశ భాషలనుండియే నేటి ఉత్తర హిందూస్థాన భాష లేర్పడినవి. సాహిత్యపరముగా చూచినచో వైదిక సంస్కృతము, లౌకిక సంస్కృతము, ప్రాకృతము, నవీనార్య భాషలు ఒకే భాషా పరిణామమందలి భిన్నావస్థలని చెప్పవచ్చును. ప్రాకృత భాషా వైభవ వ్యాప్తులకు శాసనములు సహితము ప్రబల సాక్ష్యముగా నున్నవి. అశోకుని కాలమునుండి క్రీ.శ. 4వ శతాబ్ద ప్రారంభమువరకు ఈ మధ్య కాలమునాటివి 1500 ప్రాకృత శాసనములు లభింపగా, సంస్కృత శాసనములు పంద్రెండు మాత్రమే లభించినవి.

ఈ ప్రాకృత భాషల వ్యాప్తిని జూచినచో వాని యందెంతో సాహిత్యముండి యుండవలయునని తెలియకపోదు. హాలుని గాథాసప్తశతియందలి కవులే మున్నూరుమంది యున్నారు. మరి ఈ సాహిత్యమంతయు ఏమయినది ? ఏవో కొన్ని మత గ్రంథములు, ఒండు, రెండు కావ్యరూపకములు లభించినేమి? ప్రాకృత భాషా సాహిత్యము నశించిపోవుటకు కారణమేమి? జైన బౌద్ధమత ద్వేషముగలవారీ ప్రాకృత సాహిత్యమున్న బూడిదపాలు చేసినరని కొందరి తలంపు. ప్రాకృతములు భిన్న వ్యవహార స్వరూపమును గాంచి, లక్షణమునకు కట్టుపడని భాషలగుటచే వానియందలి సాహిత్యము నమసిపోయినదని మరికొందరి తలంపు. రెంటను నిజముకలదు. ప్రాచీనకాలమున సంస్కృత ప్రాకృతభాషలకు స్పర్థయున్నదేమోయని యనుట కవకాశమున్నది. కానిచో ప్రాకృత భాషాకవులు సంస్కృత సారస్వతముకంటె ప్రాకృత సారస్వతము దొడ్డదియని ఈ విధముగా ఏలయందురు ? ''లలితయై మధురాక్షరమై, యువతీ జనవల్లభమై, సశృంగారమయిన ప్రాకృతముండగా సంస్కృత కావ్యములెవరు చదువుదురని వారి సవాలు. కుంద ప్రసూనములను మాలగ్రుచ్చుటకు కావలసినట్లు ప్రాకృత కావ్యములను చదువుటకూడ ఒక ప్రత్యేకమయిన చాతురి కావలెనట. గౌడవహ రచయితయగు వాక్పతి ప్రాకృతభాషా ప్రాశస్త్యము వర్ణించుచు అభినవార్థములకది పెన్నిధి. సన్నివేశ చాతురికి, బంధ సమృద్ధికి కాణాచి. సమస్త జలమును సాగరమునుండియే యుద్భూతమగును. మరల సాగరముననే కలియును. అట్లే సమస్త భాషలు ప్రాకృతమునుండియే జనించి, మరల వాని యందే లీనమగుచున్నవి— అని అనెను''. జైనులు తాముప యోగించిన భాషను ''అర్షము'' అని సంభావించికొనిరి. ''దేవతలు మాటాడుకొను భాష ఇదియేయని వారి ప్రచారము. సంస్కృతముపైని స్పర్ధతో పుట్టిన వూహ ఇది'' మరి హేమ చంద్రుని మాట వినుడు.

అక్కృతిమ స్వాదుపదాం, పరమార్థాభి ధాయినీం
సర్వభాషా పరిణతాం, జైనీం వాచ ముపాస్మహే.

సాహితీ రసికులకు గాథా సప్తశతి యొక జీవరస స్రవంతి. దానిని కూర్చినవాడు హాలుడు. ఇతడొక ఆంధ్ర శాతవాహన రసికరాజు. ఆంధ్ర చరిత్రకారుల లెక్క ప్రకారమితని కాలము క్రీ.శ. 1వ శతాబ్దమునకు పూర్వార్థమగును. ఆచార్య నీలకంఠశాస్త్రి ఇట్లనెను.

**"Hala, the seventeenth Satavahana king (A. D 20-24) is famous in literature as the Compiler of Sattasai (Saptasati) a Collection 700 erotic gathas in the Arya metre in Maharashtri Prakrit. In its present form the work contains linguistic features of the second or third century A. D. or even later."**

మగధ చక్రవర్తియగు సుశర్మను చంపి ఆంధ్ర శాతవాహన సామ్రాజ్యమును అఖిలభారత సామ్రాజ్యముగా పరిణమింప జేసిన మొదటి పులమావి క్రీ.శ. 19లో మరణించెను. సహపానుడు, సహపానుని వంశ్యులు శాతవాహన సామ్రాజ్యమున్న చెడి చెటాకులలో కలియునట్లు చేసిరి. పులమావి మరణ కాలమునుండి గౌతమీపుత్ర శాతకర్ణి (క్రీ.శ. 62) పట్టాభిషేక కాలముదాకా ఆంధ్ర శాతవాహన సామ్రాజ్యమునకు దుర్గతి పట్టినది. ''ఈ అంధకార యుగమున మనకు కన్పట్టు ఏకైక తేజః కిరణము హాలుని యాశ్రమమున వర్థిల్లిన సారస్వత సంపద''. గాథా సప్తశతి సంకలన గ్రంథము. ఏడు శతకములు గావింపబడినది. ఏడు వందల ముక్తములు గలది. ఈ శతకములు గాథయను ప్రాత పేరు గల అర్యాచ్ఛందస్సు ననున్నవి.

గాథలొక్క కోటి గలవు లోకంబున,
వానిలోన నందమైన వాని
నేర్చికూర్చి పెట్టె నేడు నూరులు కవి
వత్సలుండు శాలివాహనుండు.

అనాడొక కోటి గాథలు లోకమున గలవా ? అనునది వేరుమాట. ఎన్నో గాథలను పరిశీలించి, పరీక్షించి వానిలో మేలైరములైన ఏడువందలను హాలుడు (శాతవాహనుడు, సాతవాహణుడు, సాలవాహణుడు, సాలాహణుడు, శాలవాహనుడు, శాలివాహనుడు ఇతని మారు పేరులే.) కూర్చెననియే మన మనుకోవలె. ''కోటి'' సంఖ్య విరివిగా వికసించిన ప్రాకృత భాషా కవితను తెలుపుడు చేయును. హాలుడు సామాన్య చక్రవర్తి

గాడు. కవియై, కవిపోషకుడై, కవుల గుండెలను దోచుకొన్నవాడు. కానిచో పృథ్వీనాథుని ఈ పొగడ్త కర్థమేమి ?

దీనులైన వారిం దేకువదీర్చి ర
క్షింపజాలు వార లిరువు రిలను
పార్వతీశుడైన పరమేశ్వరుండు; రాజ
వల్లభుండు శాలవాహనుండు.

ఈ పొగడ్త పండితరాయలు షాజహానుని గూర్చి చేసిన పొగడ్తకు దారితీసినది. ఈ హాలుడెవరో రచించిన నాలుగు ప్రాకృత గాథ నను నాలుగు కోట్ల బంగారు నాణెములిచ్చి కొనెనట! ఒకానొకడు పదికోట్ల బంగారు నాణెములన్నాడు. ఇట్టి కట్టు కథలు ప్రాకృత కవితపట్ల హాలునకు గల మోహమును మాత్రమే చూపును.

గాథా సప్తశతి మహారాష్ట్రీ ప్రాకృతము నందున్నది. ఈ ప్రాకృతము భిన్న ప్రాకృత మాండలికములలో నొకటి గదా! ఇదియే ప్రాచీనకాలమునుండియు అన్ని ప్రాకృతముల కంటె మిన్నగా సమ్మానింపబడినది. ఆచార్యదండి మహారాష్ట్రీ ప్రాకృతమును "సాగర, సూక్తిరత్నానాం" అని ప్రశంసించెను. జైనులు, శాతవాహన, సార్వభౌములు మహారాష్ట్రీ ప్రాకృతమునకు పుష్టి చేకూర్చిరి. మగధదేశము క్షామ క్షోభితమయిన నాడు శ్వేతాంబర జైనులు దక్షిణాపథమునకు వచ్చిరి. వారు ధర్మప్రచారముచేయుచు మహారాష్ట్రీని పెంచిరి. అందుచేతనే మహారాష్ట్రీ ప్రాకృత గాథలో జైనులు ముఖ్యనాయకులైరి. మహారాష్ట్ర దేశమునందే మహారాష్ట్రీ పెరిగినదనికాని, మహారాష్ట్రులే దానిని పుట్టించిరని గాని చెప్పుటకు వీలులేదు. మహారాష్ట్రీ ప్రాకృత మేర్పడిననాటికి మహారాష్ట్రజాతి యనునదొకటి లేదు. జైనులు పలు నాడులు చుట్టి తిరిగి ధర్మ ప్రబోధము చేయుటవలన, శాతవాహనుల ఏలుబడివలన సర్వ ప్రాంతములకు చెందిన దేశి శబ్దములు మహారాష్ట్రీ ప్రాకృతమునందు చేరినవి. కావుననే హాలుని గాథా సప్తశతిలో పిల్ల, అత్త వంటి తెలుగు మాటలెన్నియో యుండుట పొసగినది. ఈ విషయములో ఆసక్తిగలవారు ఒకనాడు "భారతి"లో తిరుమల రామచంద్రగారు వ్రాసిన వ్యాసములు చదువవచ్చును. గాథా సప్తశతి భాష మహారాష్ట్రీ ప్రాకృతమని యన్నాడను గదా! కాని ప్రాకృత వ్యాకర్తలు మహారాష్ట్రీ ప్రాకృతమునకు చెప్పిన లక్షణములకు, గాథాసప్తశతి యందలి మహారాష్ట్రీ ప్రాకృత లక్షణములకును భేదమున్నది. అందుచే గాథా సప్తశతి భాష మహారాష్ట్రీ ప్రాకృతము గాదనువారున్నారు. అట్టి వారిలో కురుగంటి సీతారామభట్టాచార్యులొకరు. హాలుని గాథాసప్తశతికి వేమ భూపాలుడు, కులబాలదేవుడు, గంగాధరభట్టు అనువారలు వ్యాఖ్యానములు చేసిరి. వేమభూపాలుడు సర్వజ్ఞ చక్రవర్తి, వీరనారాయణుడు అని వాసిగాంచిన పెదకోమటి వేమారెడ్డి (క్రీ.శ. 1402—1420). హాలుని ఏనూరు గాథలలో సారవంతములైన వంద గాథలను గూర్చి కోమటి వేమారెడ్డి "సప్తశతీ సారము" అను వ్యాఖ్య రచించెను. కులబాలదేవుడు, గంగాధరభట్టు ఎప్పటివారో మనకు స్పష్టముగా తెలియదు. ఇటీవల సాహిత్యాచార్య మథురానాథశాస్త్రి గాథా సప్తశతికొక వ్యాఖ్యానము చేసెను.

సంస్కృత భాషలో వెలసిన కవిత్వమువంటి కవిత్వము ప్రాకృతములో నున్నది. కాని ప్రాకృత కవిత్వమువంటిది సంస్కృతములో నున్నదని నికరముగా చెప్పజాలము. "వాస్తవమునకు ఆ భాషలలో (ప్రాకృతములలో) కుదిరినంత లాలిత్యము సంస్కృత శబ్దములలో కుదరదేమో అని అనిపించును". ప్రాకృతములు పల్లెలలో మెదిగినట్టివి. పల్లెలు ఆకృత్రిమ సౌందర్యమునకు నిలయములు. పల్లీయులు, మిడిమేలపు పోకడలు పోయిన వారుగారు ఆ యకృత్రిమ సౌందర్యమే, ఆ సహజ మానవ ప్రకృతియే ప్రాకృతిక కవిత్వములో ప్రతిబింబించినవి. దీనికి హాలుని గాథా సప్తశతియే సాక్షి. ప్రాకృత కవిత్వము సంస్కృత కవిత్వమువలె సాంకేతిక దోష దూషితముగానియట్టిది. ఆనంద వర్ధనుడు సాహిత్య శాస్త్ర ప్రపంచములో ధ్వనిశకమును స్థాపించిన తరువాత దీనికి గాథాసప్తశతి గాథలే లక్ష్యములయినవి. ఆయనతోపాటు ఇతర సంస్కృతాలంకారికులు ధ్వని భేదములకు లక్ష్యములుగా ఈ గాథలనే ఉదాహరించిరి. సర్వ ధ్వని భేదములకు గాథాసప్తశతి యందలి ఏదోయొక ముక్తకము తార్కాణచే యగును. గాథాసప్తశతి కవితాక్షేత్రకి గోదావరీ నర్మదానదీ వింధ్యపర్వతముల నడిమిచోటు రంగస్థలము. ఇందలి యొక్కొక్క ముక్తకము ఒక్కొక్క అమృతధారా ఖండము. గాథాసప్తశతి ఆనాటి బహుముఖ ప్రజా సాంఘిక జీవితమును రమణీయార్థ ప్రతిపాదకముగా వ్యంగ్య వైభవముతో వర్ణించును. "ఈ గాథలందు రెండువేల ఏండ్ల క్రిందటి గ్రామ జీవిత సౌందర్యము చిప్పిలుచుండును. ఆనాటి ప్రజల నిత్య జీవితములోని అన్ని దశలను వారి వేష భాషలను, నగలు నాణెములును, శాక పాకములను పంటలు, పైరులను, ఆచార వ్యవహారములును, నీతి నియమములను, గుళ్లు గోపురములును, ఆటపాటలును, విద్యలును, బులుపు వాసన వారాది పరిగణనమును అన్నియు ఇందు వర్ణితములు". పల్లెపట్టు సొగసులు పల్లెటూరివారి గడుసరి పోకడలు, జానపదముతో మెరుగులు దిద్దుకొను వారి వలపులు గాథా సప్తశతిలో కలవు.

# గ్రంథ విమర్శలు

దీనియందలి కవిత్వమును స్థూలముగా ద్వివిధముగా విభజింప వచ్చును. ఒకటి రమణీయ ప్రకృతి దృశ్యములతో ముడి పడినట్టిది. ప్రకృతి దృశ్యములకు, మానవుల యంతరంగ ములకు మధ్యగల పొత్తుపొందికలు విస్మరింపబడకుండుట విశేషము. రెండవది వ్యక్తుల హృదయగత భావవర్ణనమునకు సంబంధించినట్టిది. ఆ భావములు పెక్కులు శృంగార పరములు. ఆ శృంగారము సభ్యతా గ్రంథమయమైనట్టివి. (సభ్యతా లోపము గల శృంగారము కొన్ని మూల గాథలలో కలదని అనంతకృష్ణశర్మగారన్నారు. వారు వానిని తెలిగింపలేదు.) అట్టి ఈ గాథాసప్తశతిని దివ్యముగా అనువదించి ఆంధ్రుల కందిచ్చి అనంతకృష్ణశర్మగారు పుణ్యము కట్టుకున్నారు. ఆంధ్రుల కృతజ్ఞతకు పాత్రులయినారు.

ప్రాచీనాంధ్ర కావ్యములలో గాథాసప్తశతి యందలి యొకకొన్ని భావములకు సంవాద రూపములయిన పద్యములు కలవు. కాని ఆ గ్రంథమును తెలిగింపగా మొదట గంటము పట్టినవాడు శ్రీనాథుడే. ఆ యనువాదము మనకు లభించినది గాదు. మూడు పద్యములు మాత్రము లభించినవి. "వారణ సేయం దావి గొనవా" యనునొక పద్యము. శబ్ద వైచిత్రితో మూల భావమునకు వాపు గలిగించిన పద్యమది. క్రీడాభిరామ మందలి "పటు జంఝూ పవనోత్ప్రణాలయములో" "మాఘ మాసంబు పులివలె మలయుచుండ" అనునవి మిగిలిన రెండు పద్యములు. ఆ పిదప శర్మగారి తరముదాకా గాథాసప్తశతి పని చేయుచేసిన వారెవరు లేరు. నవీన కాలమున ఎందరో అపరి పూర్ణముగనో, పరిపూర్ణముగనో అనువాదము చేసిరి. వెలుగు చూసిన ఆ యనువాదములలో శర్మగారిదే మేల్తరమని విద్వాంసుల యభిప్రాయము.

అనంత కృష్ణశర్మగారిని గూర్చి తెలుగువారికి కొత్తగా చెప్పవలసిన దేమియున్నది? సంగీత సముద్రపారమును ముట్టిన సంస్కృత విద్వాంసుడాయన. ఎవరో రన్నలింగ వరుత్తమిళ తంగమును కైసేసికొనిరి. కన్నడ కస్తూరిని అలది కొనిరి. ప్రాకృత పాయసమును సాపడిరి. అనంతకృష్ణశర్మగారు గ్రంథములెన్నో వ్రాసి బండ్లకెత్తలేదు. సంగీత శాస్త్రవేత్తగ విమర్శక శిరోమణిగ, కవిగ ఆయన నిలిచిరి. వారు విమర్శలో కవితాకళ చూపించినవారు. నవీనాంధ్ర విమర్శ ప్రస్థానమున శ్రీ అనంతకృష్ణశర్మ ద్వితీయాచార్యుడు. కట్టమంచి రామలింగ రెడ్డిగారు ప్రథమాచార్యులు. సాహితీ మూలతత్త్వమును, ఔచిత్యమును, శిష్టాభిరుచిని విస్మరింపక సముచితముగ విమర్శ చేయుట శర్మగారే తెలుగువారికి నేర్పిరి. ఈ యొడువులో ఎటు రెడ్డిగారికంటె ఒకడుగు ముందుకుపోయిరి. వీరిరువురి

తరువాత — ఒకరినో ఇద్దరినో మినహాయించిన — ఇతర విధముల పేరుమోసిన పెద్దవారు వ్రాసినదంతయు విమర్శగాక కువ్యాఖ్యానమైయున్నది. ఆ కువ్యాఖ్యానమునకే చెక్క భజనలు చేయు పరప్రత్యయనేయ బుద్ధులుండుట విపులలో వింత. అనంతకృష్ణశర్మగారు వారి "అభిరుచివి మాత్రమే సూచించు" గాథలను 734 తెలిగించి శ్రీ శాలివాహన గాథా సప్తశతి సారమును కూర్చిరి. ఇది సమగ్రమయిన ప్రథమ ముద్రణమని యనవచ్చును. వారేగాదో 3౦5 గాథలు తెలిగించి వెలయించిన మాట నిజమే. శర్మగారి ఈ యనువాదము సమగ్రమని యన్నాడను. గాథలను సేకరించి తెలిగించుటలో వారు పడిన పాటలే దీనికి హేతువు. హాలుడు కూర్చినవి ఏడువందల గాథలు. కాని పిమ్మట విద్యములవలె ఆ గాథల సంఖ్యయు రాను రాను పెరిగినది. జర్మన్ పరిశోధకుడు వీబరు పండితుడు భిన్నదేశ ప్రతులను సంప్రతించి, సంస్కరించి ప్రచురించిన ప్రతిలో వేయి గాథలు గలవు. శర్మగారికి వీబరు పండితుని ప్రతియే ప్రమాణమయినది. శాలివాహన గాథా సప్తశతీసారములో నాలుగు భాగములు కలవు. ప్రథమ భాగము కావ్యమాలవారి ముద్రణమును టీకను ఆధారముగా చేసుకుని రచించిన గాథలు. ఇదివరకటి 395 గాథలుగాక "మరి 117 గాథ లేర్చి మార్చి" వానికి చేర్చిరి. ద్వితీయ భాగ మందు "వీబరు పండితుడు సంగ్రహించి ప్రకటించిన ప్రతిలో వేలు వేలు వ్యాఖ్యాతలు పరిగ్రహించిన మూలము లోనివని తెల్పినవానిలో కొన్ని కలవు. మూడవ భాగములో 'తెలుగుదేశపు మూల పాఠము లోనివని వీబరు సంగ్రహించిన గాథలనుండి ఏర్చినవి" కలవు. నాలుగవ భాగములో "ప్రాచీ నాలంకారిక గ్రంథములలోనివి, శాలివాహనుడు సప్తశతికి సంగ్రహించిన గాథల జాతికి చేరినవి కొన్నిటిని సంగ్రహించి తెలి గించి" నట్టివి గలవు. "చమత్కారము, శ్లేష" ప్రధానముగా నున్నవానిని, వ్యాఖ్యాతల టీక తృప్తి కలిగింపకపోగ "భావము స్పష్టపడ"ని వానిని, "సామాన్య మర్యాద" మీరిన ప్రమే యముగలవానిని, "తగిన కవితా విశేషము గోచరింప"ని వానిని శర్మగారు వదలిరి. వారు గాథలను తెలిగించుటయేగాక పుటల అధోభాగమున, వానికి లఘు టీక చేర్చిరి. ఈ విశేష పరిశ్రమ వలననే ఈ కూర్పు సమగ్ర శోభ కలిగియున్నది.

శాలివాహన గాథా సప్తశతీసారము సమగ్రమగుటయే గాక అనువాద సౌందర్యము కలిగియున్నది. కావ్యము మంగళ ముతో ప్రారంభమయి మంగళాంతమగుచున్నది. ఈ అను వాదమునందలి కవితా సౌందర్యము మాధుర్య సౌలభ్యములు కలది. చిక్కదనము చెడిన సౌలభ్యము గాదది. ముద్దుగొలుపు అలతి అలతి తెలుగు పలుకులతో కూడి గజ గమనముగల కూర్పు

ఇందెల్లెడల గోచరించును. శర్మగారు స్వీకరించిన ఛందస్సులు కందము, తేటగీతి, ఆటవెలది. ఆ చిన్ని పద్దెములలో "శబ్దార్థముల సంయమము, భావముల ఆర్జవము, అడ్డులేని సహజధార" కలవు. ఈ క్రింది పద్యములను చూడుడు :—

ఇలకుఁ బయినుండి రాచి
ల్కల చాలదె వాలఁ జొచ్చె, గగనేందిరకున్
గళమునఁ గల కెంపుల ప
చ్చల కంటసరంబు తప్పి జారెడు ననఁగన్

పెడమొగంబువెట్టి పడుకపై నేనుండ
వేడి యూర్పులిట్లు వెనుకనూర్చి
మొదలు వగలఁ బెట్టి యెదగాల్చినది గాక
యేల వీఁపుఁ గాల్చెదిపుడు పోర !

ఊరలేఁడు మగఁడు; కారుచీఁకటి గ్రమ్మె
నట్టి పాడురేయి; వట్టి యిల్లు
దొంగ లెవ్వరైన దోతురు సుమ్మి; ని
ద్రింపవలదు ప్రక్కయింటివాఁడ

వంక పలుకులాడు వలనేడ ! యరగంటి
చికిలి చూపు సూచు చేవయేడ !
ఊరి నిండ జాణలున్నారు; నిట్టూర్పు
చక్క విడుచుటయు నసాధ్యమిందు.

ఈ మాధుర్య సౌలభ్యమునకు, ఈ పద్య గమనమునకు సమముగా తూగినట్టిది శర్మగారు ఏమరుపాటు లేకుండ రవాళింపజేసిన తెనుగుదనము. తెలుగు సామెతలను కుండపోతగా క్రుమ్మరించినగాని, తెలుగు మాటలను గుదిగ్రుచ్చినగాని తెనుగుదనము రాదు. తలపులను వెలువరించుటలో, ఆ వెలువరించు నుడికారములో, ఆ నుడికారములోని కారక వైచిత్రిలో ఒక భాషయొక్క జీవశక్తియుండును. ఆ జీవశక్తినే ఆ భాషయొక్క "తనము" అని అందుము. తెలుగు భాషయందుగల ఆ జీవశక్తినే తెనుగుదన మనవలెను. నాటికి నేటికి ఈ తెనుగుదనమును పట్టి నిలిపిన తెలుగు కవులెంతో మంది లేరు. ఉన్న నేటి ఆ కొలదిమంది కవులలో శర్మగారొకరు. వారు లెస్సగా తెనుగుదనమును తీర్చిదిద్దిరి. దానికీ పద్యములే సాక్ష్యములు.

మావి చివురు మాచె, మద్యంబు మూల్గెనె
మలయ మారుతంపుఁ జలువకోర్చె
ఇంతయయ్యుఁ బనులె ఎక్కువై నను వీడి
యేఁగె నత్త ! యెవరి కెవరు వలయు.

వట్టి పెదవులందుఁ బుట్టిన వీమాట;
లిట్టి వెన్నియయిన నేమి ఫలము !
మనసునుండి వెడలు మాటల తీరది
వేఱు; నిల్వకిందు వెడలి పోర !

నొగిలి యేడ్వనేల ? వగచి క్రుళ్ళఁగ నేల ?
కన్నవారిమీఁదఁ గసల నేల ?
విషము.వోలెఁ బ్రేమ విషమంబు లలితాంగి !
యెవరు దాని నడ్డగింపఁ గలరు ?

ఆ మెప్పుల, కామెప్పుల
కామాటల తియ్యములకు నా యాశల కా
ప్రేమలకును బరిణామం
బేమందును సొగసుకాఁడ ! ఇట్లు ఘటిల్లెన్

కాదు రూపు, కులము గాదు, గుణంబును
గాదు, నేర్పుగాదు, కలిమిగాదు
ఇల్లెయేమి కతమొ, యెవరికో, యెవ్వరి
యెడనో ప్రేమరసము పొడము చుఁడు.

ఇంతయేల ? సమతలో, శయ్యా నిర్వహణములో తెనుగుదనము తీరుతెన్నులలో వేమన్న కవితాకళ అచ్చు గ్రుద్దినట్లున్న అనువాదమిది.

శాలివాహన గాథా సప్తశతీసారము కట్టమంచి రామలింగారెడ్డిగారికి అంకితము చేయబడినది. గాథా సప్తశతి కవుల పేరులు పద్యములు ఆకారాది క్రమములో రెండు అనుబంధములందు గ్రంథాంతమున కలవు. ఆంధ్ర సారస్వత పరిషత్తువారిని అభినందింపదగిన కావ్యమిది. అనువాదమునందున్న శోభ పుస్తక నిర్మాణములో అంతగా కానవచ్చుటలేదు.

అమృత రసము చెవుల కరయంగఁ బ్రాకృత
కవిత; దానిఁ జదువఁగా వినంగ
లేనివారు సిగ్గులేక పూ విల్తుని
తత్త్వముల నెఱుంగఁ దలఁతురెట్లు ?

## సైరంధ్రి

[కర్త : కొత్త సత్యనారాయణ చౌదరి. వెల : 2—50, ప్రాప్తి స్థానము : పండిత కొత్త సత్యనారాయణ చౌదరి, లెక్చరర్, సి. బి. యన్. కాలేజి, నిడుబ్రోలు, గుంటూరు జిల్లా]

కవి బ్రహ్మ తిక్కన విరాట పర్వమును "హృదయాహ్లాది ఊర్జిత కథోపేతంబు నానారసాభ్యుదయోల్లాసి" యని వర్ణించెను. పండిత కొత్త సత్యనారాయణ చౌదరిగారు ఆ విరాట పర్వమును "సైరంధ్రి" యను పేరుతో సులభ సుందరమయిన వచనములో కూర్చిరి. విరాట పర్వకథలో ద్రౌపదికి గల ప్రాముఖ్యమునుబట్టి ఈ వచన గ్రంథమునకు "సైరంధ్రి" యను

# గ్రంథ విమర్శలు

పేరు పెట్టుట యుచితముగా నున్నది. ''ప్రస్తావము''లో సత్యనారాయణ చౌదరి గారీ విధముగా వ్రాసిరి. ''వర్ణనా ఘట్టములలో వాక్యవైచిత్రిలో—కవి బ్రహ్మ కావ్య ప్రతిభ చవిచూడను —ఆ పలుకుబడులే— ఆ వాక్య విన్యాసమే ఇందును జూపితిని. పద విన్యాసములో భావప్రకటనలో విషయ సమన్వయములో —ఒక క్రొత్త దనము దొడిగి పండు— ఒలిచి పెట్టినట్లు చేతికందించినఁగాని మూచూడని నేటి కుఱ్ఱకాఱునకు— ప్రాఁతదనమన్న రోఁతగాని రీతిలో నాకుఁ దోఁచిన శైలిలో శక్తిమెయి సంస్కరించి ఈ రచనను గూర్చితిని.''

ఈ నాఁడు విద్యార్థులు పరీక్షలలో వ్రాయు సమాధానములను, ఒరగతులలో వ్రాయు వ్యాసములను పరిశీలించినచో, ఇరువదవ శతాబ్దమందు ఆంధ్ర భాష యెంతగా మారి పోయినదో తెలియగలదు. నిజము చెప్పవలయునన్నచో నేఁడు విద్యార్థులు వ్రాయు భాష దిన పత్రికల భాషకు వారపక్ష పత్రికల భాషకు దగ్గఱగా నుండును. పత్రికల భాష మంచిది గాదని నా తలంపు గాదు. పత్రికల లక్ష్యమును బట్టి, వాని యందలి భాష యా విధముగనే యుండవలె. ఈ నాఁడాయా తరగతుల విద్యార్థులు ప్రాచీన నవీన సాహితీ ఖండములు పఠించుచుందురు. బాల వ్యాకరణ మందలి రెండు మూడు పరిచ్ఛేదములు విద్యార్థుల కవశ్య పఠనీయములు. ఇంత చదువుచున్నను వారు నియత భాషలో శుద్ధముగా వాక్య నిర్మాణము చేయలేకున్నారు. శుద్ధముగా వ్రాయవలసిన యక్కఱ యేమి ? యను ప్రశ్నకు నమస్కారమే సమాధానము. ఆంగ్ల భాషా వాక్యములలో ఉంచిన విరామ చిహ్నమును సైతము తొలగించుటకు సాహసింపజాలని మనము తెలుగుబాస పట్ల ఎంతో ''యుదారము''గా ''వలపు'' చూపుదురు. అందఱు చూపవలయునని కోరుదురు. ఇంతగా విద్యార్థులలో పెచ్చు పెరిగి పోవుచున్న భాషా సంస్కార సంబంధ మయిన ఈ లోటునకు హేతువేమి ? స్వతంత్ర భారత వర్షమున విద్యార్థులకు విజ్ఞాన శాస్త్రముల పట్ల పెరిగిన మరులా ? ఆంగ్ల భాషా వ్యామోహమా ? లేక ఆంధ్ర భాషా పాఠ్యభాగములను ఎన్నిక చేయుట యందే దోషము గదా ? విశ్వవిద్యాలయము వారు, విద్యావేత్తలు, దినమునకొక సంస్కారము చేయవలయునను రాజనీతికో వాదులీ ప్రశ్నలకు సమాధానము చెప్పవలయును. కాని యారో జింకను రాలేదు. వేచి చూడవలె. విద్యార్థుల భాషా సంస్కార మిట్లుండగా ఇక వారి ప్రాచీన సభ్యతా పరిజ్ఞానమును గూర్చి (విదేశములకేగు విద్యార్థులకు కూడ) వేఱే చెప్పవలసిన పని లేదు. స్వాతంత్ర్యము వచ్చిన తరువాత విద్యారంగములో వచ్చిన మార్పు లెందును రాలేదు. నానాడే విద్య విధానము కళలకు గోతులు త్రవ్వుచున్నదా ? యను భావము స్థిరపడ చున్నది. ఈ విషయములు గుర్తించుకొనిన గాని ''సైరంధ్రి'' వంటి గ్రంథముల విలువ తెలియదు. ఇట్టి వచన గ్రంథముల వలన రెండు మేళ్లు కలుగును. ఒకటి ఈ తరము వారికి నియతము సరళముఅయిన వాక్య రచనా కళ తెలియుట. రెండవది ప్రాచీన సభ్యతా స్వరూపము తెలియుట. ''సైరంధ్రి'' కూర్పు ధారాళమయినట్టిది. సౌలభ్య సౌందర్యములతో కూడినట్టిది. విశేషించి తిక్కన పలుకుబడులు, వాక్య వైచిత్రి ఇందుండుటచే దీనికి వన్నె వచ్చినది. గ్రంథాదిని సత్యనారాయణ చౌదరిగారు దుర్యోధనుని గూర్చి ఈ విధముగా వ్రాసిరి.

''ఈ పంద్రెండేండ్ల నుండియుఁ గౌరవ రాజ్యము గౌరవ రాజ్యముగానే సాగినది. ఆ రాజ్యము రామరాజ్యమునే తల దన్నినది. ఆ యుగము కృతయుగమునే మించి పోయినది. ఆ యేలుబడిలో నే వంకఁ బరికించినను సుభిక్షమే గాని దుర్భిక్షమన్న మాటయే చొరరాదు. హస్తినాపురి నుండి వార్తాహరులు వచ్చి నిచ్చలు ధర్మజుని మ్రోల దుర్యోధనుని దొరతనమును వేనోళ్ల వినుతింతురు. సామదాన భేదోపాయములను సమన్వయించుటలో దుర్యోధనునిది అందె వేసిన చేయి. ప్రజలను గన్న బిడ్డలనువోలెఁ బరిపాలించుటలో సుయోధనుని మించిన వాఁడు— ఈరేడు లోకములలో లేఁడట. ఆ వార్త విన్నది మొదలు ధర్మరాజున కొక్కటే దిగులు పుట్టెను. అజ్ఞాతవాసము ముగిసి పది మందిలోఁ బడిన నాఁడు పాండవులను బలుకరించువారు కురు దేశములో నుందురో లేదో యన్నంత దాఁకఁ గౌరవ రాజ్యము మంచి తనములో ముంచుకొని వచ్చెను. నిత్య కల్యాణముగా నివ్వటిల్లు కౌరవ రాజ్యములోని ప్రజలు దుర్యోధనుని గాదని పాండవుల నెందులకు వరింతురు ? దూర దృష్టి మిక్కిలిగాఁ గలిగిన ధర్మజుని కడుపులో నీ విషము ''సమస్య'' చేయిపెట్టి కలచినట్టయ్యెను. కాని యప్పటి కాతఁడు చేయ నేర్చినదేదియును లేదు.''

మూలకథ కతుకని భావము లివి. దుర్యోధనుని పొగడిన ధర్మజుని క్రిందు పఱచిన మెచ్చుకొనువారి కొఱకు వ్రాసిన వ్రాఁతలివి. గ్రంథాదిని గల ఈ దుర్యోధన వర్ణనము కావ్య శిల్పమును బట్టి చూచిన అక్కఱకు రానియట్టిది. విరాట పర్వకథ యందలి దుర్యోధనుని చిత్త ప్రవృత్తితో పొత్తు పొందికలు లేనిది తిక్కన విరాట పర్వ కథారంభమున జనమేజయుని నోట ''మహిత సముజ్జ్వలాకృతుల''ను పద్యమును పలికించెను. కావ్య ''కళావిదు'' డయిన తిక్కన ఆ పద్యమున పాండవులకుపయోగించిన విశేషణము లన్నియు కావ్య శిల్పమును బట్టి సార్థకములయినవి. అట్టి పాండవులజ్ఞాత వాస మెట్లొన

ర్తురు ? అని జనమేజయుని ప్రశ్న. కథలో సర్వవర్ణనములు కథోపయోగ కారకములై యుండవలెను. అట్లుండనిచో శిల్పదోషమే యగును. అట్టి దోషము "తిక్కయజ్వ కవితా రీతిన్ విడంబించు" "వ్రాత" లో నుండరాదు.

—శాక్యసింహ.

# మాధవవర్మ-మైలమభీమ

రచయిత : శ్రీ దువ్వూరి జగన్నాథ శర్మ. ప్రతులకు : నటశ్రీ పబ్లికేషన్స్, రామచంద్రపురం, తూర్పు గోదావరిజిల్లా వెల : రు 2—25. పుటలు : క్రౌను 107.

విజయనగర సంస్థానాధిపతులైన పూసపాటి వారి వంశ మూల పురుషులలో విప్నకుండిన మాధవవర్మ యొకడనియు, మైలమ భీమన మరొకడనియు, మరియు మాధవవర్మ సంస్కృతమున జనాశ్రయ ఛందమును రచించెననియు దానినే మైలమ భీమన కాశ్రితుడైన భీమకవి జనాశ్రయముగా తెనుగున వెలయించెననియు చెప్పు బహ్వంశములు బహుగ్రంథముల నుండి సంగ్రహింపబడి సమకూర్చబడిన గ్రంథమిది. రచయిత దీనిని "ప్రస్తావాను సంధాన కావ్యము" అనెను. మరియు "ఒకే వర్ణనీయాంశము నుద్దేశించి వివిధ కవులయొక్క భిన్న శీలులను రచనలను సంకలిత మొనర్చు గలది సంధాన కావ్యమన దగును. ఈ లక్షణానుగుణ్యముగాఁ బద్యములు, ఆ వెంబడిని వ్యావహారిక శైలిలోని వచన రచనలు గ్రాంధిక శయ్యలోని వచన రచనలు ఇందు సంకలిత మొనర్పఁ బూనుచున్నాను. అట్లొనర్పఁ బడుటవల్లఁ బ్రస్తావమందున్నట్టి యంశము బహువిధ విదర్శనాత్మకమై విశ్వసనీయమయునట్టి నిర్ధారణ నంద గలదు" అని ఈ విధముగా తమ గ్రంథ సంకేత నిర్వచనమును, తమ గ్రంథ స్వరూప స్వభావములను రచయిత విశదము చేసెను. రచయిత దృష్టినిబట్టి చూచినచో నీ గ్రంథముఁ బహుళార్థ సాధకముగా కన్పించుచున్నది. ఇందే యంశమునకు ప్రాధాన్యమున్నదో దేనికి లేదో తేల్చి చెప్పుట కష్టము. అయినను గ్రంథస్థ విషయ మర్యాద ననుసరించి చెప్పినచో పూసపాటి వారికి మాధవవర్మ మైలమభీమన లిరువురును మూలపురుషులలో కలరనుట నొక్కదానినే బహూదాహరణములతో నిరూపించుట మాత్రమే రచయిత యుద్దేశమని చెప్పవలసివచ్చును. ఆ లెక్కను ఇది యొకానొక చారిత్రకాంశమును బుజువు పరచు గ్రంథము. ఇట్టివి కావ్య శబ్దముచేత పేర్కొనబడ గూడనివి. ఒకవిధమైన పరిశోధన గ్రంథములు. అంతే.

పైన చూపబడిన రాజకీయ చరిత్ర సంబంధి యంశముతో వాఙ్మయ చరిత్రకు కొంత ప్రమేయమున్నది. జనాశ్రయఛందమును సంస్కృతమున రచించినది మాధవవర్మయా ? గణస్వామియా ? గణదాసా ? అను విషయము వివాదాస్పదము. పూసపాటివారి వంశ మూలపురుషులలో మాధవవర్మ కలడన్న దాని కుపపత్తులుగా దాదాపిరువది ప్రాచీనాధునిక గ్రంథములనుండి పద్యములను— గద్యములను శ్రీజగన్నాథశర్మగా రెత్తి వ్రాసిరి. అందు కనీసమొక్కదానియందుకూడ మాధవవర్మకు జనాశ్రయ ఛందముతోగల సంబంధము సూచింపబడి కూడలేదు. అట్టి సూచనను పసిగట్టగలిగియుండినచో శ్రీ శర్మగారి పరిశోధన దీప్తికెక్కియుండెడిది. "ఛందశ్శాస్త్ర పరికరములగు లఘు గురు గణాది గణితములందు పాండిత్యమమరి"నందున 'గణస్వామి' "గణదాసు" అని మాధవవర్మ వ్యవహరింపబడినాడని, ప్రమాణరహితముగ, ఊహించుటలో విశేషము కానరాదు. జనాశ్రయ బిరుదమున్నంత మాత్రమున జనాశ్రయ ఛందోగ్రంథకర్తృత్వము మాధవవర్మకు కట్టపెట్ట వీలులేదు.

జనాశ్రయ ఛందమే కవిజనాశ్రయముగా తెనుగున ననువదింపబడినదనియు, ఆ యనువాదముతో భీమకవికి సంబంధము కలదన్న విషయముమూకూడ పైదాని వంటిదే. కాకినాడ ఆంధ్రసాహిత్య పరిషత్తువారికి లభించిన పది కవిజనాశ్రయ తాళపత్ర ప్రతులలో నొక్కదానియందు మాత్రమే గల, ఇంతకుమునుపే పరిశోధకులచేత ప్రక్షిప్తములుగా నంగీకరింపబడిన, ఆరు పద్యములనే పట్టుకొని శ్రీ జగన్నాథశర్మగారు "జనాశ్రయ ఛందమును కవిజనాశ్రయ బిరుదాంచితుడగు మల్లియరేచన పేర ప్రణీతకృతిగా వేములవాడ భీమ మనీషి తెలుగునందు కవిజనాశ్రయముగ అనువదించిన సందర్భము నిర్ధారణగనే పల్కవచ్చును." అని వ్రాయుట కాలక్రమాగత పరిశోధనాంశముల నలక్ష్యము చేయుటయే యగును. మైలమ భీమన పూసపాటివారి పూర్వులలో నొకడనుటను చెప్పు నాల్గయిదు గ్రంథములలో నొకటి గూడ భీమకవిని పేర్కొనుటగాని, పేర్కొనిన రాచిరాజు 'పీసమాల' అతడు కవిజనాశ్రయ కర్తయని చెప్పుటగానిలేదు. కవిజనాశ్రయకర్త భీమకవి కాడు. పరాస్తము చేయబడి సిద్ధముగానున్న అంశములను నూతన ప్రమాణములతో వెలికొల్పుటకు వీలుకానప్పుడా విషయముల నెత్తనేరాదు. ఎత్తి తిరిగి ప్రాతపాటనే పాడిన నేమగున్ను ? మరియును కవిజనాశ్రయ గ్రంథము సంస్కృత జనాశ్రయ గ్రంథానువాదమనుటను నిరూపించు ప్రయత్నము కూడ శ్రీ శర్మగారు చేయలేదు. "కవిజనాశ్రయ రచయిత నాగవర్మ (కన్నడ) ఛందస్సును ననుసరించి రచియించి"నట్లు శ్రీ నిడుదవోలు వేంకటరావుగారున్ను ఒకటి రెండుదాహరణముల నిచ్చిరి గాని "మూలమనదగిన" జనాశ్రయ ఛందస్సుతో

# గ్రంథ విమర్శలు

వీ కవిజనాశ్రయమునకుగల దగ్గరతనమును చూపలేదు. నిజము నకు జనాశ్రయ కవిజనాశ్రయములకు సంబంధములేదు.

విష్ణుకుండిన మాధవవర్మ ధర్మపరతను నిరూపించు కథాఘట్టమును ప్రస్తావించుచు శ్రీ జగన్నాథశర్మగారు "ఈ కథానకము కరుణరస పూరితము. హృదయ విదారకరము. న్యాయావేశస్ఫోరకము. ఇయ్యది ఖండకావ్యాకారమునవెల యింపబడ దగియున్నది. ఇందులకు ఆంధ్ర సారస్వతమున న్వేషింపగా నాకొక యసమగ్ర ప్రతి శిథిలావస్థలో లభించినది. కథ సాంతముగా నున్నది. దానికి కర్త ఎవ్వరో తెలిసికొనగల యవకాశము చెడినది. దాని నిచ్చట నుగ్గడించుటవల్ల వాఙ్మయ పుష్టి ఏర్పడ గలదని యాశించుచున్నా" నని ఉదాహరించిన పద్యములు శ్రీ విశ్వనాథ సత్యనారాయణ గారివి. ఆంధ్రప్రశస్తి లోని 'మాధవవర్మ' ఖండిక మొత్తము — పరిశోధన మిట్లున్నచో తట్టుకొనుట కష్టము. శ్రీ శర్మగారి ఈ గ్రంథ మునకు "ఉపోద్ఘాతము" వ్రాసిన శ్రీ చిలుకూరి పాపయ్య శాస్త్రిగారును పై యద్భుతమును గమనింపకపోవుట చిత్ర ముగా నున్నది.

శ్రీ జగన్నాథశర్మగారి పరిశోధన పద్ధతి అంత పసిగా లేదు. లభించిన గ్రంథములనుండి పుటలకుపుటలుగా క్రోడీ కరించుటయే గాని, అందలి విషయముల సత్యాసత్యములకు సంబంధించిన కృషి చాలా స్వల్పముగా కనిపించుచున్నది. "నెల్లూరు మండలమున సింగరాయకొండ— కొచ్చెర్లకోటల మధ్య భూమి ఏఱువనాడని చెప్పబడుచున్నది" అని లభించిన గ్రంథమునుండి ఎత్తివ్రాసినారేకాని, ఈ ఏరువ నాటిని గురించి మరి ఎచ్చటనైన కలదేమో అని చూచినారు కారు. నాల్గు శాసనములలో నీ విషయమున్నది. చారిత్రకులా విషయ మును చర్చించి ఏఱువనాటి స్వరూపమును నిర్ణయించిరి. ఈ 'భారతి' పత్రికాముఖముగనే ఆ పని జరిగినది.

ఇది పరిశోధన గ్రంథమనబడినది గనుక నింత వ్రాయ వలసివచ్చినది. శ్రీ జగన్నాథశర్మగారి ఈ గ్రంథము వలన అంత ప్రసిద్ధికిరాని మంచి కవులొక పదిమంది వారి గ్రంథములు తెలియవచ్చినవి. మాధవవర్మ—మైలమ భీమ ఇరువురును పూసపాటివారి మూలపురుషులలో కలరని గట్టిగా తెలియు చున్నది.

## జీవన జ్యోతి

రచన : శ్రీ కడెము వేంకట సుబ్బారావు, ప్రచురణకు : రచయిత. తెలుగు పండితుడు. శ్రీ బండ్ల బాపయ్య హిందూ హైయ్యరు సెకండరీ స్కూలు. వేటపాలెము, బాపట్ల తాలూకా, వెల : ఒక రూపాయి, క్రౌను : 48 పుటలు

జిజ్ఞాసమయమైన లఘుకావ్య మిది. జిజ్ఞాస ఆత్మ తత్త్వమును గురించినది. లఘుత్వము కావ్యము యొక్క నిడివికి సంబంధించినది. మొత్తము 170 పద్యములు 16 గేయములు గలవు. "ఆత్మకు రూపవయో లింగములు లేవు. ఐనను సాధకులు దానిని గురించి రూపాదిక మేర్పరచుకొనుచునే యున్నారు. అట్లే నేనును ఆత్మ తత్త్వమును ప్రియ సఖిగ భావించితిని. ఈ స్త్రీ భావన వేదనాదులందు సైతము కాన్పించుచున్నది. కావున 'సాధకుడు— సాధ్యము' అను దృష్టితో దీనిని జదువ గోరుచున్నాను" అని గ్రంథకర్త పాఠకులు చేసిన "విన్నపము"ను బట్టి సహృదయులు పోవలయును.

మన నవ్యాంధ్ర సాహిత్యమున నీ శతాబ్దము మొదట వచ్చిన భావ కవిత్వ ఉద్యమమునకు మూలభూతమైన రొమాంటిక్ ఉద్యమ మాంగ్ల భాషా ప్రపంచమున పదునెనిమిదవ శతాబ్దము ఉత్తరార్థముననే ప్రారంభమై పంధొమ్మిదవ శతాబ్దమున పుంజుకొన్నది. ఆంగ్ల భాషయందలి రొమాంటిక్ కవులలో అనివార్యముగా పేర్కొన బడవలసిన వారు స్కాటును వదలినచో నలుగురు. వర్డ్సువర్తు, కాలరిడ్జి, షెల్లి, కీట్సు. వీరిలో గల పరస్పర భిన్న లక్షణములను వదలి సామూహికముగా చూచినచో రొమాంటిక్ కవిత్వమునందు ప్రకృతి రామణీయక విచారము, తాత్త్విక భావతల స్పర్శనము, ఇంద్రియ పరితృప్తి మాత్ర విహితము కాని మనోహారి శృంగార రూప ప్రేమైక ప్రపంచ లీలా సౌందర్యోపటా ధ్యాత్మికామోదము యొక్క వెల్లువు, అలభ్య ప్రియా రూప నిరూపణా పర నిరతాన్వేషణము— ఇత్యాదుల మిశ్రమ కలఘోషస్ఫూర్తి తోచును. తెనుగు భావకవిత్వమున చివరి లక్షణము మరియు మొదటిది కనిపించనంతగా మిగిలిన రెండునూ తోచవు. అంతగా ననుటచేత కొంత గ్రంథము కలదనియే యర్థము. ఈ దృష్టిని బడి చూచినచో ఈ "జీవన జ్యోతి" అచ్చమైన భావ కవిత్వ గ్రంథము.

మన తాత్త్విక విచారము మార్గమున బోయినచో ప్రకృతి పురుషులు గలరు. పురుషుడు పరమాత్మ. పురుషుని యొక్క సంకల్ప రూపమైన స్త్రీమూర్తి ప్రకృతి. ప్రకృతి పరిణామశీల. పురుషుని యొక్క భోగమున కైనది. మనకు శాక్తేయ మతమున్నది. అందు (దాదాపు) పురుషుని స్థానము శక్తి ఆక్రమించును. శక్తి —ప్రకృతి. అమ్మవారు. అందామె ఉపాస్యము. ఉపాస్యము పాసిత యొక్క యూహా వైభవమును బట్టి నానారూపములు కలదియగు నన్నదియు మన సంప్ర

దాయమున నున్నది. శ్రీ సుబ్బారావుగారు హాస్యమును ప్రియ సఖిగా భావించిరి.

"అలపుణ్య లోకాన ఆనంద సీమలో
అందాల పూదోట— అందునున్న
అమృతంపు సరసిలో అచటి గడ్డను బుట్టి
బంగారు కాడతో పైకి సాగి
ముగ్ధ మోహన కళా ముకుళ భావము వీడు
చున్న ఈ శతపత్ర సుందరెవరు ? ? ?"

ఈ మొత్తము గ్రంథ మీ ప్రశ్న మీద బయలుదేరి, ప్రకృతి గత సర్వ సుకుమార వస్తు శృంగార భావవైఖరీ సమలంకృతమై రమణీయముగా నున్నది.

"ఈ యవ్యక్త రసార్ద్ర గీతి యెటదో ? ఏ నింత నిశ్శబ్దిగాన్
నాయీ కర్ణము తాకు చుండె— కనగా నాలోనె యెందుండియో
తీయంబై వినవచ్చెఁ గాన యెవరో తెల్లంబు కాదే విటో
నా యందున్ మణి దీపమాల ఇడవే— ఆ గుట్టు పట్టించెదన్."

అవ్యక్త మనగా ప్రకృతి. పురుషుని యందు సంకల్పము పుట్టునవరకది వ్యక్తము కాక వానియందే యుండును. కనుక నది యవ్యక్తము. మణి దీపము జ్ఞానమునకు ప్రతీక. "ఊహా కల్పిత సుందరీ" యన్నప్పుడును నిట్లే భావింప వలయును."

"చిగురాకు మోసులో చిన్నారి రేకుల
విరిసెడి విరజాజివే సుమాంగి
గాలి దేలెడి మబ్బు మేలిముసుంగులో
వికసించు క్రొమ్మించువే లతాంగి
నీలాల నింగిలో నెల వంక దోనెపై
వేలుగు వేసురు జుక్కవే కృశాంగి
విద్రాణమై యున్న నిఖిల చిజ్జడముల
కాల వశ దశావస్థ లొక్కటియు లేని
నవనవోన్మేష మృదుల సౌందర్యవతివి
సచ్చిదానంద లక్ష్మివి సదయహృదయ
వమృత లహరీ తరంగమై అరుగుదేవె ? ?"

ఈ గ్రంథమున ప్రతి పద్యమును నిట్టి సామగ్రిచేతనే నిర్మింప బడినది. భావ చిత్రములను సంభావించ గలుగుటతో పాటు కొంత దేశీయమైన తాత్త్విక సద్సంప్రదాయమునందభినివేశమున్నగాని ఇట్టి గ్రంథముల పరమార్థ మవగతము కాదు. శ్రీ సుబ్బారావుగారచ్చమైన భావకవి హృదయ సౌభాగ్యము కలిమిని సాంప్రదాయకమైన విజ్ఞాన వివేచన మూలభూతముగా చేసి ఈ 'జీవన జ్యోతిని' వెలయించిరి. మంచి యూహా వైభవము, వైచిత్రి, గల కావ్యము.

"అందాలు విరిసెడి అభిరామ నేత్రనై
క్రీగంట పాలు పొంగించి నావు
చిరునవ్వు చిందెడి స్నిగ్ధాధరోష్ఠినై
ఇగురు దానిమ్మ పూయించి నావు
మాలూర ఫలముల మస్రుత వక్షోజనై
శృంగార లక్ష్మి సృజించినావు"

విషయ విన్యాసములో నిట్టి చమత్కారముల నవలీలగా చేయగల చాకచక్యము కల కవి శ్రీ సుబ్బారావుగారు. ఈ గ్రంథము జాగ్రత్తగా చదువదగినది.

పద్య రచన విషయమున రచయిత శిల్పము నింకను పెంపొందించుకొని సార్థక శబ్దములను విచారించి గ్రహించుట నలవాటు చేసికొని మునుముందీ కోవకు ఉత్తమ కావ్యములను త్రికరణశుద్ధి కలిమిని శ్రీ సుబ్బారావుగారు వ్రాయుటకు పరమేశ్వరుడనుగ్రహించినచో ఆంధ్ర వాఙ్మయ ప్రపంచమున నొక మంచి కవి వెలసినట్లు. ఈ రెండు మూడు చోట్ల శ్రీ వెంకటపార్వతీశ్వర కవుల యొక్కయు, కరుణశ్రీ యొక్కయు రవీంద్రుని యొక్కయు ఛాయలు కనిపించుచున్నను స్వతంత్రమైన ప్రతిపత్తి గల భావ కావ్యమిది. "భోత్తిగా" "ఉజ్జీవింతు" "తెగించు" "లిగొట్టెడి" "పిండవే" "మునక తేలి కలు" "చేయి ఇచ్చి" "తాక కుండ" ఈ మొదలైన మాటలు ప్రకరణముల నప్పిలేవు. "నీవున్నావని నే నెరుంగకయె ముందే" అన్నది "ఎరుంగుటకు" అని యుండిన బాగుండును. "పోవిడు చున్ గిరాటిడుచు—" ఇందు 'పోవిడుచుచున్' అనియే యుండవలయును. ఛందస్సు కొరకు వర్ణమొకటి తగ్గింప బడగా నర్థమునకు చేటు వచ్చుచున్నది. అల్పములైన ఇట్టి చరిత సంస్కార రూపములను తొలగించుకొని శబ్దార్థ సంబంధి యౌచిత్యమును గురించి బుద్ధిని పెంచుకొన్నచో శ్రీసుబ్బారావుగారాధునికాంధ్ర కవులలో పేరుకు రాగలరన్న ఆశాభావము కలుగుచున్నది.

## రసధుని

• రచన : శ్రీ విజయాత్రేయ, ప్రతులకు : నవ్యాంధ్ర సాహిత్య సమాజము, తలముడిపి— పోస్టు, కర్నూలు జిల్లా, వెల : రు 1—50)

ఇది చిన్న ఖండకావ్యము. ప్రబోధము, సుస్వాగతము, ఆశాకిరణం, గంధఫలి—ఈ మొదలైన ఇరువది శీర్షికలతో

గల పద్యము లిందున్నది. కవి శ్రీమాన్ నండూరి రామకృష్ణ మాచార్యుల వారి శిష్యుడు. శ్రీ జంధ్యాల పాపయ్య శాస్త్రిగారి ధోరణిని పట్టుకొని కవిత్వము వ్రాయుట కలవాటు చేసికొనినట్లు కనిపించుచున్నది. ఇదంతయు ప్రారంభ కవిత్వముగా నున్నది. ఒక ధోరణిలో పద్యము వ్రాసికొని పోవుట బాగుగా చేతనైనదీ కవికి.

''అసలది కొండకోన— అటనందపు పూవులతోట—
తోటలో
మినమిన లాడు క్రొందళుకు మించుల పచ్చల మేడ—
మేడలో
ముసిరిన జవ్వనంపు రసపూర్ణిమ. అప్సరసా ? పిశా
చమా ?
రసికయు ? ఏదియున్ దెలియరాదు. భయంపడ
కేమి సేసెడిన్.

''మా బావతో'' ''ఎవరికోసం'' ఈ శీర్షికలతోనున్న పదునారు పద్యములును రచయిత యొక్క అపరిణతమైన చిన్న తనపు టూహలకు నిదర్శనములు.

''వలపు కోపము జెందు భ్రూ భంగమందు
నిలచె నధికార గర్వ సంపలయు మొకటి
చిగురు పగడాల పసినవ్వు పొగరులందు'
కులికె మన్నీల చిరుదు చిన్నెల పసందు''

ఇట్టి కొన్నిపాటి చమత్కార కల్పనా సామర్థ్య మున్నందున, జాగ్రత్తగా కృషి చేసినచో భవిష్యత్తు కవిని దీప్తికి తేనచ్చును.

—హేమేంద్ర.

# కట్టబొమ్మ

వీర రస ప్రధానమైన నాటకం : రచన : డాక్టర్ గిడుగు వెంకట సీతాపతి, ప్రకాశకులు : క్లాసికల్ బుక్ సెంటర్, నారాయణగూడ, హైదరాబాదు, పుటలు : 105, వెల : రూ. 2.50.

చీనా దురాక్రమణను పురస్కరించుకొని, ప్రజలలో దేశభక్తి పెంపొందింప జేయాలనే ఉద్దేశ్యంతో, ఆంధ్ర సాహిత్య అకాడమీ వారి ప్రకటనను అనుసరించి, శ్రవ్యంకన్నా దృశ్యకావ్యం సర్వజనోపయుక్తంగా ఉంటుందనే భావంతోనూ, ''కావ్యేషు నాటకం రమ్యం'' అన్న పెద్దల మాటను స్మరించి, వీరపాండ్య కట్టబ్రహ్మన ఆంగ్లేయులకు లొంగక స్వతంత్రించి, ప్రాణా లర్పించిన ఘట్టం కథావస్తువుగా గిడుగువారు రచించిన నాటకం ''కట్టబొమ్మ''. ''బ్రహ్మ'' శబ్దాన్ని ''బమ్మ'', ''బొమ్మ'' అని వికృతిగా మార్చి కట్టబ్రహ్మను కట్టబొమ్మగా మార్చారు రచయిత.

గిడుగువారిది విద్వత్ కుటుంబం. వారు సాహితీ క్షేత్రంలో పలు రకాల పంటలు పండించిన కృషికులు. వయో వృద్ధులు. బహుముఖానుభవజ్ఞులు. వైయాకరణులు. ఛందశ్శాస్త్ర వేత్తలు. విద్వత్కవులు. ఇన్నింటికీ మెరుగునిచ్చేది వారి సౌజన్యం. నిరాడంబరత. అహంకారరాహిత్యము. ఇటువంటి గిడుగువారు, వీరరస ప్రధానమై, దేశభక్తి ప్రబోధకమైన ఈ నాటకం రచించడం ప్రశంసనీయం. దానికి సాహిత్య అకాడమీవారి బహుమతి లభించడం సముచితం. చీనా దురాక్రమణ సాగుతున్నంత కాలమేకాక, శాశ్వతంగా నిలిచిపోవలసిన, నిలిచిపోగల దృశ్య కావ్యరాజం ఈ పుస్తకం.

ఆదినుంచీ మనదేశం పరదేశీయుల దురాక్రమణలకు పాల్పడుతూ ఉంది. గ్రీకులు, హూణులు, మంగోలులు, మహమ్మదీయులు, ఆంగ్లేయులు, చైనీయులు ఎడతెరిపి లేకుండా మనదేశాన్ని దోచుకున్నారు. దోచుకుంటున్నారు. మన సాంఘికాభివృద్ధిని ఆటంకపరుస్తున్నారు. అయినా అప్పుడప్పుడు మన వీర భారతీయులు విజృంభించి, కత్తి ఝుళిపించి, తొడగొట్టి, మీసం మెలిపెట్టి అవక్ర పరాక్రమంతో ఎదిరించి వారివారి విస్తరణను అరికట్టారు. ఆంగ్లేయుల శక్తిసామర్థ్యాలనే సవాలుచేసి ప్రాణాలర్పించిన అమర వీరులలో కట్టబ్రహ్మన ఒకడు. అతడు ఆంధ్రుడు కావడం మనకు గర్వకారణం. మనదేశ వాస్తవ చరిత్రలోని సువర్ణ పత్రాలలో ఒకటి మన బ్రహ్మన్నది.

రచన చక్కని వ్యావహారికంలో సాగింది. చదువుతున్నంత సేపూ దృశ్యం మన కన్నులముందు కనబడుతుంది. ప్రదర్శింపబడుతున్నప్పుడు ఎంత వాస్తవంగా ఉంటుందో చెప్పవలసిన పనిలేదు. మధ్య మధ్య పద్యాలు సందర్భోచితంగా, సరళ సుందరమైన భాషతో రచింపబడ్డాయి. నల్లన్న చెప్పిన పద్యం చూడండి !

మనమేనాడును అన్యదేశముల సంపాదింప కాంక్షింప, మ
న్యుని హింసింప దలంప, మెప్పుడును ధర్మోత్పన్న
కార్యంబులే
మనకున్ లక్ష్యములౌను, గాని మనలం బాధింప దండెత్తి
వచ్చిన సైన్యంబులతోడ బోరుటకు సంసిద్ధంబుగా
నుండమే ?'' పుట—65.

ఎంత అనర్గళంగా సాగింది పద్యం ! నల్లన్న తన సైనికులతో చెప్పిన ఈ పద్యం, ఆనాడు శివాజీ, ప్రతాప్, ఝాన్సీరాణి, మల్లారెడ్డి మొదలగు మహావీరులు స్వాతంత్ర్య

సంరక్షణార్థం తమ ప్రత్యర్థులతో పోరేటప్పుడు, తమ సైనికులతో చెప్పినట్లుగా ఉంది. ఈనాటికైనా మన భావం అదే కదా! కాబట్టి రచయిత పరోక్షంగా మన సైనికులకు ఈ పద్యం ద్వారా ఉద్బోధిస్తున్నారు.

బ్రహ్మన్న చెప్పిన ఈ పద్యంలో ఉపమానం చక్కగా ఉంది.

రాజుపోయిన నేమి రాజ్యంబు కలదంచు
ప్రజలెల్ల పరసేనపై బడిన రీతిగా
బెదరించు చీకటుల జెదరగొట్టగ దలచి
అభ్రమున వెలుగొంద నరుదెంచె తారకలు.'' పుట-22

''ఇందులో ''రాజు'' పర్యాయపదంగా చంద్రుణ్ణి తీసుకుంటే క్రింది రెండు పాదాలు అవసరం లేకయే భావం బోధపడుతుంది. రాజు=చంద్రుడు, రాజ్యము=ఆకాశము, ప్రజలు=చుక్కలు, పరసేన = తిమిరజాలము అనే అర్థాలతో ఉపమించబడింది. ఇది నాటకంలోని పద్యంలాకాక, చక్కని కావ్యాంతర్గత వృత్తంలా అలరారుతుంది.

అసలు నాటకంలో పద్యాలు అవసరమా ? అని ప్రశ్నించేవారికి ''ఎటొచ్చీ పద్యాలు కథాగమనాన్ని ఆటంకపరచకుంటే పరవాలేదు'' అని తమ పీఠికలో న్యాయమైన నిర్ణయంచేశారు, శ్రీయుతులు పోణంగి శ్రీరామ అప్పారావు వడ్లమూడి గోపాలక్రిష్ణయ్యగారలు.

పాత్రధారులు వివిధ జాతి, భాషలకు చెందినవారైతే, వారివారికి తగిన భాషనే మాట్లాడించడం ముఖ్యంగా దృశ్యకావ్యంలో అవసరం. బహుమతి ప్రదాన కార్యక్రమం జరుగుతున్నప్పుడు, తమ ఉపన్యాసంలో డేవిస్ దొరగారు ఉపయోగించిన భాష శుద్ధ తెలుగు. ఆంగ్లేయుడైన డేవిస్ దొరగారిచేత చక్కని తెలుగు మాట్లాడించడం వాస్తవ విరుద్ధం. తెలుగు మాతృభాషగాగల మనమే, కొద్దిగా నేర్చిన ఇంగ్లీషును మధ్య మధ్య చొప్పించకుండా మాట్లాడలేం. అటువంటప్పుడు ఇంగ్లీషు మాతృభాషగాగల దొరగారు ఒక్క ఇంగ్లీషు ముక్కనైనా వాడక పూర్తిగా తెలుగులో ఉపన్యసించడం సహజంగాలేదు. తెలుగు నేర్చిన క్రిస్టియన్ మిషనరీ సభ్యులు ఉపన్యసించడం చూస్తున్నాముకదా ! బ్రౌనుదొరగారిలా డేవిస్‌దొరగారు, తెలుగు పండితులుకారు. కాబట్టి వారిచేత ఆంధ్రాంగ్లముల మిశ్రమ భాష పల్కించడం అవసరం. అంతేకాని సౌభ్రాత్రం సౌజన్యం, కళాపోషణంవంటి పదాలు డేవిస్‌గారి నోట వెల, వడడం అసహజం.

ఇంకొక సంగతి. ఒకనాడు కట్ట సోదరులు వనానికి వేట నిమిత్తం వెళ్ళారు. ఒకచోట వారి వేట కుక్కలు కుందేళను చూచి భయపడి పోతాయి. ఒక్కడుగు ముందుకు వేయలేకపోతాయి. అది గమనించిన కట్ట సోదరులు ఆ చోట ఏదో ప్రభావం ఉందని భావించి అక్కడే ఒకకోట కడతారు. ఈ కల్పన విజయనగర సామ్రాజ్య స్థాపనను తలపిస్తున్నది.

హరిహర, బుక్కరాయలు వేటకై వెళ్ళి వనంలో ఒకచోట కుందేళ్ళచే తరుముబడుతున్న వేట కుక్కలను చూచి ఆశ్చర్యపోతారు. ఈ విషయం తమ గురువర్యులైన విద్యారణ్య స్వామీవారికి తెలియజేయగానే, అది మహిమగల చోటనీ, అక్కడే తమ రాజధాని నిర్మించాలనీ ఆదేశిస్తారు. తత్కారణంగా అక్కడ విజయనగర సామ్రాజ్యం వెలసిందనే విషయం చరిత్ర ప్రసిద్ధమైన విషయం.

హృదయానికి హత్తుకుపోయే విషాదాంతమైన ఈ దృశ్య కావ్యం ప్రతిఒక్కరూ చదువదగినది.

## ధారాపాత్ర

(రచయిత : స్వర్ణరాజ హనుమంతరావు, వెల : రూ. 1.25, ప్రతులకు : స్వర్ణదీక్షితులు, వానపాముల పోస్టు, కృష్ణాజిల్లా.)

పదహారు గేయఖండికల సంకలనం ఈ పుస్తకం. మనసులోని ఏ భావాన్నైనా వచనరూపంలో వ్రాసి మధ్య మధ్య విరగ్గొట్టి ఇష్టం వచ్చిన చోట ఆపి, ముక్క ముక్కలుగా చేసి కొన్ని పంక్తులుగా వ్రాయడం గేయలక్షణం కాదు. గానానుకూలమైనట్టిది గేయం. గానానుకూలం కావాలంటే లయాబద్ధం కావాలి. ఈ లయకే ఛందస్సనే మారుపేరు.

''ఛందస్సు'' అనగానే, ''అది ప్రాచీన ఛాందసులకే కాని మన కెందుకు ?'' అనే దుర్బలమైన అభిప్రాయం ఈ నాడు కొందరికుంది. మరి అటువంటప్పుడు ''గేయం'' అనే శబ్దార్థానికి వందమైళ్ళ దూరంలో ఉండేట్టు వచనం వ్రాసి ''ఇది గేయ కవిత్వం'' అనిపించుకునేట్టు తాపత్రయపడటం హాస్యాస్పదమైన విషయం.

ఈ పుస్తకంలో ఏ ''గేయం'' చూసినా వ్రేళాడే గొలుసులా కనుపిస్తుంది, ఒకటి— రెండు మినహా.

''అనుకోకుండా
అనుకూలిత
అగుపించే
అవకాశం
హాయి హాయి''

ఈ పదాలను ఏ విధంగా గేయంలా పాడగలరో ? ఈ పదాలన్నీ కలిపి వ్రాస్తే వచనం కాదా ? ఒక్కోచోట

"చెలీ !" అన్న ఒక్క పదమే ఒక పాదంగా వాడడం కూడా కనుపిస్తుంది.

"ఎదలోన కదలింది ఒకనాడు ఆశ"

అనే గేయం మాత్రం ద్విపదచ్ఛందంలో నడచింది.

"ప్రపంచాన్ని తరచి తరచి
ప్రతి మనిషిని వెదకి వెదకి"— వంటి పాదాలు— అక్కడక్కడా మాత్రా ఛందోబద్ధమై ఉన్నాయి. ఈ విధంగానే ప్రయత్నిస్తే రచయిత కృతకృత్యులు కాగలరు.

"ఒక మాట"లో విద్వాన్ విశ్వంగారు "వ్రాయువయ్యా యువకవీ ? ఇంకిన్ని వ్రాయి." అన్నట్లు వీరు ఇంకా వ్రాయాలి. బాగా వ్రాయాలి.

## ఆంధ్ర విద్యార్థి వ్యాకరణము

[రచయితలు : కోట సోదరకవులు; ప్రతులకు: కవిచంద్ర గ్రంథమాల; 147, మింట్ స్ట్రీట్, మదరాసు—1; పుటలు : 48; వెల : 75 న. పై.]

వ్యాకరణ విహీన భాషాజ్ఞానము పునాదిలేని సౌధము వంటిది. అసలు వ్యాకరణము లేని భాష నిర్జీవము. కాబట్టి ఏ భాషా పాండిత్యం లభించాలన్నా వ్యాకరణ పఠనం అనివార్యమైంది.

వ్యాకరణం అనగానే పులిని చూచినట్లుగా భయపడుతున్నారు—ఈనాటి విద్యార్థులు. దానికి కారణం ? ఉపాధ్యాయులు, విద్యార్థులకు అందులో అభిరుచి కలిగేటట్లు బోధించకపోవడం, తరువాత—వ్యాకరణ గ్రంథాలు సులభ శైలిలో రచించ బడకపోవడమూ.

వ్యాకరణమే భీతిగొల్పుతుంటే, దాన్ని విశదీకరిస్తూన్న వాక్యాలు అంతకన్నా అర్థంకాకుండా పోతున్నాయి—ఈ నాటి వ్యాకరణ గ్రంథాల్లో, సాధ్యమైనంత సులభశైలి వాడబడని వ్యాకరణ గ్రంథం పూర్ణఫలదాయి కాజాలదు.

"బాలురకు సుబోధక మగునట్లు" రచించుటలో ఈ రచయితలు కృతకృత్యులు కాలేకపోయారు. హైస్కూలు విద్యార్థుల కొరకు రచింపబడ్డ ఈ పుస్తకంలో—

". . . . 'అడ' ల్ కచ్చు పరంబగునపుడు ద్విరుక్త టకార మగును."

"కర్మధారయమునం దత్సమముల కాలు శబ్దము పరమగునపు డత్వమున కుత్వమును రుగాగమును."

"కొండొకచో సమాసంబుల నామ్వాది కసుమ్వాదిము వర్ణంబులు సజ్, ష—వర్ణంబులగు."

ఇత్యాది వాక్యాలు విద్యార్థులకు "సుబోధకము"లా ?

"కొండ అద్దమందు కొంచెమై యుండదా ?" అన్నట్లు అనేక వ్యాకరణాంశాలు 48 పుటలలో చర్చించబడటం మాత్రం ప్రశంసనీయం.

—దేవరెడ్డి వెంకటరెడ్డి.

## మహర్షి శ్రీ స్వామి దయానంద సరస్వతి

రచన : డా. సి. ఆర్. రామకృష్ణారెడ్డి. 1722, రిసాలా బజారు. బొలారము (ఎ. పి). వెల : 1—00.

ఆర్యసమాజ వ్యవస్థాపకులు శ్రీ స్వామి దయానంద సరస్వతి జీవితచరిత్ర పఠనార్హమైనది. సామాన్యులకు అందుబాటులో నున్న శైలిలో ఈ గ్రంథరచన సాగినది. "తెల్య లేదు" వంటి పదాలు అక్కడక్కడా కన్పించినప్పటికీ భాష కుంటువడ లేదు.

స్వామీజీ విగ్రహారాధనమును నిషేధించడానికి విస్తృతమైన కృషి సల్పినారు. మహాద్భుత శిల్పములనియైనా ఆలోచించక ప్రజలు దేవతా విగ్రహములను గంగపాలు చేసిన ఘట్టములు సహిత మున్నవి.

భారతీయ సంస్కృతి స్వేచ్ఛాయుతమైనది. ఎందరో మహనీయులు ఉద్భవించారు. నేడూ ఉన్నారు. భవిష్యత్తులోనూ రానున్నారు. అట్టి మహర్షుల కోవకు చెందిన దయానంద సరస్వతి చివరిదశలో విషప్రయోగమునకు గురికావడం విధి విలాసము గదా !

స్వామీజీ సంచార కార్యక్రమమున ఎదుర్కొన్న సంఘటనలు అపూర్వములైనవి. అచంచలమైన వారి ఆత్మస్థైర్యము ఆదర్శమైనది.

"మనుష్యకృత గ్రంథములు పరమేశ్వరుని నిందతో నిండియున్నవి. ఋషుల కృతులయందిట్టి దోషములు లేవు" అన్న గురువుగారి వాక్యమును విశ్వసించిన స్వామి దయానంద సరస్వతి ఒకచోట "ఈశ్వరునికి సహితము భ్రమ కలుగునని" వ్రాయబడియున్న గ్రంథమును విసర్జిస్తారు.

ఏకేశ్వరోపాసనను విస్తృత ప్రచారమొనర్పడానికి జీవితాన్ని ధారపోసిన దయానంద సరస్వతి జీవిత చరిత్ర అన్ని మతాలకు పఠనీయ గ్రంథమే. వివిధ మతాలపట్ల సహనమును, ఐక్యతను సాధించి విశ్వమానవ సౌభ్రాతృత్వమును ప్రతిష్ఠించ

గోరే ఆధునిక సాంఘిక వ్యవస్థ ఇట్టి మహనీయుల సందేశాలను విస్మరించరాదు.

## తేజోమూర్తులు

రచయిత : శ్రీ దశిక సూర్యప్రకాశరావు. వెల : 1—10 ప్రకాశకులు : శ్రీ గోదా గ్రంథమాల. శ్రీమన్నారాయణాపురము, ఉల్లిపాలెము పోస్టు, దివి తాలూకా.

బాలసాహిత్యమునకని ఉద్దేశించిన ఈ గ్రంథములో శ్రీ జె. సి. కుమారప్ప, ఆంధ్రరత్న దుగ్గిరాల గోపాలకృష్ణయ్య, చిలకమర్తి లక్ష్మీనరసింహకవి, శ్రీ ఇమ్మానేని హనుమంతరావు నాయుడుగార్ల సంగ్రహ జీవితచరిత్ర లున్నవి.

## కొత్త వెలుగు

రచన : మాస్టర్ రవి. వెల : 0—20. చిరునామ : మాష్టర్ రవి. రాజాం, శ్రీకాకుళం.

కుష్ఠురోగ నివారణ ప్రచారార్థమై ఉద్దేశించబడిన ఏకాంకిక.

## జ ల జ

స్నేహపీఠం. అమీనా పేట, ఏలూరు. వెల : 35 పైసలు.

ఇందులో కాట్రగడ్డ లక్ష్మీనరసింహారావు, కాట్రగడ్డ ప్రమీలా రాణి, యద్దనపూడి రాంబాబు, కె. వెంకట రామారావు మన్నా అచ్యుతరావు, ఎ. వి. రంగయ్య గార్ల గేయములున్నవి.

## వి శా ర ద

సాహిత్య వైజ్ఞానిక మాసపత్రిక. వెల : 0.25. గౌరవ సంపాదకులు : శ్రీ ప  నాయక్, లోకావారి వీధి, అనకాపల్లి.

ఇది ప్రారంభ సంచిక. కథలు గేయాలూ ఉన్నవి.

## శ్రీ దేవీపత్రిక

ఎడిటర్ : వప్పంగి రామారావు. వెల : 0.30. జయపురం, కోరాపుట్‌జిల్లా.

ఈ పత్రికలో భగవాన్ శ్రీ అరవింద వ్యాసం చదువ దగినది.

## విద్యార్థి పద్య రత్నావళి

కూర్పరి : విద్వాన్ బయ్యిరెడ్డి సుబ్రహ్మణ్యం, ఆంధ్రోపాధ్యాయుడు, నెహ్రూ పురపాలకోన్నత పాఠశాల, తిరుపతి. వెల : 1—00.

కాలక్షేపానికి ఉపయుక్తమైన పద్యములతో కూర్చిన గ్రంథము.

—సభా.]



**Printed & Published For Nageswara Rao Estates (Private) Ltd., by S. Radhakrishna at The Andhra Patrika Press 6 & 7, Thambu Chetty Street, Madras-1**
**Editor: S. Sambhu Prasad.**